# చతుర కథలు

## స్వామియే శరణం...

నాకు చాలా కోపం వస్తోంది.

ఎంత కోపం అంటే ఎవరైనా పలకరిస్తే చాలు పోట్లాటకు దిగుదామన్నంత కోపంగా ఉంది. నిజానికి నేను శాంతమూర్తిని! దైవభక్తుణ్ణి. ఆ విషయం అందరికీ తెలుసు!

నా కోపానికి కారకుడు 'స్వామి' అన్న పేరుగల నా కొలీగ్! ఓ సంవత్సరం క్రితం రెండువేలు అతనికి అప్పుగా ఇచ్చాను. ఓ వారంలోగా ఇచ్చేస్తాననీ, తన భార్యకు సుస్తీగా ఉందనీ, నమ్మకంగా చెప్పి, నా మనసు కరిగించాడు. ఓ మంచి టేప్‌రికార్డర్ కొనటంకోసం నెలనెలా పొదుపుచేసి పోస్టాఫీసులో దాచుకున్న డబ్బు అతనికిచ్చేశాను. వారం, రెండు వారాలు, నెలరోజులు గడిచాయి. స్వామి డబ్బు ఊసెత్తటంలేదు.

మొహమాటపడుతూ అడిగానొకసారి. ఇంకో నెల గడువు ఇమ్మంటూ, తన ఇబ్బందుల లిస్టు నా ముందు చదివాడు. నా సింపతీతో మరో ఆరునెలలు కాలం గడిపాడు.

కానీ, "అయ్యో పాపం" అనుకోటానికి వీల్లేకుండా, కొత్త బట్టలు, కొత్త సైకిలు, చేతికి కొత్తవాచీ ప్రదర్శించటంతో నాకు వళ్లు మండిపోసాగింది. పైగా నేను అప్పు ప్రస్తావన తెచ్చేవిధం చూసేవారికి నేనే అతనికి అప్పు ఉన్నట్టూ, గడువుకోసం బ్రతిమిలాడుతున్నట్టూ అపోహపడేలా ఉన్నాయి. నాపట్ల స్వామి 'ఎక్స్‌ప్రెషన్స్' అలా ఉంటాయన్నమాట.

స్వామి గురించి నాకు తాజాగా తెలిసిందేమంటే, అతను కనిపించినవారందరి దగ్గరా అప్పు చేయటం, అది తీర్చటానికి మరో అప్పు చేయటమూనట! అదలా లింకులా సాగిపోతుందే తప్ప అప్పులు మాత్రం తరగవు. అప్పులు పుట్టించటంకోసం భార్య సుస్తీ పిల్లాడు రోగం, తల్లికి క్యాన్సర్... ఇలా తనవారికి లేనిరోగాలు సృష్టిస్తూ విలాసంగా జీవితం గడిపేస్తుంటాడు. నిండా మునిగినవాడికి చలి లేదన్నట్టు, స్వామికి అప్పులాళ్ల బాధ చీమకుట్టినట్టు కూడా ఉండదు. నాలాంటివారిని వాయిదాలేస్తూ ఏడిపించుకుతింటాడు.



నాలో అసహనం పెరిగిపోసాగింది. ఏనాడూ మనసులో కూడా ఉచ్చరించని బూతుపదాలు పెదవులుదాటి రాసాగాయి. ఫలితంగా నా అప్పు తీర్చాలని ఓరోజు ఖచ్చితంగా అడిగాను. మరో రెండునెలల దాకా కుదరదు బ్రదర్! అన్నాడు స్వామి.

"ఏమిటి పిచ్చి పిచ్చిగా ఉందా? నీ దగ్గర

కవర్‌ఫోటో: వికీహండా

డబ్బు ఎలా రాబట్టాలో నాకు తెలుసు! పోలీసు డిపార్టుమెంటులో నా బంధువులున్నారు'' అంటూ బెదిరించాను.

"ప్రైంమినిస్టర్ నీ బామ్మర్ది అయినా రెండునెలలదాకా నా దగ్గరనించి మీరు డబ్బు తీసుకోలేరు'' అంటూ విలాసంగా సిగరెట్ కాల్చసాగాడు.

అతసలా మాట్లాడుతున్నకొద్దీ నాకు పంతం పెరగసాగింది. "నీవేం చేస్తావో నాకు తెలీదు. రేపుదయం పదిగంటలకు ఆఫీసులో నా డబ్బు ఇవ్వకపోతే నీమీద చర్య తీసుకుంటాను'' అనేసి వెళ్లిపోయాను. మరుసటిరోజు ఉదయం ఆఫీసులో స్వామికోసం నా కళ్లు వెతకసాగాయి.

'తొమ్మిదింటికే ఆఫీసుకు వచ్చేవాడు ఈ రోజు రాలేదేంటి చెప్మా! నా మాటలు బాగా భయపెట్టాయి కాబోలు! మరోచోట అప్పు తెచ్చి నా అప్పు తీరుస్తాడు కాబోలు! ఆ ప్రయత్నం మీదే ఉంటాడు' అనుకుంటూ, కొనబోయే టేప్‌రికార్డర్ గురించి కలలుకంటూ సీట్లో కూర్చుని యధాలాపంగా పక్కకు చూశాను.

నా పక్కసీటులో స్వామి కూర్చుని ఉన్నాడు. అయ్యప్పమాల ధరించి, నల్లని దుస్తులతో, నుదుట గంధం బొట్టుతో నన్ను చూసి వెంటనే 'స్వామియే శరణం అయ్యప్ప' అంటూ నమస్కరించి, చిద్విలాసంగా నవ్వాడు స్వామి. నా ముఖకవళికలు ఏ చిత్రకారుడి కుంచెకూ వీలుకాని పరిస్థితికి మారిపోయాయి.

**-జయలక్ష్మిరాజు**

---

## డామిట్!

"అబ్బబ్బ, ఆ రోమియోతో వేగలేకపోతున్నానే సీతా!"

"ఏ రోమియో?" అర్ధంగాక అడిగింది సీత.

"వాడేనే మన కాలేజీలో ఎత్తుపళ్ళ మన్మధరావు లేడూ, వాడి గొడవ ఎక్కువవుతోందనుకో. రోజూ వెంటపడతాడు. తిక్కతిక్కగా వాగుతాడు. బాడీగార్డులా ఇంటివరకు వస్తాడు. వాడి కోతిరూపం చూసి లవ్ చేస్తాననుకున్నాడు కాబోలు!" ఉష కసిగా అంది.

కాసేపు ఆగి అంది సీత నెమ్మదిగా "నువ్వు ఏమనుకోనంటే చిన్న మాట"

"ఏమిటీ?" ఉష అంది.

"కాస్త నీ వేషధారణలో మార్పు రావాలే. ఒళ్ళంతా కన్పించేలా బట్టలూ, నువ్వూను. మరీ బట్టల్లో అంత పొదుపు పాటిస్తే ఎలా?"

"చాల్లే చెప్పొచ్చావ్! నా ఇష్టం వచ్చినట్లు డ్రెస్ చేసుకుంటాను. మధ్య నీ బోడి కామెంటేమిటీ?" కోపంగా అంది ఉష.

"మరి నాతో చెప్పకైతే. వాడి బాధలు సహించు!" విసురుగా తల తిప్పింది సీత.

"అదిగాదే సీతా! నాకీ డ్రెస్ అంటే ఎంత ఇష్టమో నీకు తెల్సుగా. మధ్య వాడి గొడవేంటి చెప్పు. నా ఇష్టం వచ్చినట్లు అలంకరించుకోటానికి కూడా నాకు హక్కులేదా!" కాస్త బాధగా అంది.

"హక్కుల విషయం ఇక్కడ కొశ్చన్ కాదు. నలుగురిలోకి వచ్చేటప్పుడు ఇక్కడ నీ ఇష్టం అంటే కుదరదు. ఇలాంటి వేషాలేస్తే కుర్రకారు చూస్తూ తమదారిని తాము పోరు''

"కాదులే, వాడి తిక్క నేను కుదురుస్తాను. నువ్వు అలాగే చూస్తూండు. మళ్ళీ నావైపు తిరిగి చూడకుండా చేస్తాను!"

"ఏవిఁటి చేస్తావ్?" కాస్త కుతూహలంగా అడిగింది సీత.

"ఇప్పుడు చెప్పను. చెప్తే మజా పోతుంది''

"నాకు కూడా చెప్పవా? ఒసేవ్, నేను నీ డియరెస్టు ఫ్రెండ్‌నే!" బతిమిలాడింది సీత.

చెప్పింది ఉష.

"బాగుంది నీ ఐడియా!" అభినందించింది సీత.

★ ★ ★

"మేడమ్!"

ఉలిక్కిపడి తిరిగింది ఉష. ఎదురుగా ఎత్తుపళ్ళ మన్మధరావు.

"ఇంటికేనా?" ఇకిలించాడు.

"ఆఁ..." అంది ఉష బుక్స్ గుండెలకా నించుకుంటూ.

"ఈరోజు మీ డ్రెస్ వండ్రఫుల్... మార్వలెస్!"

"థాంక్స్!" నవ్వింది ఉష.



"అబ్బ ఈరోజు చాలా చలిగా ఉంది మేడమ్'' వణుకుతున్నట్టు పోజుపెట్టి అన్నాడు మన్మధరావు ఓరగా ఉషను చూస్తూ.

"అలాగా! రేపటినుంచీ స్వెట్టర్ వేసుకు రండి. చలికాలంగదా!"

"అవునుసుమీ!" ఒప్పుకున్నాడు.

"అవునూ... ఇలా రోజూ నావెనకాల పడతారెందుకూ? మరేం పనిలేదా?"

"ఇదిమాత్రం పనికాదా?" కళ్ళు చికిలించాడు.

"మీరన్నదీ పాయింటే'' నవ్వింది ఉష.

మన్మధరావు ఉబ్బి తబ్బిబ్బైపోయాడు.

"మీతో ఓ మాట చెప్పాలి!" తల వంచుకుని అంది ఉష గోళ్ళు కొరుకుతూ.

"ఏవిఁటదీ!" సైకిల్‌మీదనుండి ముందుకు వంగుతూ అన్నాడు.

"అబ్బే ఏంలేదు. రోజూ ఇలా మీరు నావెంట పడకుండా మీకో చిట్కాచెప్తాను. నన్ను పెళ్ళిచేసుకోండి. ఏమంటారు?" ఉష సిగ్గుపడుతూ అంది.

మన్మధరావు క్షణకాలం స్తంభీభూతుడయ్యాడు.

అతని ముఖ కవళికలు గమనిస్తూ మనసులోనే నవ్వుకుంది ఉష.

మన్మధరావు తొందరగానే తేరుకుని, చిరునవ్వు నవ్వుతూ "ఏమిటి? నేను అంత అదృష్టవంతుడినా ఉషా! ఆల్‌రైట్ మీ కోరిక నేనెందుకు కాదనాలి? అంత ఆశగా అడుగుతుంటే!" అంటూ గబుక్కున జేబులోంచి ఏదో లాగాడు.

"చూడండి వీటిని మంగళసూత్రాలంటారు. వీటిని అస్తమానం జేబులోనే ఉంచుకుంటాను. ఎందుకంటారా! మీలాంటి ఏ ఆడపిల్లైనా ఠక్కున పెళ్ళిచేసుకోమన్నదనుకోండి! రెడీగా దగ్గరుంటాయని ఈమధ్యనే కొన్నాను. తొందర్లోనే వీటి అవసరం వచ్చింది. ఆ కన్పిస్తున్న గుడికి పోదామా!" మంగళసూత్రాల్ని ఊపుతూ అన్నాడు మన్మధరావు.

ఉష తేరుకోటానికి రెండు నిముషాలు పట్టింది. అంత చలికాలంలోనూ ఒంటికి పట్టిన చెమట కర్చీఫ్‌తో తుడుచుకుంటూ, 'డామిట్! కథ అడ్డంతిరిగిందే!' అనుకుని పరుగులాంటి నడకతో ఇంటికి చేరింది.

-బద్దిగం పాండురంగారెడ్డి





# అందగాడు

మన్మధరావుకి తను అందగాడినని గర్వం.

తనకు అమ్మాయిలు 'లౌ' లెటర్స్ రాస్తున్నారని ఫ్రెండ్స్‌కి చూపించేవాడు. తనంటే వెర్రెత్తిపోతున్నారనీ, పడిచస్తున్నారనీ కోతలు కోసేవాడు. నిజం ఏమిటంటే అతనికింతవరకు ఏ అమ్మాయి లౌ లెటర్ రాయలేదు. తనకి తనే అమ్మాయిల పేర్లతో రాసుకుని పోస్ట్‌లో పడేసేవాడు.

ట్రిమ్ముగా మేకప్ చేసుకుని, స్టైల్‌గా షికార్లు కొడుతుండేవాడు. తను ఏనాటికైనా సినిమా హీరో కాగలననీ, తన అందం, పర్సనాల్టీ తనను ఎవరెస్ట్ శిఖరం ఎక్కిస్తుందనీ నమ్మేవాడు.

చెయ్యిచూసిన జ్యోతిష్యుడు గూడా అదే చెప్పాడు. ధనరేఖ జర్రిపోతులా వుందన్నాడు. ఆకాశంనుంచి అప్సరసలాంటి అందగత్తె వూడిపడి భార్యవుతుందని వూరించాడు. అత్తగారి సొమ్ము తినడానికే పుట్టావు, రాజభోగాలు అనుభవిస్తావని భవిష్యవాణి పలికించాడు.

మన్మధరావు వానలో నానిన కందుల బస్తాలా వుబ్బిపోయాడు. తన అందచందాలు, పర్సనాల్టీ చూసి ఏ కలెక్టర్ కూతురో, ఇండస్ట్రియలిస్ట్ గారాల పట్టియో ప్రేమించి పెళ్లి చేసుకుంటుందని పగటికలలు కనసాగాడు.

చదువు నిర్లక్ష్యం చేయడంతో డిగ్రీ చేతికి రాలేదు. పోయిన సబ్జెక్ట్సు పూర్తి చేయలేక దండయాత్రలు కొట్టడం ప్రారంభించాడు. పాతికేళ్లు నిండినా తన పేరుపక్కన బి.ఏ. చేర్చుకోలేకపోయాడు.

ఒక ప్రైవేట్ కంపెనీలో జాబ్‌చేస్తున్న తండ్రి గుండెపోటుతో చనిపోయాడు. మన్మధరావు అన్న పోస్ట్‌గ్రాడ్యుయేట్ కావడంతో కంపెనీలో మంచి ఉద్యోగం ఇచ్చారు. ప్రావిడెంట్‌ఫండ్, ఇన్సూరెన్స్ డబ్బుతో అతని చెల్లెలు పెళ్ళయింది. మన్మధరావు బతుకు బజారునపడింది.

కిరాణాకొట్లో లెక్కలు రాసేపని చేయమని అన్న చెప్తే రోషం వచ్చి ఇంట్లోనుంచి పారిపోయి హైదరాబాద్ చేరాడు. ఒక ఫ్యాక్టరీలో పనిచేస్తున్న ఫ్రెండ్‌రూమ్‌లో తలదాచుకుని ఉద్యోగం కోసం సిటీమీద పడ్డాడు.

హైదరాబాద్ వచ్చినందుకు అతడేం బాధపడడం లేదు. అసలు తను ఎప్పుడో హైదరాబాద్ రావలసిందనీ, తన పర్సనాల్టీకి గుర్తింపు ఇక్కడే లభిస్తుందని తలపోశాడు.

అందమైన అమ్మాయిలను చూస్తూ లొట్టలేసుకుంటూ చొంగ కార్చుకునేవాడు. కారుల్లో



వెళ్లే అమ్మాయిలను, పార్కుల్లో షికార్లకొచ్చే వాళ్ళవైపు ఆశగా చూస్తూ పోజులు కొట్టేవాడు.

అయితే సిటీలో తనలాంటి హీరోలు లక్షల్లో వున్నారనీ, తన అందం చూసి ఏ ఆడపిల్లా వెంటపడదనీ, డబ్బున్న బాబుకి అల్లుడవడం

అంత సులభంకాదనీ తొందర్లోనే అతనికి అర్థ మైంది.

సరే రాసిపెట్టివుంటే అదృష్టం అదే తలుపు కొడుతుందని రాజీపడిపోయి ఒక హెూటల్లో వెయిటర్‌గా చేరిపోయాడు. చక్కగా యూ నీఫాం ఇస్తారు. బట్టల బాధలేకుండా, కడుపు నిండా అన్నం పెడతారు. జీతం ఇస్తారు. ఇంకేం కావాలి?

మన్మధరావు అదృష్టంకోసం ఎదురుచూ స్తూనే వున్నాడు.

ఒకరోజు సాయంకాలం అప్సరసలాంటి అందగత్తె ఆ హెూటల్లో అడుగుపెట్టింది. ఆమె వెంట ఎవరూ లేరు. హెూటల్లో రూమ్ తీసు కుంది.

ఏ కోటీశ్వరుడి కూతురో ఇంట్లో అలిగి వచ్చి హెూటల్లో రూమ్ తీసుకుందేమో? అని అనుమానించాడు మన్మధరావు. తను ఆమెను ప్రసన్నం చేసుకోవాలి అనుకున్నాడు. ఆమె రూమ్‌లో దిగింది మొదలు ఏం కావాలన్నా క్షణాలలో సమకూర్చాడు. 'మేడమ్' అంటూ మర్యాదగా ప్రవర్తించాడు.

రాత్రి డిన్నర్ సర్వ్ చేశాడు.

"మిష్టర్' అని పిలిచిందామె.

"నా పేరు మన్మధరావు''

"బ్యూటిఫుల్ నేమ్. నీకు తగిన పేరే' అని నవ్వింది.

మెలికలు తిరిగిపోయాడు అతను.

తర్వాత అతనితో పిచ్చాపాటీ మాట్లాడింది.

ఫరవాలేదు. దారిలో పడుతుందని ఆనందించాడు. ఈమె రూమ్ ఖాళీ చేసేలోగా ప్రేమపాశంతో బంధించాలి అనుకున్నాడు.

"నేనిక్కడ వారం రోజులుంటాను. ఈ లాడ్జిలో మంచి పార్టీలు 'దిగితే చూడు. నీకు మంచి కమీషన్ ఇస్తాను'' అన్నది.

మన్మధరావు దిగ్భ్రాంతితో చూశాడు.

"నా రేటు తెలుసా? వెయ్యి రూపాయలు''

అతనికి తల గిర్రున తిరిగిపోయింది.

-వాణిశ్రీ

---

## ఎనౌన్సర్

హైదరాబాద్‌లో ఉద్యోగం చేస్తున్న రమణ దసరాపండుగకి కుటుంబంతో సహా వచ్చాడు.

అతను హైస్కూల్ వరకూ నాతోపాటు కలసి చదువుకున్నాడు. మా ఇంటికి దగ్గరే వాళ్ల ఇల్లు. చిన్నప్పుడు ఇద్దరం స్నేహంగా వుండేవాళ్లం. హైస్కూల్ వార్షికోత్సవం సంద ర్భంలో మేం నాటికలు కూడా వేశాం అప్పు డు. దర్శకత్వం అతనే చేసేవాడు.

అతని భార్య స్వయానా మా పెదనాన్న కూతురే.

పండుగకి వచ్చిన వాళ్లని పలకరించి వద్దా మని వాళ్ల ఇంటికి వెళ్లాను.

ఇంటిముందు మంచం మీద కూర్చుని వున్నాడు, 'పిల్లలతో.

"రావోయ్‌రా... ఖుర్చో! హందరూ భాగు న్నారా?" అంటూ పలకరించాడు.

అతను ఈ వూరికి వచ్చి రెండుమూడు ఏళ్లయింది. చాలా రోజులకి వచ్చారని చూసి పోవడానికి చాలామంది వస్తున్నారు. అందర్నీ ఆప్యాయంగా పలకరిస్తున్నాడు.

"ఏం షుబ్బన్న తాతా! బాగున్నావా? పిల్ల లేం షేస్తున్నారు?"

"ఏముందయ్యా, ఒక్కడేగా కొడుకు. పొలం పని చేసుకుంటున్నాడు. మనవడేమో ఈ వూళ్లో కాలేజీ పెట్టారుగా, అందులో చదువు కుంటున్నాడు''

"ఏమిటీ, ఇంటర్‌లో ప్రవేషించిన మణుమ డు వున్నాడణ్ణమాట!" అన్నాడు రమణ.

ఇంతలో పొరుగింటి అబ్బాయీ, వాళ్ల అక్కయ్యా వచ్చారు.

"ఏరా షేఖర్... పెద్దవాడివైపోయావు!





అమ్మా, నాన్నా బావున్నారా, ఏం చదూతు న్నావు?"

"బిఎస్సీ చదూతున్నా బాబాయ్''

"షూళ్ళూరుపేటలోనేనా? ఆకాలేజ్‌లో ఎప్పుడూ గొడవలే కదరా?"

"ఇప్పుడు లేవులే!" అన్నాడు అతను.

"ఏమ్మా షారదా... డిగ్రీ పూర్తయ్యిందా? మీ అక్క మహాళక్ష్మివాళ్ళు ఇప్పుడు ఎక్కడా వుండటం?"

"వనపర్తిలో వుంటున్నారు''

"వణపర్తిలోనా? చాలాదూరం పంపించారే! మీ బావగారికి రెవిణ్యూ డిపార్ట్ మెంట్‌లో కదా జాబ్?"

"అవును... ఆయన ఎంఆర్‌వో అండీ!" అంది ఆ అమ్మాయి.

"రెవిణ్యూలో ప్రభుత్వం ఇచ్చే జీతంకంటే పైన వచ్చే ఆదాయం ఎక్కువగా వుంటుంది. రేయ్... షందీప్... ఆంటీకీ, అంకుళ్‌కీ టీ ఇవ్వమని బామ్మకు చెప్పు'' అని కొడుకుతో చెప్పాడు రమణ.

"ఇంకా ఎమిటీ విషేషాలూ? మన వూరు మాత్రం ఏం డెవళప్‌మెంట్ అయినట్లు లేదు. జణంలో కూడా పెద్దగా డెవళప్ లేదులా వుంది. సిటీలో అయితే వోణ్లీ ధవుషండ్ రూపీష్ షంపాయించుకునేవాడి రూంలో కూడా టీవీ వుంటుంది. మణవూళ్లో పది ఎకరాలు పొళం వున్నవాడి ఇంట్లో కూడా టీవీలేదు. ఇలా వుంటే జణం ఎం డెవళప్ అవుతారు?" అన్నాడు రమణ.

నేను ఇంట్లోకి వెళ్లాను.

"రా అన్నయ్యా... కూర్చో... వదినా, పిల్ల లూ బాగున్నారా? నేను అటు మన ఇంటివైపు వద్దామనుకున్నాను. కానీ ఇంట్లో ఇలా సరిపో తోంది'' అంది పని చేసుకుంటూ రోజా.

కొద్దిసేపు కుటుంబ విషయాలూ, మామూ లు విషయాలూ మాట్లాడాను.

"సరే సరోజా... రమణ ఎమిటీ ఇలా అయిపోయాడు. ఇంతకుముందు ఉచ్చారణ స్పష్టంగా వుండేది. మాటలు ఎంతో చక్కగా మాట్లాడేవాడు!"

"ఇప్పుడు కూడా బాగానే మాట్లాడుతున్నా డు కదన్నయ్యా!"

"మాట్లాడటం కాదు సరోజా... భాష



ఎమిటీ అంత కృత్రిమంగా తయారైపోయింది. శకీషకీ, లకీళకీ, నకీణకీ కూడా తేడా తెలియ కుండా మాట్లాడుతున్నాడేమిటి?"

"అదా..." అని చిన్నగా నవ్వి సరోజ అంది. "అదీ.. ఆయన ఈమధ్య టీవీలో ఎనౌన్సర్‌గా చేరాడు అన్నయ్యా... అప్ప ట్నించీ'' అంది సిగ్గుపడిపోతూ సరోజ...

-కోటేశ్వరరావ్.

# అజ్ఞాతవాసం పై సమీక్షలు



నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన పులిపాక శ్రీరామచంద్రమూర్తి నవల 'అజ్ఞాతవాసం'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## దృక్పథంలో మార్పు రావాలి

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

సమకాలీన సాహిత్యం పూర్తిగా సెక్స్, క్రైమ్ లాంటి ఇతివృత్తాలకే ప్రాధాన్యతనిస్తూ, జన జీవన స్రవంతికి ఆమడదూరాన వున్న గిరిజనుల జీవనపోరాటాల్ని చూడట్లేదు అంటూ గిరిజనుల బ్రతుకుల్ని, నక్సలైట్ల అజ్ఞాతవాసాన్ని కన్నులకు కట్టినట్టుగా చూపించింది నవంబర్ 'చతుర' నవల 'అజ్ఞాతవాసం'.

రచయితలు ఉబుసుపోక కథలు రాయకుండా సమాజంలో జరుగుతున్న అక్రమాలను తమ రచనలలో ప్రతిబింబించి తద్వారా సమాజ శ్రేయస్సుకు పాటుపడాలని చెప్పడం బాగుంది. ప్రభుత్వ యంత్రాంగంలో భాగమైన పోలీసులు, ధనాశతో డబ్బున్నవారితో చేతులు కలిపి గ్రామాల్లో కాశీప్రసాద్‌లాంటివారు చేస్తున్న ఆగడాలకు వత్తాసుపలుకుతూ సామాన్య మానవునికి నేటి సమాజంలో నిజమైన బ్రతుకు లేకుండాచేస్తున్నారన్నది అక్షరసత్యం.

భూవిముక్తి సోషలిజం స్థాపనలాంటి మహోన్నత ఆశయాలతో ప్రారంభమైన ఉద్యమం చివరికి హత్యలకి, వ్యక్తిగత కక్షలకి నిలయమైపోయిందనటం సరికాదు. కాశీప్రసాద్‌లాంటివారి ఆగడాలు, రవిరాజావంటి





పోలీసుల దౌర్జన్యాలే ఆ మార్పుకు కారణం!

'మనిషే ఆయుధం' అనే ఉన్నతాశయాలు గల వివేకానంద పాత్ర, కాళీప్రసాద్ దుర్మార్గాన్ని ఎదుర్కోలేక అజ్ఞాతవాసంలోకి వెళ్లిన ఛాయ పాత్రలు నేటి సమాజ పరిస్థితులకు అద్దంపట్టాయని చెప్పడంలో అతిశయోక్తిలేదు.

నక్సలైట్ల ఉద్యమాన్ని శాంతిభద్రతల పరిస్థితిగానే ఎంచి ఎన్‌కౌంటర్లపేరిట అమాయకులను ఊచకోత కోస్తున్న పోలీసుల్నీ, పాలకులనూ, తద్వారా ప్రభుత్వాన్ని సంస్కరించవల్సిన తరుణం ఆసన్నమయిందంటూ ముగిసిన 'అజ్ఞాతవాసం'వంటి మంచి నవలను ప్రచురించిన 'చతుర'కి నా అభినందనలు.

-కె. వెంకటరమణారెడ్డి
వావిలాల

## 'మార్పు రావాలి'

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

ప్రముఖ రచయితలను కిడ్నాప్ చేయడంతో ప్రారంభించిన 'అజ్ఞాతవాసం' నవల నక్సలైట్ల జీవిత చిత్రణతో సాగింది. ఈ రచయితలను కిడ్నాప్ చేయడం, అందులో ఒక వ్యక్తి తప్పించుకోవడం - కొన్నాళ్లకిందట బాలరాజు, మొదలైనవారి కిడ్నాప్‌ను గుర్తుకుతెస్తుంది.

ఈ నవలలో నక్సల్స్, పోలీసులమధ్య గిరిజనులు ఏవిధంగా నలిగిపోతున్నారో రచయిత చక్కగా వర్ణించారు. అదేవిధంగా పోలీసులు ఎన్‌కౌంటర్ల పేరుతో ఎంతోమంది అమాయకులను చంపుతుండడం, నక్సల్స్ పోలీసులను మందుపాతరలతో పేల్చి చంపడం జరుగుతోంది కాని సమస్యమాత్రం పరిష్కారం కావడంలేదు.

ఈ నవలలో వివేకానంద పాత్రద్వారా అన్నలను జనజీవితంలో కలవమని, ఆయుధం పట్టి అన్నీ సాధించలేమని, మనిషే ఒక ఆయుధం అని, అహింసతో అన్నీ సాధించవచ్చని రచయిత చెప్పించారు. ఎంతో ఆదర్శవాద రచనలు చేసే రచయితలందరూ ఆ ఆదర్శాలకు కట్టుబడరనీ, సమయానుకూలంగా మారిపోతారనీ మిగిలిన రచయితల పాత్రలద్వారా చెప్పారు.

నక్సలైట్లు కాలం చెల్లిన సిద్ధాంతాలను పట్టుకుని, సాయుధపోరాటాలని నమ్ముకుని, హింసామార్గాన్ని ఎన్నుకుని, పోలీసు ఇన్‌ఫార్మర్లుగా అనుమానించి అమాయకులను చంపడం, బస్సుదహనాలు చేయడం, పోలీసులను చంపడం మొదలైన నేరాలద్వారా ప్రజలలో సానుభూతిని కోల్పోతున్నారని చెప్పారుగానీ బలవంతుల దౌష్ట్యానికి గురి అయిన ఛాయలాంటివారు ఎందరో తప్పని పరిస్థితులలో తీవ్రవాదులుగా మారడం జరుగుతోందని కూడా తెలుస్తోందిగదా!

మొత్తానికి సిద్ధాంతంకోసం తమ జీవితాలను అడవులకే అంకితం చేసే 'అన్నలు' ఎవరికీ రక్షణలేని జనజీవనంలోకి ప్రవేశించడానికి ఇష్టపడకపోవడం - వాళ్లలో మార్పు తేవాలనే వివేకానంద ప్రయత్నం ఆలోచింపజేసేవిగా ఉన్నాయి.

చివరలో రచయిత చెప్పినట్లు - మారాల్సింది ఈ సమాజమూ, మనుషులూ కాదు, ప్రభుత్వమూ, పాలకులూ అన్నది నిజం. రచయిత అభినందనీయులు.

-చెరువు శ్రీదేవి
విశాఖపట్నం

## సినిమా నవల

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

తీవ్రవాదులుకానీ, స్వార్థపరులుకానీ, మోసగాళ్లుకానీ రకరకాల ప్రయోజనాలనాశించి తమ తమ డిమాండ్లను నెరవేర్చుకోవడంకోసం కిడ్నాప్‌లు చేస్తుంటారు.

తీవ్రవాదులు రచయితలను కిడ్నాప్ చేసిన ప్రయోజనం శూన్యమనే అనిపిస్తుంది.

అరణ్యాలు, ఆయుధాలు, ఆదర్శాలు, గూడెంలలో జీవితాలు, పోలీస్ దాడులు, ఎన్ కౌంటర్లు, ఆదర్శాలపట్ల వాదప్రతివాదాలు మొదలైన అంశాలతో నిండిన 'అజ్ఞాతవాసం' అర్థాంతరంగా ముగిసినట్టనిపించింది. ఆమధ్య వచ్చిన కొన్ని విప్లవ సినిమాల సన్నివేశాల్ని అక్కడక్కడా, అప్పుడప్పుడూ గుర్తుచేసినట్టనిపించింది.

రామచంద్రాపురం - కాళీప్రసాద్, రామానుజం, ఛాయ, భవాని, భూ ఆక్రమణ, యస్.ఐ. రవిరాజా, రామానుజం, యాక్సిడెంట్, బస్టాప్‌లో వస్త్రాపహరణంలాంటి సన్నివేశాలు సినిమాల్లోనయితే అత్యంత సహజం. అలాంటివాటినే నవలలో జనరలైజ్ చేసినట్లనిపించింది.

తీవ్రవాదులు కాళీప్రసాద్‌ను అతని రివాల్వర్‌తోనే అంతంచేసి ఆ కారెక్టర్‌ను అర్థాంతరంగా తెరలోంచి తొలగించినట్టనిపించింది. ఛాయ పారిపోవడం, తీవ్రవాదుల్లో చేరిపోవడం - పిరికితనాన్ని ప్రవేశింపచేసినట్లయింది.

విప్లవకారులను హింస మాని జనజీవన స్రవంతిలోకి రమ్మని వివేకానంద ప్రయత్నించడం - నక్సలైట్ నాయకుడు సూర్యంతో అతని వాదోపవాదాలు పేలవంగా ఉన్నాయి.

నవలలో బాగా నచ్చిన అంశం - వివేకానంద తిరిగొచ్చి తాను వ్రాసిన నవలకు రాసిన ముగింపు వాక్యాలు - 'సంస్కరించాల్సింది సమాజాన్ని, మనుష్యుల్ని కాదు - ఈ ప్రభుత్వాన్ని... పాలకుల్ని' అనడం.

మసాలాలతో మంచి సినిమాగా రూపొందగల నవల 'అజ్ఞాతవాసం'

-దమ్ము శ్రీనివాసబాబు
హైదరాబాద్

# సమాజమా! నీ ప్రవర్తన మార్చుకో!

*(నాలుగవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

"ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురుచూసి మోసపోకుమా, నిజం మరచి నిదురపోకుమా" అని శ్రీశ్రీ అన్నట్లు ఎవరికివారే సమాజాన్ని, సంఘాన్ని సంస్కరించుకోవాలి. అది అందరిపైనున్న కర్తవ్యం. అది మనవంతు బాధ్యత కూడా.

పులిపాక శ్రీరామచంద్రమూర్తిగారి తన "అజ్ఞాతవాసం" నవలలో నేటి సమాజంలో నిత్యం మనం చూస్తున్న కిడ్నాపులు, ఎన్‌కౌంటర్లు వీటి గురించి చాలా సహజంగా, ఏమాత్రం అతిశయోక్తి లేకుండా చిత్రీకరించారు. వున్న అధికారాన్ని నిలబెట్టుకోవాలని కొందరు, లేని అధికారాన్ని నిలబెట్టుకోవాలని కొందరు తుపాకీలతో సమాధానపర్చుకుంటే వారి ఘర్షణలో మధ్యలో నలిగిపోయేది, నష్టపోయేది ప్రజలే.

నేటి సమాజంలో అవినీతి, అన్యాయాలు, దౌర్జన్యాలు, స్వార్థం, లంచగొండితనం, స్త్రీలపై అత్యాచారాలు రోజుకురోజుకీ పెరుగుతూనే వున్నాయిగాని తగ్గడంలేదు. రాజకీయ నాయకులు ఎన్నికల్లో ఎంత ఖర్చు పెట్టారో అంతకు మూడింతలుసంపాదించడంలోనే పదవీకాలం అయిపోతుంది. మళ్లీ ఎన్నికలు వస్తాయి. మళ్ళీ ఖర్చు. మళ్లీ సంపాదన. ఇక ప్రజలకి సేవ చేసేదెప్పుడు? పాలకుల్లో, ప్రభుత్వాలలో మార్పు రావాలి. అంతేగాని విప్లవకారులని, నక్సలైట్లని, సంఘవ్యతిరేకులని వారిని దుయ్యబట్టడం ఎంత మాత్రం సమంజసం కాదు. పరిస్థితుల ప్రభావంతో విప్లవకారుల్లోకి, నక్సలైట్లలో చేరిపోయినవారికి ప్రభుత్వం, సమాజం సరైన మార్గం సహాయ సహకారాలు, చేయూతనందిస్తే ఎందుకు సంఘవ్యతిరేకులు అవుతారు. ఈ విధమైన కోవలోకే ఛాయ వస్తుంది. ఆమె పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కోలేక పారిపోవటం చాలా తప్పని




వివేకానందచే చెప్పించారు. ఆమెకు తెలుసు. తనీ హత్య చేయలేదని కాని తను సమాజాన్ని, చట్టాన్ని నమ్మించలేదు, నమ్మించదలచినా అందుకు చాలారోజులు పడుతుంది. న్యాయాన్ని రక్షించవలసిన పోలీసులే అన్యాయంగా న్యాయాన్ని శిక్షించేవారికి ప్రతీకలుగా కనిపించే ఇన్‌స్పెక్టర్ రవిరాజు, డియస్‌పిలను చిత్రించడం, నిత్యజీవితంలో మనం చూస్తూనే వుంటాం. రచయితలకు ఈ సమాజాన్ని ముందుకు నడిపించటంలో అత్యుత్తమ బాధ్యత వుందని, వారు మంచి రచనలే చెయ్యాలని డబ్బుకు, తాత్కాలిక కీర్తికి కక్కుర్తిపడి బాధ్యతలను విస్మరించి సమాజాన్ని తప్పుదారి పట్టించకూడదని రచయిత వివేకానంద పాత్ర ద్వారా చెప్పించడంలో సఫలులయ్యారు. కాళీప్రసాద్‌లాంటివార్ని ప్రభుత్వం శిక్షించాలి. అలాంటివారు సమాజానికి చీడపురుగులు. అడవులలో గిరిజనులపై అత్యాచారాలను తక్కువలోనైనా స్పష్టంగా చిత్రీకరించారు. ఇటువంటి నవల అందించిన రచయితకు ధన్యవాదాలు.

-మనోహర్. ఎమ్
వేంపెంట

## సాధించిందేమిటి?

***(అయిదవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)***

**కథ**, కథనం బాగున్నా కథాగమనం కోసం ఎన్నుకున్న సన్నివేశాల్లో పటుత్వం లేకపోవడంతో సామాన్యంగా మిగిలిపోయిందీ "అజ్ఞాత వాసం". మొదటి పేజీల్లో రచయితల సదస్సులోని అభిప్రాయాలు, చివరి పేజీల్లో నక్సలైట్ నాయకునితో సాగిన చర్చలు మాత్రం ఆదర్శవంతంగా ఉన్నాయి ఆ రెండు వర్గాలకూ! కేవలం ఆదివాసుల, అరణ్యావాసుల జీవనవిధానాలను పరిశీలించి సాహిత్య సృష్టి చేయడంకోసం రచయితలను కిడ్నాప్ చేయనక్కరలేదు. నక్సలైట్లు పూనుకుంటే ఆయా రచయితలతో సమాలోచన చేసి అందుకు తగిన రచయితల్నే వారి ఇష్టపూర్వకంగా తీసుకువెళ్లే అవకాశం లేకపోలేదు. 'ఛాయ' నక్సలైట్‌గా మారిన తీరు గమనిస్తే అందరు నక్సలైట్లూ ఇదే పంథాలో ఉద్యమాల్లోకి దూకారా అనిపించే అవకాశం ఉంది. కాళీప్రసాద్‌లాంటి సంఘవ్యతిరేకులపై తిరుగుబాటు చెయ్యాలనుకోవడం తేలికే. ఎదురు తిరిగిన తర్వాత సమ ఉజ్జీగా ఎలా నిలబడాలో చెప్పడంలో రచయిత విఫలమయ్యారు. 'భవాని' పాత్ర వెలవెలబోయింది. ఛాయ కుటుంబం నిర్వీర్యం కావడంతో పేరున్న అయిదుగురు రచయితలు కిడ్నాప్ చెయ్యబడితే ప్రజలనుంచిగానీ, ప్రభుత్వంనుంచిగాని రావలసినంత స్పందన కన్పించకపోవడం విచిత్రంగా ఉంది.

నక్సలిజం సాధించినదేమిటి? ఎన్‌కౌంటర్లలో ప్రాణాలు కోల్పోవడం తప్ప, వారాశించిన ఫలితాన్ని పొందలేకపోయారు. జరిగిన మంచి తక్కువ, నష్టపోయింది ఎక్కువ. నిజమైన పోరాటపంథానుంచి వారు ఏనాడో తప్పిపోయారు. వారిలోనూ ముఠాతత్వం పెరిగిపోయింది. కాకుంటే రాజకీయ పార్టీల్లా వారిలోనూ ఇన్ని చీలికలు వచ్చేవి కాదుకదా. సాయుధపోరాటాలవల్లనే సమసమాజ స్థాపన జరుగుతుందనేది ఆశాకుసుమంగా మాత్రమే మిగిలిపోగూడదు. "సారాక్షసు"నిపై పోరాటానికిప ఆయుధాలు చేబూనారు మన తెలుగుమహిళలు. ఆయుధంతో అన్నీ సాధించాలనుకోవడం కేవలం 'భ్రమ'. నిస్వార్థతతో, మంచి మనసులతో పేదవారికి, బడుగువారికి అండగా నిలిచి శాంతియుత పోరాటాలతో సమసమాజ స్థాపనకు అంకురార్పణ జరగాలి. అప్పుడే అన్నల ఆశయాలకు సాఫల్యత కలుగుతుంది.

చివరిమాటలుగా రచయిత చెప్పినట్లు సంస్కరించాల్సింది ప్రభుత్వాన్ని, పాలకుల్నే కాదు. మనుషుల్ని కూడా!

-వి.యస్.ఎన్. మూర్తి
తణుకు

# చతుర

సంపుటి: 17 సంచిక: 12 జనవరి 1995

పోష్‌కాలనీలోని ఆ వీధిలో హటాత్తుగా అందరినీ కలవరపరచసాగింది ఓ చెత్తకుండీ. దానిలోంచి వచ్చే భయంకర దుర్వాసన, గృహస్థులందర్నీ కకావికలు చేసి, ద్వారాలు, కిటికీలు మూసుక్కూర్చునేలా చేసింది.

ఆ విషయంపై అందరి మధ్యా అర్థంలేని అనుమానాలు మొదలై అవి ప్రచారంకాసాగాయి.

చివరకు... అసలు కారణాన్ని శోధించబోయిన ఓ జర్నలిస్ట్... ఏంచేశాడు?

"ఈ చెత్తకుండీ మా ఇంటిముందునుంచి తీసెయ్యండి" అని నినాదాలు చేసిన ప్రతివారూ... చివరికి "అది మా ఇంటిముందే ఉంచండి" అనడానికి కారణమేమిటి?

ఇంతకీ... దుర్వాసనకి కారణమైన ఆ చెత్తకుండీలోని వస్తువేమిటి?

అవసరమయితే చెత్తకూడా రాజకీయ నాయకుల భవిష్యత్తును చిత్తుచేయనూగలదు, బాగుచేయనూగలదని చెబుతున్న ప్రముఖ కన్నడరచయిత మొగసాలె నవలకు నలిమెల భాస్కర్ తెలుగు అనువాదం 'కుండీ' ఈ నెల 'చతుర' సమర్పణ.



# కుండీ

డాక్టర్. నా. మొగసాలె

'ఎప్పుడూ ఏడింటికి నిద్రలేచే తనకు ఎవరో తట్టి లేపినట్టుగా ఈరోజు ఇలా మెలకువ వచ్చిందేమిటి?' అనుకుంటూ ఆశ్చర్యపోయిన బాలన్న లేచి మంచమ్మీదే కూచున్నాడు.

కళ్ళు నులుముకుని టిక్‌టిక్‌మంటూ కాలాన్ని కొలుస్తోన్న గోడగడియారంకేసి టార్చి వేశాడు.

పదినిముషాలు తక్కువ ఐదు గంటలు.

ఇంకా తెల్లవారలేదు.

తన విద్యాభ్యాస కాలంనుండి ఇప్పటిదాకా తను అనుకున్న సమయానికి ఒక్కసారి కూడా నిద్రలేవలేకపోయాడు. మరి ఇవాళ ఎందుకిలా మెలకువ వచ్చిందన్నదే పెద్ద ప్రశ్న అయిందతనికి.

అలా ఆలోచిస్తూవుండగానే అతని ముక్కుపుటాలు టపటపమని ఆగకుండా కొట్టుకోసాగాయి. తనకు జలుబు చెయ్యలేదుగానీ ఏదో వాసన! గబ్బువాసన! భరించరానంత దుర్వాసన!!

'తనను నిద్రలోంచి లేపింది ఈ వాసనే కావొచ్చు. దీని సిగదరగ' అనుకుంటూ బాలన్న ముక్కు బాగా నలుపుకుని మరీ లేచాడు.

ఎలుకేదైనా చచ్చిందో లేక దొంగపిల్లి ఏ కుళ్ళిపోయిన మాంసంముక్కేదైనా గదిలోకి ఎత్తుకొచ్చిందో చూద్దామనుకుని స్విచ్ వేశాడు.

గది దేదీప్యమానంగా వెలిగిపోయింది.

అతని శ్రీమతి లక్ష్మి అసలేమీ లేనట్టు నోరు సగం తెరిచిమరీ గురక పెడుతోంది. ఆమె ఒంటిమీది గుడ్డలన్నీ అస్తవ్యస్తంగా వున్నాయి.

దుర్వాసన వేసే ఈ స్థితిలోనూ బాలన్నకు ఆమె మునుపటికన్నా మిన్నగా, అందంగా కనిపిస్తోంది.

అటు వాసన! ఇటు సౌందర్యోపాసన!!

బాలన్న భరించరాని ఆ దుర్వాసనతో ఉక్కిరిబిక్కిరవుతూ మూలమూలల్నీ గాలించాడు.

పైకి చూశాడు. కిందికి వంగాడు.

కానీ ఆ వాసనకు కారణంమాత్రం అంతుపట్టలేదు.

తెరిచిన కిటికీవైపు తిరిగి బయటినుంచి వచ్చే ప్రభాత పవనాల్ని పీల్చుకోవడానికి ప్రయత్నించాడు. అయినా ఆ వాసన ప్రభావం ఆగిపోలేదు. దానికి మూలకారణమూ అర్థంకాలేదు. కానీ, ఆ వాసన కేంద్రం తన ఇల్లు కాదని తేలేంతదాకా బాలన్నకు బయటకు వెళ్ళాలనిలేదు. హాయిగా ఆదమరిచి నిద్రపోతున్న తన భార్యకు తనలాగే ఈ దుర్వాసనవల్ల మెలకువ ఎందుకు రాలేదన్న ఆశ్చర్యం ముంచుకువచ్చింది. లక్ష్మి ఈ దుర్గంధాన్ని భరిస్తూ అలా పడుకుని నిద్రపోతూనేవుండాల్సింది కాదే! కొంపదీసి ఆమె 'ఆరోగ్యం చెడిపోలేదుకదా, అన్న ఆందోళన కూడా కలిగిందతనికి. వీటన్నింటితోపాటు ఎన్నడూ ఐదింటికి ముందు లేవని తను ఇంత చలిలో బయట కాలుపెడితే కాఫీకోసం ఎవరిని ఆశ్రయించడం అనే బెంగ ఒకటి! నిత్యం తను నిద్రలోంచి లేచేసరికి కాఫీ కప్పుతో ప్రత్యక్షమయ్యే శ్రీమతిని ఈ రోజు తనే లేపి కాఫీ పట్రావోయ్ అని అడిగినా ఈ గబ్బు వాసనమధ్య తాగడం ఎలాగనే చింత ఒకటి మొదలయింది. బాలన్న ఇలా ఆలోచిస్తూనే లక్ష్మిని మెల్లగా తట్టి "లే... లే!" అన్నాడు.

ఆమె మొదట 'ఆఁ...' అని తర్వాత ముడుచుకు పడుకుంటూ "ఎందుకింత తొందర?" అని ఓసారి కళ్ళు తెరిచి మరలా మూసి గురకపెట్టసాగింది.

బాలన్న వదల్లేదు "ఏయ్! భలేదానివేనే" అంటూ ఆమెని గట్టిగా కుదుపుతూ "అసలు నీకు ముక్కు అనేది ఉందా లేదా?" అన్నాడు.

లక్ష్మికి అర్థంగాక కళ్ళు తెరిచి "అలా అడుగుతున్నారేమిటండీ?" అంది నిద్రమత్తులోనే!




"నీకేమీ వాసన రావడంలేదా? దుర్భర మైన ఈ దుర్వాసనని తట్టుకోలేకపోతున్నాను గానీ. లే, లే! బయటకు వెళదాం" అన్నాడు భార్య తల నిమురుతూ.

అపురూపంగా తల నిమురుతోన్న భర్తని చూసి ఆనందించిన లక్ష్మి "అలానా?" అంటూ లేచి కూచుంది.

అంతే...!

గబ్బుమని ముక్కుదాకా వచ్చిన దుర్వా సన భరించలేక "రామ, రామ! ఎలుకగానీ చచ్చిందేమో!" అంది.

ఆ వెంటనే పక్కమీంచి దూకి భర్తని వెనక్కి తోసి, మంచాన్ని ఎత్తిచూసింది. ఏమీ కనిపించకపోయేసరికి "ఎక్కడిదండీ ఈ వా సన? ఉన్నట్టుండి ఎలా మొదలైంది?" అంది.

ఇద్దరూ భయాశ్చర్యాలతో ఒకరిమొహం మరొకరు చూసుకున్నారు. ఏం చేయాలో తోచక భార్యే ప్రారంభించింది.

"మీ అమ్మగారికి ఏమైనా అయి వుంటుందా?" అంది హఠాత్తుగా.

లక్ష్మి ముఖమ్మీది భయం ఛాయలు బాల న్నను మరింత కంగారుపెట్టేశాయి. అతని తల్లి భాగీరథమ్మ కాన్సర్‌తో మంచంపట్టింది. మూడేళ్ళుగా ఆ వ్యాధితో బాధపడుతోన్న ఆమెని చూసి డాక్టర్లు ఎప్పుడో పెదవి విరిచా రు. ఇప్పుడు ఆమె ఆ లోగిలిలోనే మృత్యుకౌగి లిలో వుంది. లేచి నడవలేదు. గర్భకోశంలో అవతరించిన కాన్సర్ వ్రణంవలన ఆవిడకు మూత్రవిసర్జన కష్టమవుతోంది. ఇలా బతక డంకన్నా చావే నయమని ఆమె ఇప్పటికి వెయ్యిన్నొక్కసార్లు గుండెలు బాదుకుంటూ రోదించింది. అయితే... వానరాకడ ప్రాణం పోకడ మనకు తెలియవుకదా!

కొంపదీసి మా అమ్మ గుటుక్కుమనలేదుక దా! అనుకుంటూ లోగిల్లోకి చేరాడు బాలన్న.

అక్కడ ఆమె అచేతనంగా పడివుంది. బాలన్నకు గుండెదడ ఎక్కువైంది. మెల్లిగా "అమ్మా!" అని పిలిచాడు.

ఊహూ... జవాబు రాలేదు. అతను ఆమెద గ్గరికొచ్చి డాక్టర్లు నాడి పరీక్షించినట్టు తల్లి ఎడమచెయ్యిని పట్టుకుని నాడి దొరుకు తుందేమో అని చూశాడు. చెయ్యి వెచ్చగానే వుంది. నాడి కొట్టుకుంటున్నట్టే అనిపించింది.

అరే! అమ్మ బతికేవుంది అని అతను మనసులో అనుకునేలోపునే భాగీరథమ్మ లే చింది. తన నాడి చూస్తున్నది డాక్టరే అనుకుని, "నమస్కారం స్వామీ!" అంది.

బాలన్న ఉన్నపళంగా చెయ్యి వదిలేసి, "ఎందుకమ్మా నాకు నమస్కారం అంటు న్నావు?" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"ఓ నువ్వా? ఇదేంటి బాలూ? ఇంత పొద్దున్నే నాడి పట్టుకున్నావ్?" అంది భయప డుతూ. ఎలా సమాధానం చెప్పాలో తెలీక బాలన్న సతమతమయ్యాడు.

"నేను చచ్చిపోయానని నీకు కల వచ్చి వుంటుంది. అవునా?" అంది తల్లి.

బాలన్నకు సిగ్గుతో చచ్చినంతపని అయ్యింది. తను పాతాళంలోకి జారిపోతున్న ట్టు అనిపించింది.

"అదికాదమ్మా! ఏదో విపరీతమైన వాసన వచ్చి..." అని నసిగాడు.

ఆమె చిన్నగా నవ్వుతూ, "నా వాసనే అనుకున్నావా?" అంది. ఆ నవ్వులో విషాదం మిళితమైవుంది.

"ఛీ, ఛీ! అలా కాదమ్మా" అని ఆమె పడుకుని ఉన్నచోట తమ పడగ్గదిలో వున్నంత మాత్రం దుర్వాసన కూడా లేకపోవడం గ్ర హించి తప్పుచేసినవాడిలా దిగ్గున లేచి వరండాలోకి వచ్చాడు బాలన్న.

అప్పటికే లక్ష్మి బాత్రూంకి వెళ్ళి వాసన తట్టుకోలేక వాంతులు చేసుకుంది. ఆమె అక్క ణ్ణించే డోక్కోవడం అత్తగారైన భాగీరథమ్మకు వినిపించింది. ఆ వృద్ధమాత మెల్లిగా "బా లూ!" అంటూ ప్రేమగా పిలిచింది.

"ఏంటమ్మా?"






# గాయకుడి పాట్లు

ఫ్రాంక్‌డేవిడ్‌సన్ అనే ఈ పెద్దమనిషి ఓ మంచి గాయకుడు. పొద్దమేకాకుండా స్వయంగా పాటలు రాయడం, వాటికి వరసలు కట్టడంలో కూడా ఈయన నేర్పరి అని చెప్పవచ్చు. ప్రపంచంలోని అనేకదేశాల్లో తన గొంతు వినిపించాలన్నది ఈయన గాఢమైన కోరిక. దాంతో... తాను స్వయంగా రచించి, పాడిన ఓ కేసెట్టును తయారుచేయించి దాని అమ్మకాలకోసం అనేక మార్గాలను చేపట్టాడు. వివిధ ప్రాంతాల్లోని శ్నాక్‌స్టాల్స్‌కి వెళ్ళి వాటి యజమానులకి ఒక్కొక్క కేసెట్ ఇచ్చి రోజూ ఆ పాటలను వారి కస్టమర్స్‌కి వినిపించేలా ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఇంతకీ ఆయనగారి అదృష్టమో లేక నిజంగానే అతడి గాత్రమాధుర్యమో గానీ కేసెట్లన్నీ హాట్‌కేక్స్‌లా అమ్ముడుపోతున్నాయట.

"ఇంక నేను చచ్చిపోయినా బాధలేదు'' అంది కొడుకుని కళ్ళారా చూస్తూ.

"నేనెప్పుడైనా నువ్వు చచ్చిపోవాలని అనుకున్నానా? అదే నిజమైతే ఇన్ని మందులు ఇప్పిస్తానా? ఇవాళ ఏదో ఇలా తప్పు జరిగిపోయిందమ్మా!"

"నీమీద నాకెందుకురా కోపం? బాలూ! కోడలు బాత్రూంలో వాంతులు చేసుకుంటోంది అంటే ఆమె గర్భవతి అవుతోందన్నమాట. ఇన్నాళ్ళకైనా ఆ దేవుడు కరుణించాడనే ఆనందంరా నాకు. అందుకే ఇంక నేను చచ్చిపోయినా బాధలేదన్నాను''

పెళ్ళై పుష్కరం గడిచినా పిల్లలు లేని బాలన్నకు తల్లి అందించిన శుభవార్త మహదానందకరంగా వుంది. దాంతో ఆ దుర్వాసన విషయాన్ని మరిచిపోయి బాలన్న బాత్రూంకు పరుగులుతీశాడు.

పరగడపున వాంతులు చేసుకునీ చేసుకునీ అలిసిపోయిన లక్ష్మి "చాలయ్యా చాలు! ఇంక ఎక్కడికైనా పారిపోవడం హాయి'' అంది భర్తతో.

సంతోషంతో ఉక్కిరిబిక్కిరవుతోన్న బాలన్నమాత్రం "అమ్మదొంగా! నువ్వు నెల తప్పిన ముచ్చట నాకు చెప్పనేలేదేం?" అన్నాడు.

లక్ష్మికి ఈ వాంతుల ఇబ్బందిలో కూడా నవ్వు ఆగడంలేదు.

"అవునుగానీ ఈ గర్భం మీవల్ల వచ్చింది కాదులెండి'' అంటూ బాత్రూంనుండి బయటికి వచ్చింది.

తల్లీకొడుకులకు ఎప్పుడూ ఒకే యావ. లక్ష్మి గర్భవతి కావాలి! కానీ నెలతప్పడం ఎలా? ఈయనకు సంతానభాగ్యం లేదని డాక్టర్లే చెప్పారుగా! ఇప్పుడు మళ్ళీ ఈ తమాషా ఏంటి?

"అయ్యా! నేను వాంతులు చేసుకుంది ఆ దుర్వాసన తట్టుకోలేకే!" అంది లక్ష్మి రుసరుసలాడుతూ.

బాలన్న బిడియపడ్డాడు. తనకు పిల్లలు కలిగే అదృష్టం లేదు. తన వీర్యంలో గర్భధారణకు కావల్సినన్ని వీర్యకణాలు లేవని డాక్టర్ చెప్పిన విషయాన్ని తను తల్లితో చెప్పనేలేదు.

అందుకని ఆ ముసలితల్లి దృష్టిలో తప్పంతా కోడలిదే!

ఆ తల్లి మనవడికోసం ఈ ప్రపంచంలో వున్న దేవుళ్ళందరికీ మొక్కింది. అలా మొక్కడం వృధా అని తల్లితో చెప్పే ధైర్యం అతనికి లేదు.

దేవుడే లేదు అంటూ వేదికలమీద లెక్చర్లు దంచిన అతనికి తల్లితో ముఖాముఖి వాదించి ఈ విషయాన్ని బయటపెట్టే ధీమాలేదు.

భార్యతో కూడా తనకి పిల్లలు పుట్టరనే సంగతి చెప్పనేలేదతను. కాని ఆమె అతనితో పాటు ఓమారు డాక్టరు దగ్గరికొచ్చినప్పుడ డాక్టర్ తనతో చెపుతుండగా విన్నది.

నిర్వికారంగా ఇంటికి తిరిగి వచ్చిన ఆమెతో దారంట ఏమీ మాట్లాడలేకపోయిన తను ఆ రాత్రి గాఢంగా కౌగలించుకుని, చెవిలో మెల్లిగా "సారీ లక్ష్మి! నావల్ల నీకు సంతానభాగ్యం లేదు'' అన్నాడు.

ఆమె అసలు ఏమీ లేనట్లే ఎంతో రొమాంటిక్‌గా "నాకు మీరే చాలు'' అంది. అది నిజంకూడాను. ఆమె ఎప్పుడూ తనని ప్రేమగా చూసుకుంటుంది.

తల్లికి తన బలహీనత విషయం తెలీదు కాబట్టి ఆమె తన కోడలు గర్భవతి అనుకోవడంలో తప్పులేదు. మరి తానేమో తన భార్యకు ఏమీ తెలియదన్నట్టుగా 'గర్భవతివా?' అని అడగడం ఎంత మూర్ఖత్వం?

బాలన్న ఇలా ఆలోచిస్తూనే "ఈ దుర్వాసనకు కారణం మన ఇల్లుకాదని తేలిపోయింది. అయితే అది ఎక్కణ్నుంచి వచ్చేదీ ఇంకా తేలలేదు. పక్కింటివాళ్ళని అడిగితే పోలా?"

అన్నాడు.

లక్ష్మికి నవ్వొచ్చింది. "కావాలంటే మీరే అడగండి!"



**బా**లన్నలో ఈ వాసనకు మూలకారణం కనుక్కోవాలన్న పట్టుదల క్రమేణా పెరుగుతోంది. ఇంత ఆకస్మికంగా అది ఎక్కడ ప్రారంభమైందనే ఆసక్తితోపాటు దానిక్కారణం తెలిస్తే తప్పించుకునే మార్గం కూడా సులభమవుతుందిగదా అనుకున్నాడు.

రోడ్డుమీదికి రాగానే వాసన మరింత ఎక్కువైనట్టు అనిపించింది. "దీని సిగదరగ. ఈ వాసనకి కారణం రోడ్డే కావచ్చు'' అనుకుంటూ కొంత శాంతించాడు. వాసనకు మూలం ఏమిటన్నట్టు నడివీధిలో నించుని నలువైపులా కళ్ళు సారించాడు.

అంతా ఎప్పట్లానే వుంది. ఏమీ కనిపించడంలేదు.

"ఎడమకు తిరగడమా కుడికి వెళ్ళడమా? వెళ్ళి ఏం చేయడం అనుకునే, పక్కింటివాళ్ళ తలుపులు తడితే ఎలా వుంటుంది? వాళ్ళనీ తనతోపాటు ఈ పరిశోధనకు వాడుకోవచ్చుకదా! అనీ అనుకున్నాడు. వెంటనే ఓ ఉపాయం తట్టింది. దానికి తనే ఉబ్బిపోయాడు బాలన్న. అయితే మరో సమస్య ఎదురైంది. పక్కింటివాళ్ళ తలుపులంటే ఎడమవైపువా, కుడిపక్కవా? అని తటపటాయింపు. ఆ ఇరుగుపొరుగుల్లో ఏ ఒక్కరూ తనకు అంతగా పరిచయస్థులు కారు. లక్ష్మికిమాత్రం వాళ్ళు బాగా తెలుసు. తను ఇంతవరకు ఒక్కసారి కూడా వాళ్ళింటి గుమ్మం తొక్కిందిలేదు. పలకరించింది లేదు. ఏమున్నా అది ఆడవాళ్ళమధ్య పరిచయమే! తను పరిచయాలు పెంచుకోకపోవడం తప్పు అని మొదటిసారి బాలన్నకు అర్థమైంది.

మళ్ళీ ఆ దుర్వాసన గుప్పుమంది.

మొదట ఎడమవైపు ఇంటివాళ్లని లేపితేసరి అనుకున్నాడు. నాలుగు అడుగులు మెల్లగా వేసి వాళ్ళింటి దగ్గరికి వెళ్ళి తన ముక్కును కుడిచేతివేళ్ళతో ఒత్తిపట్టుకుని ఎడంచేత్తో కాలింగ్‌బెల్ నొక్కాడు.

ఆ వెంటనే లోపల్నించి గురక పెట్టడం ఆగిపోయింది. చిన్నగా మాట్లాడుతున్న మనుషుల సవ్వడి.

"ఇంత పొద్దుట ఎవరబ్బా? మీ అన్నో, తమ్ముడో... కావచ్చు'' అనే మగకంఠం.

"లేదండీ! మీకోసమే కావచ్చు. లేచి తలుపులు తీయండి'' అని భార్య జవాబు.

ఉన్నట్టుండి ఇబ్బందిగా ఫీలయ్యాడు బాలన్న. వెనుదిరిగి వెళ్ళిపోవడమే మంచిది అనిపించింది. కాని బెల్లు కొట్టాక వెళ్ళిపోతే మర్యాదగా వుండదనుకుని వాళ్ళకోసం ఎదురుచూశాడు.

తలుపులు సగం తెరుచుకున్నాయి. వాటి సందులోంచి తల బయటికి పెట్టిన రాఘవేంద్రరావు బాలన్నను చూసి కళ్ళు నులుముకుంటూ, "ఓ మీరా? ఏం కావాలి?" అన్నాడు ఆతుత చంపుకోలేక.

"ఏంలేదు... కాస్త బయటకు రండి! మాట్లాడాల్సివుంది'' తన ముక్కుపుటాల్ని వేళ్ళతో ఒత్తుతూ వదులుతూ అన్నాడు బాలన్న.

తను ఆరేళ్ళనుంచీ ఈ ఇంట్లో వుంటున్నా ఏనాడూ పలుకరించని ఈ పుణ్యాత్ముడు ఈరోజు... అదీ ఈ మసక వెలుతురులో తనతో మాట్లాడేందుకేముంటుందీ? ఇంతకీ





ఇతనితో తనకి కావాల్సింది ఏమిటి? మహా అంటే ఇతని భార్య మా ఆవిడకి మిత్రురాలు కావొచ్చు. తనూ ఇతన్ని చూడ్డం చాలా తక్కువ. అదయినా బయటి వరండాలో కూర్చుని పత్రిక చదువుతున్నప్పుడు మాత్ర మే! ఇలాంటి మనిషితో మాట్లాడాల్సిన పనేంటి? అనుకుంటూ విసుక్కున్నాడతను. అయితే టీనిసైతం చల్లార్చితాగే రకం అని ఆఫీసులో పేరుప్రఖ్యాతులున్నాయి ఆయనకు. కనుక కోపాన్ని దిగమింగుకుంటూ, "క్ష మించండి! నాకిప్పుడు తీరికలేదు. కావాలంటే తర్వాత రండి!" అంటూ నెమ్మదిగా తలుపులు వేసుకున్నాడు.

బాలన్నకు రావుమీదేకాదు, తనమీద కూడా కోపంగావుంది. తను పదేళ్ళనుంచి ఈ ఇంట్లో వుంటున్నా ఇరుగుపొరుగుల స్నేహం పొందలే దనే విషయం ఆ కోపానికి ఓ కారణమైతే... ఈ పెద్దమనిషి ఇంత త్వరగా తలుపులు మూసుకున్నాడేమిటనేది మరోకారణం.

"సరే..." అనుకుని తమ ఇంటికి కుడివై పున వున్న ఇంటివైపు కదిలాడు బాలన్న. ఆ ఇంటివాళ్ళు కూడా అతనికి అపరిచితులే! ఆ ఇంటి యజమానిని ఏరకంగా పలుకరించడ మా అనుకుంటూ కాలింగ్‌బెల్ నొక్కాడు.

ఆ ఇంటివాళ్ళు అప్పటికే నిద్రలేచినట్టున్నా రు. తలుపుల సందుల్లోంచి వెలుతురు కని పిస్తోంది. తలుపులు తెరిచిన ఓ లావుపాటి మనిషి వెంటనే "ఛీ! భరించలేని వాసన!! గబ్బు... కంపు'' అంటూ ముక్కుమూసుకు న్నాడు.

బాలన్నకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. కొంత తృప్తిగానూ వుంది. ఆ ఇంటాయన విషయం ఏమిటని అడిగేలోపే "ఎలాంటి వాసనో చూడండి! అందుకే నేను మిమ్మల్ని లేపాను'' అన్నాడు బాలన్న విజయగర్వంతో.

ఆ లావుపాటి మనిషి శివయ్యకు, బాలన్న ఏం చెబుతున్నాడో అర్థంకాలేదు. "ఎంత దుర్వాసనండీ మీ దగ్గర! ఛీ! దూరంగా వెళ్ళండి. అసలు మా ఇంటికి ఎందుకొచ్చారు? వెళ్ళండి'' అని కసురుకున్నాడు.

బాలన్న "వాసన నాదగ్గర కాదండీ! మీ ఇంట్లోనే కావచ్చుననుకుని వచ్చాను. కోప గించుకోకండి!" అన్నాడు శాంతంగా.

"పొద్దుటే ఎందుకండీ కయ్యానికొస్తున్నా రు? వెళ్ళండి వెళ్ళండి!" అంటూ శివయ్య బడాలున తలుపులు మూసుకునే ప్రయ త్నంలో వుండగా, "ఆగండాగండి! ఓమాట వినండి'' అంటూ బాలన్న ఠక్కున ఒక్క గెంతు గెంతి గుమ్మంలో అడ్డంగా నించున్నా డు.

"వద్దు, వెళ్ళిపొండి!" అంటూ బాలన్నను బయటికి తోసేయాలనుకునేంతలో లోప ల్నించి అతని భార్య నర్సమ్మ వచ్చింది. "ఆగండి, మీరు మరీనూ! సంగతి ఏమిటో కనుక్కోకుండా నెట్టేస్తున్నారేమిటీ! వారు మన పక్కింటివారుకదా!" అంది.

"ఔనా!" అంటూ ఓక్షణంపాటు అలా నిలు చుండిపోయాడు.

నర్సమ్మ "లోపలికి రండి! లక్ష్మిగారు బావున్నారా? మీ అమ్మగారికి ఏమైనా అయిందా?" అంటూ బాలన్నను ఆహ్వానించి, కూచోవడానికి ఓ కుర్చీ చూపించి, అతను ఏం చెబుతాడా అని ఆత్రుతపడసాగింది.

బాలన్న కుర్చీలో నిదానంగా కూచుంటూ "వాళ్ళంతా క్షేమమేనండీ. అసలు సమస్య అదికాదు. ఉన్నట్టుండి నాకు పొద్దుటే మెల కువ వచ్చింది. ఇల్లంతా వాసన, ఏమిటాని గాలించాను. కారణం తెలియలేదు. వాకిట్లోకి వచ్చాను. వీధిలోంచే వాసన వస్తున్నట్టు తోచింది. ఇన్నిరోజులు లేని ఈ దుర్వాసన ఈరోజు ఎలా వచ్చిందని ఆశ్చర్యపోయాను. ఇరుగుపొరుగువాళ్ళని కనుక్కుందాం అని మీ యింటి తలుపులు తట్టాను'' అన్నాడు.

దాంతో శివయ్య కొంత నిదానించాడు. "ఓ అందుకా మీరొచ్చింది. నాకూ ఇదే సమస్య. ఆఫీస్‌పనిమీద బెంగుళూరుకి వెళ్ళాల్సివుంది.

ఉదయం ఏడుగంటల బస్సుకి వెళ్దామని లేస్తే విపరీతమైన కంపు. నాక్కూడా కారణం తెలీలేదు. మా ఆవిణ్ని లేపి అడిగాను. ఏంలేదు పడుకోండి అంది. నేను ఈ వాసన భరిస్తూనే స్నానసంగ్రహా ముగించాను. అసలు మన కాలనీలో హఠాత్తుగా ఏదో జరిగినట్టుంది. చూడండి! ఎంత దుర్వాసనో. తట్టుకోలేకపోతున్నాం బాబూ!" అని ముక్కుని మూస్తూ తెరుస్తూ భుజాలమీది శాలువాను వూపుకుంటూ శివయ్య, "మరి... ఇప్పుడు ఏం చేయాలో చెప్పండి!" అన్నాడు బాలన్నతో.

బాలన్నకు కొంత ధైర్యం వచ్చింది. "చూడండి... నేను రచయితను, జర్నలిస్టుని. మాకు రాయడం, చదవడం, ఉపన్యసించడం... ఇవే తెలుసు. ఈ ప్రపంచంలో మాకన్నా గొప్పవాళ్ళు లేరు అనే అభిప్రాయం మాది. కాని ఈ వాసనముందు మాలాంటివాళ్ళు దేనికీ కొరగారనిపిస్తోంది. ఇప్పుడు దీన్నుంచి తప్పించుకునే మార్గం స్ఫురించడంలేదు. మీ అందరినీ నేను ఇన్నేళ్ళూ దూరంగా వుంచాల్సిందికాదని ఇప్పుడనిపిస్తోంది. మీరే చెప్పండి! ఇప్పుడేం చేద్దాం?"

శివయ్య నవ్వుతూనే "నవ్వితే కూడా ఈ పాడువాసన నోట్లోంచి పొట్టలోపలికి వెళ్ళేట్టుంది. ముందు మన కాలనీలో ఈ వాసన ఎక్కణ్నించి ప్రారంభమైందో కనుక్కోవాలి. ఆ తర్వాత దానికి పరిష్కారం ఆలోచించవచ్చు. దీనికి నేనూ, మీరూ సరిపోం. కాలనీలో వున్నవాళ్ళంతా ఏకంకావాలి. ముందు మనం రాఘవేంద్రరావుని లేపాలి. ఇట్లాంటివాటిల్లో అతని బుర్ర అమోఘంగా ఆలోచిస్తుంది. పదండి వెళ్దాం" అంటూ లేచాడు.

శివయ్య వెనకాలే బాలన్న అడుగులు వేస్తూ, "ఇందాకే వాళ్ళింటి తలుపులు తట్టి తిట్టించుకున్నాను. నేనైతే మళ్ళీ వాళ్ళని లేపనండోయ్! వాళ్ళు మీకు బాగా పరిచయస్థుల్లా వున్నట్టుంది. మీరే విషయమంతా చెప్పాలి" అన్నాడు.

"చెబుతాంలెండి, దానికేంభాగ్యం?" అంటూ శివయ్య రాఘవేంద్రరావు ఇంటి వాకిలిచేరి వాసన భరించలేక ముక్కు రుద్దుకుంటూనే బెల్లు ఒత్తాడు.

రాఘవేంద్రరావు 'మళ్ళీ అదే ఆసామి వచ్చివుంటాడు. ఇప్పుడైతే హడలగొట్టిమరీ పంపిస్తాను. వాడో రచయిత అయితే కావొచ్చు. ఈ సాహిత్యంతో మనకేంపని?' అనుకుంటూ కోపంగా తలుపులు తెరిచాడు. ఎదురుగా శివయ్య. రావుకి ఆశ్చర్యంతోపాటు ఆదుర్దా పుట్టింది. ఆ ఇద్దర్నీ చూసి ఏదో అయివుంటుందనుకున్నాడు. ఆ తర్వాత తలుపు సందులోంచి తల బయటికి పెడుతూ, కుతూహలాన్ని చంపుకోలేక "అరెరే! ఏమిటి, ఇంత పొద్దుటే వచ్చారు?" అన్నాడు.

"మీకు ముక్కు ఉందా లేదా?" శివయ్య కటువుగా అన్నాడు.

అది తమాషానో, మరేమిటో తెలీక రావు "నాకు ముక్కు ఉన్నదీ లేనిదీ మీకు కళ్ళుంటే కనిపించదూ?" అని పరుషంగా ప్రశ్నించాడు.

శివయ్యకు కోపం వచ్చింది. "అదికాదయ్యా! మన కాలనీ అంతా ఈ దుర్వాసనతో ఛస్తోంది. ఓ గంటనుంచి రచయితగారైన ఈ బాలన్నగారు ఆ వాసన తట్టుకోలేక నానా అవస్థలు పడుతున్నారు. మీరేమో ఏమీ కానట్టు వున్నారు. మీకు వాసన రావడంలేదా?" అని కాస్త మొరటుగానే అడిగాడు.

రావు తలుపులు పూర్తిగా తీసి వాకిట్లోకి వచ్చి ఓమారు దీర్ఘంగా గాలిని లోపలికి లాగి, "లేదు... అలాంటిదేమీ లేదే!" అన్నాడు నిబ్బరంగా, పరమ సుబ్బరంగా.

ఆశ్చర్యపోవటం శివయ్య, బాలన్నల వంతు అయిందీసారి!

"అరే ఇదేంటి? మరి మేం ఆ వాసన భరించలేకపోతున్నామే?" అన్నారు కలిసికట్టుగా.

రావు రెండోదఫా గాలి పీల్చి "అవును ఏదో పందికొక్కు చచ్చిపోయిన వాసనలా వుంది.




ఇక్కడే ఎక్కడో వుంటుంది. తెల్లవారాక కాకులు ఎత్తుకొనిపోతాయిలెండి'' అన్నాడు నిర్లక్ష్యంగానూ, నిర్వికారంగానూ.

శివయ్య అసహనంగా "మీలాంటివాళ్ళు ఉండబట్టే ఈ దేశం ఇలా తగలడింది స్వామీ! ఇది పందికొక్కు వాసన కాదు. మరేదో కుళ్ళిపోయినదాని వాసనై వుండవచ్చు. అదిసరే గానీ తెల్లవారింతర్వాత మీరు మాతోపాటు కాలనీ అంతా గాలించేందుకు వస్తారా లేక కాలనీ కూలనీ అనుకుని ఇలాగే వుండిపోతారా?'' అన్నాడు.

"రానని ఎలా చెప్పగలను? కాని బోల్డు పనులున్నాయి. ఈ విషయంలో మీరేం చేసినా దానికి నేను బద్ధుణ్ణి! పురపాలక సంఘానికి అప్లికేషన్ పెట్టడం, హెల్త్ ఇన్స్పెక్టర్ని కలవడం... ఏదైనా చెయ్యండి. దానికి నా సహకారం ఉంటుంది. మీ అందరికీ ఈ వాసనకు మూలం కాలనీలోనే వుంది అనిపిస్తే నాకూ ఉన్నట్లే! మీకు లేకపోతే నాకూ లేనట్లే! గీతలో పరమాత్మ ఏమన్నాడూ! 'ఈ వాసనా ప్రపంచంలో తామరాకుమీది నీటిబొట్టులా వుండాలి' అనిగదా! నా జీవిత దృక్పథమూ అదే! 'నేనుసైతం పద్మపత్ర ఇవాంభసీ'లాగ..."

"రండి శివయ్యగారూ! ఒకవైపు నేనుసైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను అంటూ పల్లవి ఎత్తుకుంటూ, మళ్ళీ తామరాకుమీద నీటిబొట్టులా వుండాలంటారేం! మనమే తెల్లవారింతర్వాత ఏదో ఒకటి తేల్చుకుందాం. అందాకా అగరొత్తులు ముట్టించుకుని మన ఇళ్ళల్లో వుండిపోదాం" అన్నాడు బాలన్న కోపంతో ధుమధుమలాడుతూ.

శివయ్యకు కూడా బాలన్న చెప్పిన విషయం బాగుందనిపించింది. ఆ ఇద్దరూ వెనుదిరగడం చూసి తలుపులు మూసుకుంటున్న క్షణంలో రాఘవేంద్రరావు ముక్కుకి భయంకరమైన వాసన కొట్టింది.

"అమ్మో! కంపువాసన. స్వామీ! రాఘవేంద్రా కాపాడుతండ్రీ!!" అనుకుంటూ గభాల్న కిటికీ తలుపులు మూసి... దేవునిగదిలోకి వెళ్ళి నిట్టూర్చి అలానే కూచుండిపోయాడు రావు.

బాలన్న తిరుగుముఖం పట్టడం చూసి శివయ్య "మా ఇంటికి రండి, ఎప్పుడు పిలిచినా రారు మీరు... ఈ రోజైనా రండి. మీ యింట్లో అగరొత్తులు లేకపోవచ్చు. మా దగ్గర డజన్లకొద్దీ ఉన్నాయి. వాటిని అంటించి పొద్దుపుచ్చవచ్చు'' అన్నాడు.

బాలన్న కాదనలేక సరే అంటూ శివయ్య వెంట వెళ్లాడు.

ఇద్దరూ లోపలికి వెళ్లగానే తలుపుల సందుల్లోంచి లోనికి చొచ్చుకువచ్చిన దుర్గంధాన్ని ఆపేందుకు అందాకా ఎదురు చూస్తూ కూచున్న నర్సమ్మ తన ముందు గుట్టలుగా పడివున్న అగరొత్తుల కట్టల్ని శివయ్యా చేతికి అందించింది.

"రెండు కట్టలు అంటించు'' అన్నాడు శివయ్య. ఆమె అలాగే చేసింది. వాటి సువాసనతో బయటి వాసన నిదానంగా మాయమైంది. ఈ ఆనందంలో శివయ్య బాలన్నతో, "నాకు దేవుడూ, దయ్యమంటే ఎంతో భయభక్తులు. అందుకని మా దగ్గర అగరొత్తులు స్టాక్‌లో వుంటాయి. మీరు దేవుడే లేరంటారని నాకు తెలుసు'' అన్నాడు.

బాలన్న ఇంత పొద్దుటే ఈ చర్చ అనవసరం అనుకున్నాడు. అర్జంటుగా కాఫీ కావాలనిపించింది. కానీ ఎలా అడగడం? అదీ ఇంకా చాలినంత పరిచయంలేని వాళ్లని. అయినప్పటికి పరోక్షంగా "ఇలాంటి విషయాల గురించి చర్చించాలంటే నాకు కాఫీ కావాలి. అది లేకుండా నాకు ఉత్సాహమే రాదు. మీకు ఇబ్బంది ఎందుకులెండి!" అన్నాడు.

శివయ్య ఒకింత సిగ్గుపడ్డాడు.

"అన్నట్టు మీరు మా యింటికి మొదటిసారిగా వచ్చారు. నేనే కాఫీ ఆఫర్ చేసి వుండాల్సింది. కాని మేం కాఫీకన్నా టీ అంటేనే ఇష్టపడతాం. మీరు టీ తీసుకుంటానంటే

ఫ్రిజ్‌లో పాలున్నాయి. టీ చెయించవచ్చు దానికేం భాగ్యం?"

బాలన్నకు టీ సరిపడదనికాదు, మొదటి ప్రిఫరెన్సు కాఫీయే! కాఫీ లేకపోతే టీ వద్దు అనేంతటి అజ్ఞాని మాత్రం కాడు.

"ఏదైనాగానీ ఆవిడకు అనవసరమైన ఇబ్బంది'' అన్నాడు ఎదురుగా కూచున్న అతని భార్యను చూస్తూ!

"నాకేం ఇబ్బంది? రోజూ ఈవేళకి టీ తయారవుతుంది. ఈవాళ అప్పుడే ఆరు గంటలైంది'' అంటూనే లోనికి వెళ్లి స్టౌ అంటించి ఆ గృహిణి నర్సమ్మ క్షణాల్లో రెండు కప్పుల్లో పొగలుగక్కే టీలతో వచ్చేసింది.

అందాకా అగరొత్తులు కాలడం గమనిస్తోన్న ఇద్దరూ టీ రావడంతో ఉత్తేజితులయ్యారు. వేడివేడి టీ తాగుతూ బాలన్న "మన కాలనీకి ఇదెక్కడి శని తగిలిందండి? తెల్లవారేక మనం బజారుకు వెళ్లాలంటే ఒక్కొక్కరికీ ఒక్కో అగరొత్తుల కట్ట కావాలి'' అన్నాడు.

"అవునుకదూ!" అంటూ శివయ్య తలగోక్కున్నాడు. మన కాలనీ దుకాణం తెరిచేటప్పటికి తొమ్మిది అవుతుంది. మరో దుకాణం అయితే ఇక్కణ్ణించి ఓ కిలోమీటర్ దూరంలో వుంది. మనం దుకాణం అతనికేమైనా కబురంపితే ఇప్పటికిప్పుడే వస్తాడుగానీ అతను ఎప్పట్లా తొమ్మిదికి దుకాణం తెరిస్తే మాత్రం జనం చచ్చిపోతారు. అందుకని అగరొత్తులకి ఇప్పుడే మనం ఏదో ఏర్పాటు చేయాలి'' అన్నాడు.

శివయ్య యావత్తు కాలనీ బాధ్యతని వహించబోయే వాడిలా మాట్లాడటం చూసి బాలన్నకు ఓ విధమైన ఆనందంతోపాటు వున్నట్టుండి భయమూ కల్గింది. ఇలాగైతే శివయ్య అమాంతం ఈ కాలనీలో లీడరయిపోతాడు. తను ఇంతవరకు ఈ కాలనీలో ఎంత మంది శ్రీమంతులు, ఎందరు అధికారులు వున్నప్పటికీ ఎవరినీ దేనికీ శరణు కోరలేదు. నిజం చెప్పాలంటే మొత్తం కాలనీ ప్రజలకి తనంటే పత్రికేయుడూ, రచయితా అని అపారగౌరవం. ఈ కాలనీలోని ఎందరో మహానుభవులు తను కనబడితే చాలు సగౌరవంగా పలకరిస్తుంటారు. కానీ ఈ శివయ్య చాలా చురుకైన మనిషి, ఎంతో దూరదృష్టి కలిగిన వాడనిపిస్తున్నాడు. ఏది ఏమైనప్పటికీ ఈ శివయ్య లోకుల దృష్టిలో తనకన్నా గొప్పవాడు కారాదు! ఇలా ఆలోచించి "గుడ్ ఐడియా శివయ్యగారూ! అన్నట్టు మీరు ఇప్పటికిప్పుడే మన కాలనీ దుకాణదారు వెంకటేశ్ ఇంటికి వెళ్లి అతణ్ణి లేపడం మంచిది. అలాగే వస్తూ వస్తూ మెడికల్ స్టోర్సు రామారావుని కూడా లేపండి'' అన్నాడు.

శివయ్యకు బాలన్న కుట్ర అర్థం కాలేదు. కుతూహలం చంపుకోలేక "ఎందుకు?" అనడిగాడు.

బాలన్న వివరించాడు "ఎంతైనా మన వెంకటేశ్ దుకాణంలో పది డజన్ల అగరొత్తుల పొట్లాలు వుండొచ్చు. మొత్తం కాలనీలో నూరు కన్నా ఎక్కువ ఇళ్లున్నాయి. ఒక్కో ఇంటికి రెండు పొట్లాల వంతున అవి ఎవరికి సరిపోతాయి. మరి గత్యంతరం... ముక్కులో దూది పెట్టుకోవడమే! అందుకే చెప్పాను మెడికల్ స్టోర్సు గురించి''

శివయ్య నవ్వాడు.

"అంతసేపూ ఈ వాసనను భరించాలా మనం? తెల్లవారడంతోటే ఏదో ఒకటి చేయాలి''

బాలన్న నవ్వాడు సీరియస్‌గా! అదంత తేలిక కాదు శివయ్యగారూ! మొదట కారణం ఏమిటో కనుక్కోవాలి. ఆ తర్వాత పురపాలక సంఘానికి తెలియజేయాలి. ఆ ఆఫీసు తెరిచేసరికి పదవుతుంది. ఆఫీసర్ వచ్చేది పదకొండింటికి. వారి హుకుం జారీ అయ్యేది పన్నెండున్నరకి ఇదంతా పూర్తయ్యేసరికి ఎంత కాదన్నా ఓ లారీ అగరొత్తులు అవసరం"

శివయ్యకు సమస్య ఎంత గంభీరమైందో అర్థమైంది. "నిజం బాలన్నగారూ! బుర్ర





అంటే మీదే, పేపర్‌వాళ్ళంటే మాటలా? సె బాష్' అని బాలన్నకు ఓ సర్టిఫికేటు ఇచ్చి "అలాగవుతే మనమిప్పుడు వెంకటేశ్ ఇంటికి వెళితే ఎలా వుంటుంది?" అని ప్రశ్నించాడు.

"సరే వెళ్లండి, మేం పేపరవాళ్లం అలా అందరి ఇళ్లకీ వెళ్లలేం గదా! మీరు వచ్చేసరికి బాగా తెల్లవారుతుంది. మళ్లీ ఇద్దరం కలిసి ఈ వాసనకు కారణం కనుక్కోవచ్చు. జనాన్ని సమీకరించవచ్చు. మరేమైనా అవసరమైతే చేయవచ్చు. ఇప్పుడు మాత్రం మీరొక్కరే వెళ్లండి ప్లీజ్' బాలన్న తెలివిగా శివయ్యను సముదాయించాడు.

శివయ్య డ్రెస్ మార్చి తలకో మఫ్లర్ చుట్టుకుని ఓ పొట్లం అగరొత్తుల్ని అంటించి వాసన చూస్తూ వాకిట్లోకి వచ్చి బాలన్నతో "స్కూటర్ స్టార్టయ్యేదాకా దయచేసి ఈ అగరొత్తుల్ని నా ముక్కు దగ్గర పట్టుకోండి, ఆ తర్వాత నిముషాల్లో పరుగులు తీస్తాను చూడండి'' అన్నాడు.

బాలన్న శివయ్య చేతిలోంచి అగరొత్తుల్ని స్వీకరించి తన ముక్కువద్ద ఓసారి పెట్టుకుని కొంత శాంతించి మరుక్షణం శివయ్య ముక్కు దగ్గరికి తీసికెళ్లాడు. ఎప్పుడూ ఒక్కటి రెండు కిక్కులకే స్టార్టయ్యే శివయ్య స్కూటర్ ఈ రోజు చెయ్యిచ్చి శివయ్యకు చెమటలు తెప్పించి, చివరికి స్టార్టయ్యింది. చచ్చిచెడి శివయ్య స్కూటర్ మీద ఝూమ్మంటూ వెళ్లిపోయాక బాలన్న తన ఇంటికి దౌడు తీశాడు. ఇల్లు చేరి తలుపులు మూస్తూ టైం చూశాడు. ఆరు ముప్పావు ఈ సీజన్లో తెల్లవారాలంటే ఇంకా పావుగంట' గడవాలి.

శివయ్య దుకాణందారు వెంకటేశ్ ఇంటిని వెతికి తలుపులు తట్టాడు.

"ఇంత పొద్దుటే ఎవరు దారి తప్పారబ్బా?" అనుకుంటూ కంగారుగా తలుపులు తీశాడు అతను. ఎదురుగా శివయ్య. స్కూటర్ మీద వచ్చినా బాగా చెమటపోసినట్లుంది. చొక్కాతోనే చెమట తుడుచుకుంటోన్న శివయ్య పరిస్థితి అర్థంగాక "ఏంటండి ఇంత పొద్దుటే?" అన్నాడు వెంకటేశ్.

శివయ్య రొప్పుతూ రోజుతూ, "ఏమీలేదు మీ దుకాణంలో ఎన్ని అగరొత్తుల కట్టలున్నాయి?" అన్నాడు సవాలు విసురుతున్నట్టు.

"ఎందుకు?"

"ఎందుకేమిటీ? ఎన్నున్నాయో చెప్పండి ముందు''

"ఎన్ని అని ఖచ్చితంగా చెప్పలేను. ఓ పది లేక ఇరవై డజన్లుండొచ్చు''

"అవి సరిపోవు... ఓ లారీ నిండా కావాలి''

వెంకటేశ్ డంగైపోయాడు, "ఓ లారీయా? రండి, లోనికి రండి'' అని ఆహ్వానించాడు, ఓ పెద్ద లాటరీలాంటిది తగిలిందనుకుని సంతోషపడి "ఒసేవ్! అర్జంటుగా రెండు వేడివేడి కాఫీలు పట్రా'' అన్నాడు.

"చెప్పండి శివయ్యగారూ! ఎందుకిన్ని అగరొత్తులు?"

శివయ్య కారణం చెప్పలేదు. బాలన్న పంపించాడని చెబితే గౌరవం మరింత పెరుగుతుందనుకుని "మన పేపర్ బాలన్న లేడూ? ఆయన పంపించారు. అందుకే వచ్చాను'' అన్నాడు.

"ఓహో! బాలన్న చెబితే సరి'' అని తనలోతను అనుకుంటూ "మంత్రిగారెవరైనా చచ్చి వుండొచ్చు, వారిని దహనం చేసేందుకు గంధపు చెక్కలతోపాటు అగరొత్తులూ కావాలని చెప్పి వుండాలి! మంచి పని చేశారు శివయ్యగారూ! నాకే ఆర్డర్ యిచ్చారుకదా! మీ ఋణం తీర్చుకోలేనిది'' అన్నాడు.

శివయ్య తనమాట ఈ రీతిగా మలుపు తిరుగుతుందని వూహించలా, సంకోచంతో సిగ్గుపడిపోతూ చెమటలు తుడుచుకున్నాడు.

"ఏ మంత్రిగార్థూ చనిపోలేదు. మా కాలనీకే దయ్యం పట్టుకుంది''

"అంటే?"

"ఏం చెప్పాలి మహానుభావా! ప్రస్తుతం మా వీధంతా అసహ్యకరమైన వాసన. కాల

నీలో శవం కుళ్లిపోయిన కంపు. ముక్కున్న వాడెవ్వడూ బతుకలేడు. కారణం ఏమిటో అంతుపట్టడంలేదు. ఇంకా కనుక్కోవాల్సి వుంది. అందాకా బతకాలంటే ఒక్కో ఇంటికి ఒక్కో డజన్ అగరొత్తులు అవసరం. మీరు దుకాణం తెరిచేటప్పటికి ఆలస్యమవుతుంది.



అందాకా మేం ఊపిరితీసుకోవాలికదా! అందుకే ముందుగా మీ దగ్గరికొచ్చాను''

శివయ్య మాటలకి వెంకటేశ్ నివ్వెరపోయాడు. "అంత వాసనా? కారణం ఇంకా తెలియలేదా? నేనిప్పుడు ఇక్కణ్ణించి నాల్గు కిలోమీటర్లు వెళ్లి అగరొత్తులకి ఆర్డర్ ఇవ్వాలి. కానీ వాళ్లింత తొందరగా దుకాణం తీస్తారా? అబ్బా... ఇదంతా ఓ పెద్ద భారతంలా తయారైందే?" అన్నాడు చెమట తుడుచుకుంటూ.

"చూడండి... నేనైతే చెప్పాల్సింది చెప్పాను. ఇంక మీ ఇష్టం! అప్పుడే సరిగ్గా తెల్లవారిపోయింది కూడా. బాలన్న నాకోసం ఎదురు చూస్తుంటారు. నే వెళ్లిరానా?" అంటూ శివయ్య బయల్దేరాడు, వెంకటేశ్ భార్య తయారు చేస్తోన్న కాఫీకై ఎదురు చూడకుండానే.



సీతాపురంలోని రంగయ్య వీధిలో కాకులు గమికూడడం చాలా అరుదుగా జరిగేపని. మధ్యతరగతివాళ్లు, శ్రీమంతులు, అధికారులు మొదలైన అన్నిరకాల వాళ్లకు నివాస స్థాన మైన ఈ వీధి ఎన్నడూ వార్తల్లోకి ఎక్కలేదు. ఈ ప్రదేశంలో వాహనాల రాకపోకలూ తక్కువే! అర్ధరాత్రిపూట నిర్జనంగా వున్నప్పటికీ ఇక్కడ ఎలాంటి అపాయం జరగదని మొత్తం సీతాపురం నివాసులందరికీ తెలుసు.

కానీ అలాంటి చోటనే ఓ అందమైన వేకువ జామున ఆ సీతాపురం రంగయ్య వీధే ఉన్న ట్టుండి కాకుల్ని ఆకర్షించింది.

తెల్లవారుతోందనగా సీతాపురం మధ్యలో ఏపుగా పెరిగిన పెద్దపెద్ద వృక్షాల మీద గూడుకట్టుకుని నివసిస్తోన్న కాకుల ముక్కులకు కమ్మని వాసన తగిలింది. మరుక్షణం ఏదో ప్రాణి చచ్చిందని వాటి ఆరో ఇంద్రియానికి తట్టింది. వెంటనే అవి కాకా అంటూ సీతాపురంలో నివసిస్తోన్న స్వజాతి బంధువులందర్నీ పిలుస్తూ వాసన ఎక్కడుందో అని వెతకనారంభించాయి. చివరికి అవి రంగయ్య వీధిలో వాసనకు మూల స్థానాన్ని కనుక్కోగలిగాయి. ఎన్నడూ ఇటువైపు దృష్టి సారించని వాటికి ఈ వీధిలోనే తమకు ఆహారం వుందని తేలింది. ఇంకేం మహా సంతోషంతో గుంపులు గుంపులుగా కాకులు రంగయ్య వీధికి లంఘించాయి.

సీతాపురం అంతటికీ ప్రొద్దున్న ఐదింటికే తెల్లవారితే సీతాపురంలోని ఈ రంగయ్య వీధికి మాత్రం తెల్లవారడానికి మరో గంట అదనంగా కావాలి. మామూలుగా భారీ బొజ్జల ఆడవాళ్లు అలవాటుగా చాలా తీరికగా నిద్రమొహాల్తో తలుపులు తెరుస్తారు. కానీ ఈరోజు హఠాత్తుగా విచ్చేసిన కాకులు, వాటి కాకారవాల్తో వున్నట్టుండి అందరికీ నిద్రాభంగం చేశాయి. ఎన్నడూ లేని కాకులు ఇవాళ ఈ వీధికి ఎందుకొచ్చాయా అనుకుంటూ ఇళ్ల తలుపులు తెరుచుకోసాగాయి. సీతాపురంలో రాజాజి నగర్ చాలా ఆకర్షణీయమైన కాలనీ, ఈ రాజాజినగర్‌లోనూ రంగయ్యవీధి మరీ అందమైన వీధి. వీధి పొడుగూతా గుల్‌మొహర్ చెట్లూ, వింజామరలు వీస్తున్నట్టు పెరిగినించున్న దేవదారు వృక్షాలు, మధ్యమధ్య ప్రతి యింటి వాకిట్లో కొబ్బరి... దానిమ్మ...

ఇంత అందమైన వీధి ఉన్నట్టుండి ఈరోజు అసహ్యంగా మారిపోయింది. తెల్లవారి లేచి తలుపులు తెరిచేసరికి ప్రతి వారికి గబ్బు వాసన కొట్టింది. ఉన్నట్టుండి ఘాటుగా కొట్టిన ఆ వాసనకు బెదిరిపోయిన ఆడవాళ్లు ఇదేమిటని ముక్కుపుటాల్ని సాగదీసుకున్నారు. వాసన నసాళానికెక్కాక ముక్కుల్ని వేళ్లతో మూసి వస్తోన్న వాంతుల్ని ఆపుకోలేక బాత్రూమ్‌కి వెళ్లి, ఇంకా గురకపెడుతోన్న ఇంటి యజమానుల్ని లేపారు. "ఎంతసేపు పడుకుంటారు? లేచి చూడండి. మన వీధంతా కుళ్లిపోయిన గబ్బువాసన వేస్తోంది'' అంటూ కుదిపారు.

రోజూ తమ శ్రీమతులతో కలిసి బెడ్‌కాఫీయో, టీయో తాగే భర్తలు ఈమెకు ఈ రోజు ఏమైందబ్బా? అని లోపల్లోపల తిట్టుకుంటూ మంచమ్మీద లేచి కూచుని ఏమిటి అంటూ దేబె మొగాలు పెట్టారు.

కొందరు లేచి పేపర్‌కోసం గుమ్మందాకా వచ్చి ముక్కు విరుచుకుంటూ ఛూ! ఛూ!! అని వాకిట్లో వుమ్మేసి ఎన్నడూ చూడని అసంఖ్యాకమైన కాకుల్ని చూసి హడలిపోయారు.

ఈలోగా శివయ్య స్కూటర్ అటువేపు వచ్చింది. వీధిలో వందలకొద్దీ కాకులు గుమికూడివుండడం, అవన్నీ చెట్ల మీద బైఠాయించి తెగ అరుస్తూ వుండడం, ఆ వీధి మధ్యగల చెత్తకుండీ చుట్టూ కాకులన్నీ గిరికీలు కొట్టడం చూశాడు. వాసనకు మూలకారణం ఈ చెత్తకుండీయేనని దృఢ పరుచుకున్నాడు. చివరికి విషయం తెలిసిందికదా అనే సంతోషంతో బాలన్న ఇంటిముందు స్కూటర్ ఆపి తలుపులు తట్టాడు. స్కూటర్ ఆగిన చప్పుడుకి





శివయ్యే కావచ్చునని తలుపులు తీయడానికి తయారైవున్న బాలన్న ఎడమ చేతిలోని అగరొత్తుల పొగని ముక్కు దగ్గరకి పోనిస్తూ "రండి, రండి'' అన్నాడు.

"శివయ్య ఆనందంతో బాలన్న ఇంట్లో కాలు పెడుతూనే ఓ కుర్చీ లాక్కుని కూచుని ఇప్పటికైనా వాసనకు మూలకారణం తెలిసిందా మీకు?" అన్నాడు.

బాలన్న నిర్వికారంగా "ఏదో చచ్చి వుండాలి. కాకులదాడి అప్పుడే ఆరంభమైంది. కానీ ఇన్ని కాకులు వచ్చి చేరాయంటే చచ్చిన ప్రాణి ఏదో పెద్దదే అయివుండాలి. అదేమిటన్నదే ఇప్పుడున్న సమస్య'' అన్నాడు.

"చచ్చిన ప్రాణి ఏదైనా కానీండి. అది వున్నది మాత్రం చెత్తకుండీలో'' శివయ్య ఏడేడు సముద్రాలు దాటి కనుక్కొన్నట్టుగా చెప్పాడు.

"చెత్తకుండిలోనా?"

"అవును, నేనే చూసొచ్చానుకదా!"

బాలన్నకు అర్థం కాలేదు. "చెత్తకుండీలు రెండు రంగయ్య వీధికి ఈ చివరనా ఆ చివరనా వున్నాయి. మనింటినించి రెండు చివరలూ సమాన దూరంలో వున్నాయి. ఏంతకాదన్నా ఓ ఫర్లాంగు దూరం. అంత దూరం నించి వాసన ఇక్కడిదాకా వస్తోందంటే నమ్మశక్యంగా లేదు'' అన్నాడు శివయ్యతో.

"కాదు స్వామీ! ఓ చెత్తకుండీ ఇప్పుడు మన పక్కింటికి ఎదురుగానే అవతరించింది. వాసన అక్కణ్ణించే వస్తోంది''

"అంటే..? ఇంతకు ముందున్న స్థలంనించి చెత్తకుండి తరలించబడిందంటారూ?"

"అవును... ఆ విషయమే నేను చెప్పుతున్నది''

"నడివీధిలో వుందా? లేక ఫుట్‌పాత్‌మీద వుందా?"

"ఇదేంటండీ, పోలీసులు అడిగినట్టే అడుగుతున్నారు. నా మీద మీకేమైనా అనుమానమా? దీన్ని తరలించింది నేనే అనుకుంటున్నారా ఏం?" కొంచెం రేగిపొయ్యాడు శివయ్య.

"ఛ, ఛా! మీరలాంటి పనెందుకు చేస్తారు? చేస్తే ఇంత శ్రమ ఎందుకు తీసుకుంటారు? మీ పట్ల నాకెలాంటి అనుమానమూలేదు. నడివీధిలో చెత్తకుండీ వున్నట్లయితే అది పోకిరీవెధవల పనే అయ్యుంటుంది. ఫుట్‌పాత్‌మీద వుంటే బుద్ధిమంతులెవరో ఏదో ఓ వుద్దేశంతోనే చేయించి వుంటారు. దీని వెనుక రాజకీయమో, మరేదో కారణం వుండి వుండాలి''

"నడివీధిలో లేదు. వీధికి పదడుగుల దూరంలో **కాలిబాటమీదే వుంది. అందుకని కావా**లనే చేసిన పనై వుంటుంది!"

"అవును''

"మరి చెత్తకుండిలోని వాసనకు కారణమేంటి?"

"అదే ఇక్కడున్న సమస్య. ఇన్నేళ్లుగా మన వీధి, అంతెందుకు మన పట్టణంలోని ఏ చెత్తకుండీలోనూ ఇలాంటి వాసనలేదు. ఇందులో వాసన వచ్చే పదార్థం ఏమై వుంటుంది? అలాంటి వస్తువును మన వీధి మధ్యలోకి తెచ్చి వేసింది ఎవరు? ఎందుకు? ఇదే ప్రస్తుతం సమస్య''

అంతలో "అగరొత్తులు, అగరొత్తులూ'' అంటూ తోపుడుబండితో వస్తోన్న ఒకడు అరిచాడు.

"అరే! వెంకటేశ్ యింత త్వరగా ఎలా వచ్చాడు?" అంటూ శివయ్య ఆశ్చర్యంతో ఓ నిముషం మౌనంగా వుండిపోయాడు.

"అగరొత్తులు, అగరొత్తులూ'' మళ్లీ అదే స్వరం.

బాలన్న "ఇతను వెంకటేశ్ తాలూకు మనిషి కాదు'' అన్నాడు. ఇద్దరూ తలుపులు తెరిచి బయటికి తొంగిచూశారు. అగరొత్తులు

గుట్టలు గుట్టలుగా పేర్చివున్న తోపుడుబండిని ఇంకా ఇరవై ఏళ్లు సరిగా నిండని ఓ యువకుడు తోస్తూ అరుస్తున్నాడు.

"అరే! ఇతనికి వాసన తగలడంలేదా?" అని తనని తనే ప్రశ్నించుకున్నాడు శివయ్య.

"ఎందుకురాదు? కానీ అతనిది వ్యాపారం?" అని జవాబిస్తూ బాలన్న "ఇదంతా చూస్తుంటే ఎవరో ఇది మొదలే సిద్ధం చేసుకున్న పథకంలా అనిపిస్తోంది. దీని అంతు కనుక్కోవాల్సిందే!" అని తలుపులు వేసి శివయ్య ముఖంలోకి చూశాడు.

"అది తర్వాతి విషయం. ఇప్పుడు ఈ చెత్తకుండీని తరలించే పని కావాలి కదా! దాని బాధ్యత ఎవరు వహిస్తారన్నది నా ప్రశ్న'' శివయ్య అమాయకంగా అడిగాడు.

"ఎవరు అంటే ఎవరు? మొత్తం వీధివాళ్లంతా చేరితే ఓ క్షణంలో పరిష్కరించవచ్చు. కానీ వీళ్లందర్నీ ఒక్క తాటిమీదికి తేగల నాయకుడు కావాలి కదా! నాకైతే సాధ్యంకాదు. మీరు చేస్తానంటే వద్దనను''

శివయ్య ఆలోచించాడు. తనకింకా ఓ ఏడాదిపాటు సర్వీసు వుంది. రిటైరయ్యాక ఇంట్లో వుత్తిగా వుండడంకన్నా పురపాలక సంఘ సభ్యుడవుతే ఏదో ఓ పనిలో వున్నట్టు వుంటుంది. విద్యావంతులు రాజకీయాల్లో ప్రవేశించడానికి ముందుకు రావాలి అంటున్నారంతా. వచ్చేవాళ్లు లేరు. తనే దిగితే ఎలా వుంటుంది? వచ్చే ఎన్నికల్లో ఈ వార్డునించి పోటీ చేసేందుకు ఇదో క్వాలిఫికేషన్ అవుతుంది. అందుకని ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని ఈ వీధిలో వున్నపళంగా హీరో కావాలి.

శివయ్య "అవును, చూద్దాం" అని లేచి నించుకున్నాడు. బాలన్న అతణ్ణి బయటికి పంపించి ఇంకా పడుకునివున్న లక్ష్మివైపు నడిచాడు. ఆమె పడుకున్న చోటినించే "ఏమైంది మీ రీసర్చి? దుర్వాసనా నివారణోపాయం కోసం ఏం చేశారు?" అంది.

బాలన్న ఆ విషయంలో జరిగిన ప్రగతిని వివరించాడు.

"మీరు చేతులు కట్టుకుని కూచుంటే చెత్తకుండి వున్నచోటే వుంటుంది. ఆ చెత్తకుండీ అక్కడ వున్నాక ఆ వాసనా వుంటుంది. ఈ వాసనలో కాఫీ, తిండి తిప్పలు నావల్లకాదు. మీరు పస్తులుంటానన్నా నాకు అభ్యంతరంలేదు'' అంది ఒకింత కోపం కలిసిన అసహాయతతో.

"నా ఒక్కడివల్లే ఎలా అవుతుంది లక్ష్మీ?" బాలన్న కొంచెం కోపంగా అన్నాడు.

"ఎందుక్కాదు? మీరు పత్రికలవాళ్లు. ఈ పట్టణానికి ప్రతినిధులూ, రచయితా కూడాను. మీ మాట పురపాలక సంఘాధ్యక్షులూ, అధికారులూ కాదంటారా? ఫోనుంది కదా! మాట్లాడండి''

లక్ష్మి మాటలు నిజమే అనిపించాయి బాలన్నకు. కాని ఎందుకో ఇలా అన్నాడు "శివయ్య ఇప్పటికే ఈ విషయంలో రంగంలోకి దిగాడు. మళ్లీ నేను ఇందులో తలదూర్చితే బాగుండదు''

లక్ష్మి మారుమాట్లాడలేదు. "మీ ఇష్టం" అంటూ ముసుగులాక్కుంది. బాలన్న చావడిలోకి వచ్చాడు. కిటికీ వేపు దృష్టి సారించి వీధిలో ఏం జరుగుతోందోనని తొంగిచూశాడు.

అగరొత్తుల బేరం జోరుగా సాగుతోంది. ప్రతి ఇంటినించీ ఒకరిద్దరు పరుగెత్తుకుంటూ వచ్చి ఒకళ్లమీద ఒకళ్లు పడుతూ తోపుడు బండిని చుట్టుముడుతున్నారు. అతను ఈ బేరం చూసి, ముగ్ధుడై కాలనీలో వీధులన్నింటిలోనూ ఇట్లాంటి కంపు వుంటే ఎంత బావుణ్ణు అనుకున్నాడు.

శివయ్య మాత్రం చేతిలో అగరొత్తి వాసన పీలుస్తూ మధ్యమధ్య దాని నిప్పు చల్లారిపోకూడదని పుల్లల్ని వూపుతూ ప్రతి ఇంటి తలుపులూ తట్టుతూ వాళ్లకి ఏవేవో చెబుతూ... దౌడు తీస్తున్నాడు. ఈ తతంగాన్ని కిటికీలోంచి చూస్తూ సంతోషపడిన బాలన్నకు నవ్వొతోపా




టు శివయ్య పడే కష్టం చూసి ఓ క్షణంపాటు సానుభూతి కలిగింది. అయితే అతను అనుభవించే బాధ ఎందుకోగానీ తనకి ఆనందాన్నిస్తున్నట్లు భావించి తనలోతను నవ్వుకున్నాడు.

అంతలో బాలన్న కడుపులో ఎలుకలు తిరగనారంభించాయి. ఆ వీధిలోని కొన్ని యిళ్లలోంచి అప్పటికే నాలుగైదు స్కూటర్లు, కార్లు బయల్దేరడానికి సిద్ధమయ్యాయి. అవి ఎక్కడికి వెళ్తున్నాయో బాలన్నకు తెలీదు. రోజూ పాలుపోసే తిమ్మప్ప, పేపర్ వేసే నారప్ప తెల్లవారి అర్ధగంట గడిచినా పత్తాలేరు. ఇదంతా ఎందుకు జరుగుతోందో బాలన్నకు అయోమయంగావుంది. దీని పూర్వాపరాలన్నీ సేకరించి సాయంత్రంలోగా తమ పత్రికకు రిపోర్టు చేయకపోతే మిగతా పత్రికలు తమకన్నా ముందే రిపోర్టు చేయగలవనుకుని లోపల్లోపలే బాలన్న మల్లగుల్లాలు పడ్డాడు. ఈ వాసనలో వీధిలో పడడం ఎలాగాని కంగారుపడ్డాడు. వెంటనే ఈ చెత్తకుండీని వీధిలోని హడావుడి, కాకుల గోల వీటిని కెమేరాలో బంధిస్తే బావుంటుందనిపించింది. మరుక్షణమే బాలన్న కల్పిత స్టూడియో యజమాని రామన్న ఇంటికి రింగ్ చేశాడు.

"హలో! నేను బాలన్నను మాట్లాడుతున్నాను. మీరిప్పుడు అర్జంటుగా మా రంగయ్య వీధికి రావాలి''

"ఏంటి స్వామీ! నేనింకా లేవనేలేదు. కాఫీ గీఫీ తాగేసి తొమ్మిదింటికి వస్తాను''

"అప్పటికి ఇక్కడేం మిగుల్తుంది? ప్రత్యేకత ఇప్పుడే వుంది''

"అంటే?"

"అంత సులువుగా చెప్పలేను. దాని వివరాలు రేపు మీరు మా పత్రికలో చూడండి. అది మీ ఫోటోతోపాటు వస్తుందన్నమాట"

"అలాగవుతే పెద్ద రహస్యం అంటారా?"

"ఊ. రహస్యమే! మీరిప్పుడు ఎంత వీలైతే అంత త్వరగా వచ్చి రంగయ్య వీధిలో గుమికూడిన కాకులది ఓ స్నాపు. పరుగులు తీసే జనాలది మరో స్నాపు, చెత్తకుండీది ఇంకో స్నాపు... ఇలా మూడు స్నాపులు తీసి డెవలప్ చేసి ప్రింట్లివ్వాలి. నేను ఫోటోలతోపాటు రిపోర్టును మూడు గంటల ఎక్స్‌ప్రెస్‌లో మా ఆఫీస్‌కి పంపిస్తాను'' అని ఫోన్ పెట్టేశాడు.

బాలన్నకు ఫొటోగ్రాఫర్ వస్తాడని సంతోషంగా వుంది. ఈలోగా తలుపు తట్టిన చప్పుడైంది. తీసి చూస్తే ఎదురుగా మళ్ళీ శివయ్యా.

ఏమైందని బాలన్న అడగడానికి ముందే అతను చెప్పాడు. "పాపం! ఆ వెంకటేశ్ ఉరుకులు పరుగులమీద వచ్చి చూసేసరికి వ్యాపారమే లేదు. అతడు కొట్టు తీయకముందే అగరొత్తుల బేరం జరిగిపోయిందని విని ధుమధుమలాడాడు. "ఎందుకండీ! నన్నిలా ఫూల్‌ని చేశారు?" అని తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టిపోశాడు. "చాలు బాబూ! ఇక్కడ అగరొత్తుల వ్యాపారం జోరుగా జరగ్గలదని ఆ తోపుడుబండిగాడికి ఎవరు చెప్పి వుంటారు?" అని వెంకటేశ్‌కు కోపం 'మీ స్నేహితులెవరైనా చెప్పి వుంటారని అతనికి అనుమానం అసలు అనుమానం మీ మీదే!"

బాలన్న "అవునా?" అన్నాడు విస్తుపోతూ,

"నేనిలాంటివాటిల్లో జోక్యం చేసుకునే వాణ్ణికాను. నాకు వెంకటేశ్‌పట్ల ద్వేషం, స్నేహం... ఏదీ లేదు. ఇంతకీ అతడు చిర్రుబుర్రులాడితే నాకేం? అతనివల్ల నాకేం అవుతుంది? అతనేం చేయగలడో చూద్దాం" అని నిర్లక్ష్యంగా మాట్లాడాడు.

"అదలా వుండనీండి. ఇప్పుడు చెయ్యాల్సింది ఏంటంటే... పురపాలక సంఘాధ్యక్షుడి యింటికిగానీ, పురపాలక సంఘముఖ్యాధికారికిగానీ ఫోన్ చేయడం, ఫోన్ ఎవరు చేస్తే బావుంటుందని నేను అందర్నీ అడిగి చూశాను. కొంతమంది 'మాకు తెలీదు వెళ్ళండ'న్నారు. మీరు ఈ వీధిలో ఎంతో పవర్‌ఫుల్-పత్రికవాళ్ళు కూడా కదా అన్నారు మరికొందరు. సి.ఎమ్. ఉన్నారుకదా, అతను ఫోన్ చేస్తే తప్పక పని అవుతుందన్నారు చాలామంది.

నేను మీరు రండి అని పిలిస్తే ఒక్కరూ నావెంట రాలా. మీరే చెప్పండి మా తరపున అన్నారు వాళ్ళంతా. నాకెందుకీ తలనొప్పి అనిపిస్తోంది. అయినా ముగ్గులోకి దిగాం. ఇంక సగంలో ఆపడం బాగోదు. ఇప్పుడు చెప్పండి- ముందు ఏం చేద్దాం?"

శివయ్య మాటల్ని ఆసాంతం విన్న బాలన్న తను ఈ వీధిలో ఎవరితోనూ ఎక్కువగా సంబంధాలు పెట్టుకోనప్పటికి తన గురించి చాలామందికి తెలుసని తెగ వుబ్బిపోయాడు. కాని ఈ సి.ఎమ్. ఎవరైందీ అతనికి అర్థంకాలా, అందుకే "సి.ఎమ్.అంటే చీఫ్ మినిస్టర్ అనుకుని. మన వీధిలో ఎవరండీ చీఫ్ మినిస్టర్?" అన్నాడు..

శివయ్య నవ్వాడు. 'సి.ఎమ్. అంటే ఇంకా మీకు తెలీదా? అరరే! చిన్నపిల్లలక్కూడా తెలుసు. మీకు తెలీదంటే...?"

"నిజంగానే తెలీదు'' బాలన్న దేబె మొహం పెట్టాడు.

"చూడండీ! మీరు పత్రికలో పనిచేస్తూ కూడా మన వీధి విషయమే తెల్సుకోలేకపోయారు. ఇంక మీరేం రిపోర్టు రాస్తారండీ?నేనిలా అంటున్నానని మరోలా భావించకండి. చూడండీ... మన ఎదురింటినించి ఎడమకి నాల్గో యిల్లుందికదా. ఆ యింటి యజమానే సి. మునియప్పన్. అంటే సి.ఎమ్''

"అలాగా! సి.ఎమ్. అన్న పేరు ఎలా వచ్చిందతనికి? ఏం చేస్తాడతను?"

"అతనికేంపని స్వామీ? వాళ్ళ ఊళ్ళో పెద్ద జమీన్వుంది. రాజధానికి సమీపంలో ద్రాక్షతోటుంది. వాళ్ళ నాన్న లాయరంట. ఇతనికి రాజకీయవేత్త కావాలని ఉన్నది. వచ్చేసారి మన నియోజకవర్గంనించి ఎం.ఎల్.ఏ.గా అధికారపక్షంనుండి పోటీచేస్తారుట. పోటీచేస్తే గెలవడం ఖాయం, గెలిస్తే మంత్రిపదవి గ్యారంటీ. మినిస్టరయ్యాక ఓ రోజు సి.ఎమ్..."

"అది సరే! ఇప్పుడే ఈ షార్టుఫామ్ ఎలా వచ్చిందయ్యా?"

"సి మునియప్ప అనడానికి బదులు సి.ఎమ్. అనడం ప్రారంభించేరు అతని మిత్రులు. మరో విశేషం ఏమంటే... అతను డ్రింక్స్ మానేసేయాలని మొండిపట్టుతో మానేసారుట. తాగాలనిపించినప్పుడల్లా చ్యూయింగు గమ్ నవలడం మొదలెట్టాడట. ఆ తర్వాత సిగరెట్లు వదిలేశాట్ట. పొగమీదికి మనసు లాగితే మళ్ళీ చ్యూయింగ్ గమ్నే ఆశ్రయించాట్ట. ఇలా దురలవాట్లన్నింటినీ చ్యూయింగ్ గమ్ సాయంతో వదిలేశాట్ట. ఇప్పుడు ఇలాంటి వాటన్నింటినీ వదిలెయ్యాలనుకునే వాళ్ళందరికీ అతను చూపే ఉపాయం ఒకటే. నోట్లో చ్యూయింగ్ గమ్ వుంచుకోండి అని. అతని వుపదేశప్రభావంతో ఎవరు దురలవాట్లు వదిలారో మరెవరు వదల్లేదోగానీ, అతను మాత్రం వదిలేశాడు, అందువల్ల చ్యూయింగ్గమ్ మునియప్ప అని అతని ఫ్రెండ్స్ సర్కిల్లో అతని పేరు ప్రసిద్ధమైంది''

బాలన్నకు నవ్వురాలా! శివయ్య "మీరే ఫోన్ చేయండి సార్, పురపాలక సంఘాధ్యక్షులకి! సి.ఎమ్. ఎంతయినా వేళాకోళం మనిషి. మీ మాటకి వున్న గౌరవం అతని మాటకి ఎలాగూ వుండదు'' అన్నాడు. "ఛ, ఛా! అలా కాదు. ఇక్కడ స్టేటస్ ప్రశ్నే లేదు, శివయ్యగారూ! మనకి ఇప్పుడు కావాల్సింది ఈ చెత్త కుండీని, ఇక్కణ్ణించి తీసివేయడం. ఆ తర్వాత అది మొదట ఎక్కడుందో అక్కడే వుంచడం. ఇది ఎవరివల్ల జరిగినా ఫరవాలేదు. నాతోనే జరిగిపోవాలన్న కోరిక నాకేమాత్రం లేదు, నేను ఎన్నడూ ఈ నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహించే ప్రజాప్రతినిధికాను''

శివయ్యకు తన మనసులో వున్న విషయం బాలన్నకు అర్థమైందా అనే అనుమానం కల్గింది. అవనీ! అర్థమైనప్పటికీ ఇతను తనకు పోటీదారుడు కాలేడని శాంతించి, లోపల్లోపల సంకోచపడుతూనే అన్నాడు "అలాగైతే నేను సి.ఎమ్.ను ఓ మాట అడుగుతాను. అతనేం చెబుతాడో చూద్దాం" అంటూ రింగ్ చేశాడు.




# ఏరిన ముత్యాలు

☆ ఇతరుల తప్పులను క్షమించు. కాని, నీ తప్పులను మాత్రం కాదు.

-సైరస్

☆ ఇతరులు తినడం కోసం జీవిస్తే నేను జీవించడం కోసం తింటాను.

-సోక్రటీస్

☆ నేను భవిష్యత్ గురించి ఎన్నడూ ఆలోచించలేదు. అది అంత త్వరగా వస్తుంది.

-ఐన్‌స్టీన్

☆ పవిత్రమైనది ఏమైనా వుంటే, అది మానవుడి దేహమే.

-విట్మన్

☆ నేరం ఒకవ్యాధి వంటిది. కనుక దానికి అలాగే చికిత్స చేయాలి.

-గాంధీజీ

☆ 'అసాధ్యం' అన్న పదం కేవలం మూర్ఖుల నిఘంటువులో మాత్రమే కనిపిస్తుంది.

-నెపోలియన్

☆ ప్రార్థించే చేతులకన్నా సాయపడే చేతులు పవిత్రమైనవి.

-మదర్‌థెరీసా

☆ అహింస అత్యున్నత ఆదర్శం. సాహసగుణం గలవారికేగాని పిరికివారికి అది వర్తించదు.

-గాంధీజీ

☆ నిర్బంధ వాతావరణంలో పనిచేసే పదిమందికంటే ఒక 'వలంటీర్' మిన్న.

-ఆఫ్రికన్ సూక్తి

☆ ఏ వ్యక్తి అయినా తాను చేసిన తప్పును అంగీకరించడం అవమానంగా భావించగూడదు.

-పోప్

☆ నన్ను కాలం తప్ప మరేదైనా అడుగు, అది ఒక్కటే నా చేతుల్లో లేనిది.

-నెపోలియన్

☆ నిజమైన హోదా పదవులవల్ల రాదు, పోదు.

-మాసింగర్

☆ ఆత్మసంయమనానికి మించిన సంపదలేదు.

-తిరువళ్లువర్

☆ దేశప్రజల ఆలోచనను వ్రాతమూలకంగా వెలిబుచ్చేది 'సాహిత్యం'

-ఛానింగ్

☆ అనుమానపీడితుడికి నిద్రాహారాలు వుండవు.

-ఇంగర్‌సాల్

☆ 'భ్రమ'ను నాశనం చేయటం చాలా కష్టం.

-చైనా సామెత

సేకరణ: **అజయ్‌బాబు**

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షల్లో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనల్లో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**జనవరి 'చతుర' నవల కుండీ**

సమీక్షకుని పేరు: ......................................................

చిరునామా: ......................................................

......................................................

......................................................

......................................................

"ఏమంటున్నారు శివయ్యగారూ? బాలన్న గారికి చెప్పారా?" అవతలివైపునించి సి.ఎమ్. ప్రశ్నించాడు.

"చెప్పాను సార్. కాని వారు మీరే పురపాలక సంఘాధ్యక్షులతో మాట్లాడాల్సిందిగా కోరుతున్నారు"

"నా కభ్యంతరంలేదు. కాని నేను పొలిటికల్ మనిషినని అతనికి తెలుసు. అతను దీనికి పొలిటికల్ కలర్ అంటిస్తే పని జరగదని నా భయం"

"నాకర్థమైంది సార్. కాని బాలన్న మిమ్మల్నే ప్రోసీడ్ కమ్మంటున్నారుకదా!"

"ఒక్క నిముషం. ఫోన్ బాలన్నగారికివ్వండి. నేనే చెబుతాను వారికి"

శివయ్య రిసీవర్ బాలన్న చేతికిచ్చాడు. బాలన్న "హలో!" అనగానే సి.ఎమ్. "నమస్కారం సార్!" అంటూ మొదలెట్టాడు.

"మీరే పురపాలక సంఘాధ్యక్షుడితో చెప్పండి" అంటూ బాలన్న తప్పించుకో ప్రయత్నించాడు. కాని సి.ఎమ్. తన పట్టువదల్లేదు.

"లేదు సార్! మీరు ఈ వీధికి పెద్దవారు, రచయితలు, పాత్రికేయులు. పైగా ఈ వార్త పత్రికలో వచ్చిందంటే మన ప్రభుత్వమే శ్రద్ధగా దృష్టిసారిస్తుంది. సాహిత్యరంగంలో మీది ప్రత్యేకమైన ముద్ర. మీకు మంచి పేరుంది. గొప్ప రచయితగా కీర్తిప్రఖ్యాతులున్నాయి. అలాంటప్పుడు మీ ముందు మేమెంతటి వాళ్ళమండీ?"

బాలన్న ఉబ్బిపోలా, "ఎవరడుగుతున్నారండీ ఈ కాలంలో రచయితల్నీ, పాత్రికేయుల్నీ? నలుగురైదుగురు మేధావులనిపించుకునే వాళ్ళు చదువుతారేమో మా రచనల్ని, వాళ్ళతో దేశం వుద్ధరించబడుతుందా? ఈ బూర్జువా ప్రభుత్వ బ్యూరోక్రసీ ముందు మేమనగా ఎంత? రాజకీయవాదులు అలా కాదు. ఎంతయినా వాళ్ళకి 'వాయిస్' వుంటుంది"

"చర్చ వద్దు సార్. మీరు పెద్దవాళ్ళు. దయచేసి చెప్పండి"

బాలన్న ఇంక కొనసాగించలేకపోయాడు. ఆల్‌రైట్ ఏం జరుగనుందో చూద్దామనుకుని పురపాలక సంఘ అధ్యక్షుడికి రింగ్ చేశాడు.

అవతలివైపు పురపాలక సంఘ అక్ష్యక్షుడు రామస్వామిగారు కాఫీ సేవిస్తూ మనుమరాల్ని తొడలమీద కూచోబెట్టుకుని ఆమె చిలక పలుకులకి సంతోషపడిపోతున్నాడు. ఇంత పొద్దుట ఈ శనిగాడు ఎవడబ్బా? అనుకుని రిసీవర్ ఎత్తి "హలో!" అన్నాడు.

"నమస్కారం సార్ నేను బాలన్నని మాట్లాడుతున్నాను"

"నమస్కారం. ఏ బాలన్న మీరు?"

జర్నలిస్టుని పత్రికా రిపోర్టర్‌ను"

"ఓహో! పేపర్ బాపతా? తెలిసింది లెండి... ఏంటంట?"

బాలన్న తమ వీధిలోని వాసన విషయం సాధ్యమైనంతవరకు వివరించాడు. రామస్వామి అయిష్టంగానే వింటూ మనుమరాలు తన తొడలమీద మూత్రం పోయడం గమనించి, పనిమనిషిని పిలిచి అమ్మాయిని ఎత్తుకొని పొమ్మనీ, భార్యని మరో పంచె తెమ్మనీ పురమాయించాడు. "ఒక్క నిముషం, రిసీవర్ అలాగే పట్టుకోండి" అని బాలన్నకు చెప్పి తడిసిన పంచె విప్పేసి భార్య తెచ్చిచ్చిన కొత్త పంచె ధరించి లావుపాటి బొజ్జని నిమురుతున్నపుడు గేటు తెరిచిన చప్పుడైంది" ఇన్సులిన్ ఇంజక్షన్ తీసుకునే టైం అయ్యింది కదా! డాక్టర్ వచ్చినట్టుంది" అన్న భార్య మాటకు "అవునంటూ" జవాబిచ్చి రామస్వామి మళ్ళీ కింద పెట్టేసిన రిసీవర్ ఎత్తాడు.

"చూడండి బాలన్నగారూ! ఇది మున్సిపాలిటీకి సంబంధించిన విషయమైనప్పటికీ హెల్త్ డిపార్టుమెంటుకి చెందింది. మీరు మీ ఏరియా హెల్త్ ఇన్స్‌పెక్టర్‌ని కలవండి అంటూనే ఇంక బాలన్న మాటలకోసం ఎదురుచూడక ఫోన్ పెట్టేశాడు.

బాలన్నకు నిరాశ కలిగింది. కోపమూ



వచ్చింది. దీన్ని వార్తగా రాయాలి అనుకుంటుండగా వీధిలో పెద్దగా తిట్లూ శాపనార్ధాలూ వినిపించాయి. కిటికీలోంచి తొంగిచూసేసరికి ఫొటోగ్రాఫర్‌ను మెడబట్టి వీధిలోని నలుగురైదుగురు మగవాళ్ళు బెదిరిస్తున్నారు.

"ఎవరు చెప్పారండి మీకు ఈ వీధి ఫొటో తీయమని? ఈ వీధి వాసన మీ ఫొటోలో వస్తుందా? మీకెందుకండి ఈ పని. ఎక్కడ మీ కెమేరా? అదిలా ఇస్తే బతికిపోతారు. లేధంటే దాన్ని లాక్కుని పచ్చడి పచ్చడి చేస్తాం"

ఫొటోగ్రాఫర్ ఇలా జరుగుతుందని కలలో కూడా అనుకోలా. ఇలాంటి అనుభవం అతనికి ఏనాడూ ఎదురుకాలా. వీధివాసనతో ముందే అతనికి తలనొప్పి వచ్చేసింది. బాలన్నగారి మాట జవదాటలేదుగానీ, ఇక్కడ ఇప్పుడు ప్రాణాలకే ముప్పు వాటిల్లేట్లుంది.

"మన పత్రికా ప్రతినిధిగారు చెప్పారని నేనొచ్చాను సార్! నాకేం తెల్సు మీ వీధిలో యింత దుర్వాసన వుందనీ, అది ఫొటోలో రాదనీనూ'' అన్నాడు.

ఇంతలో బాలన్న ఒక్క గెంతులో అక్కడికొచ్చాడు. అతని వెనకాలే శివయ్య కూడా వచ్చాడు. ఫొటోగ్రాఫర్‌ను దబాయించిన వ్యక్తుల ముఖపరిచయం వున్నప్పటికీ వాళ్ళంతా ఎవరన్న విషయం బాలన్నకు తెలీదు. తన రెండు చేతులెత్తి నమస్కరించి "నేను చెబితేనే అతనొచ్చాడు. దయచేసి అతణ్ణి విడిచిపెట్టండి!" అన్నాడు.

వాళ్ళలో ఓ యువకుడు "మీ పత్రికకు రిపోర్టూ, ఫొటో పంపిస్తే సరిపోతుంది. డబ్బులూ వస్తాయి. కాని ప్రజలిక్కడ వూపిరి బిగబట్టి చచ్చిపోతున్నారు. దానికి మీ పత్రికవాళ్ళు ఏం చేస్తున్నట్టు?" అని ప్రశ్నించాడు.

బాలన్న "ఓ అదా! మీరు ఇంకా యువకులే స్వామి పొద్దుట ఐదింటికే నా ముక్కుకి ఈ వాసన కొట్టింది స్వామి. అప్పటినుంచి నేను ఏమేమిచేశానో శివయ్యను అడగండి. ఊరికే నే అభాండాలు మోపకండి ఇప్పుడు మనం ఏమిచెయ్యాలో ఓ నిర్ణయానికొద్దాం" అన్నాడు.

ఆలోగా శివయ్య ఈ గుంపులోనుండి పరుగెత్తుకెళ్ళి సి.ఎమ్.ని పిలుచుకొచ్చాడు.

అతడు "డోంట్ బి ఎక్సైటెడ్! ప్లీజ్, మా దగ్గరికి రండి! అన్నీ డిస్కస్ చేయవచ్చు'' అంటూ అందర్ని ఆహ్వానించాడు.

బాలన్న, శివయ్య, ఫొటోగ్రాఫర్, అతణ్ణి అటకాయించిన నలుగురైదుగురూ సి.ఎమ్. వెంట వెళ్ళారు. అందర్నీ లోనికి పిలిచి విశాలమైన హాలులో కూచోబెట్టిన సి.ఎమ్. కాస్త కాఫీ తీసుకుంటారా?" అని అతిథుల ప్రత్యుత్తరం కోసం ఎదురుచూడకుండా లోనికెళ్ళి వచ్చి "మీరంతా ఎప్పుడోగాని రారు. ముఖ్యంగా బాలన్నగారు. ఆయన ఎన్నడూ ఎవరింటికీ వెళ్ళింది లేదు. అంత ప్రిన్సిపుల్డ్ అండ్ డిగ్నిఫైడ్ జంటిల్‌మేన్. వారు రావడం మా భాగ్యం" అంటూ ఓ కూర్చీ లాక్కుని కూచుని "మన వీధి సీతాపురంలోనే కామ్ అండ్ క్వైట్ అని పేరుపొంది వుండగా ఎందుకిలా జరిగిందన్నదే నాకు ఎంతో విచారంగా వుంది. ఐ కాంట్ టాలరేట్ దిస్. నౌ వి షుడ్ ఫైండ్ అవుట్ ద సొల్యూషన్ ఫస్ట్. అలాగే ఇలాంటివి మళ్ళీ జరక్కుండా జాగ్రత్తగా వుండాలి'' అని అందరి ముఖాల్లోనికి చూస్తూ, వారి హావభావాల్ని అర్థంచేసుకోసాగాడు.

బాలన్న సి.ఎమ్గారి విశాలమైన హాలుని పరిశీలించడంలో నిమగ్నమయ్యాడు. శ్రీమంతుల ఇళ్ళలో వుండే అలంకారాలన్నీ వున్నాయి. గాంధీగారి ఓ పెద్ద ఛాయాచిత్రం సి.ఎమ్. కూచుని వున్న మూవింగ్ ఛెయిర్ వెనకాల విరాజిల్లుతోంది. బాలన్న ఈ బోసినోటి ముదివగ్గుగారి నిరాడంబరతని ఈ పొలిటీషయన్లు ఎలా అంగుళం అంగుళం చంపివేస్తున్నారో ఓ వ్యాసం రాసేయవచ్చు అని అంచనా వేయసాగాడు.

ఫొటోగ్రాఫర్ నిశ్శబ్దంగా వున్నాడు. మిగిలినవారు, శివయ్య మినహా ఇన్నాళ్ళుగా ఈ వీధిలో వుండి కూడా ఈ గొప్ప మనిషి




స్నేహాన్ని ఇప్పటివరకూ సంపాదించలేకపో యామే అంటూ విచారిస్తున్నారు. శివయ్య సి.ఎమ్. తనకు ఎంతో దగ్గరి వాడని చూ పించుకోవడానికి ఓసారి కిచెన్ రూంలోనికెళ్ళి బయటికొచ్చి "మన ఈ మునియప్పగారు లేకపోతే ఈ యేడు నాకు ఈ వూరినుండి బదిలీ జరిగేది. నా బదిలీ అయివుంటే ఈరోజు మీకెంత కష్టం కలిగేదో ఓసారి ఆలో చించండి'' అని అప్పుడే వచ్చిన కాఫీ చప్ప రించడం మొదలెట్టాడు.

సి.ఎమ్. బాలన్నను కాఫీ తాగుతుండగానే ప్రశ్నించాడు ''ఫోన్‌లో రామస్వామి మాట్లా డారా సార్?"

"ఆఁ..." నిరుత్సాహంగా అన్నాడు బాల న్న.

"ఏమన్నారు సార్?" సి.ఎమ్. ఉల్లాసంగా అడిగాడు.

బాలన్న విషయం వివరించాడు.

సి.ఎమ్. అవాక్కయ్యాడు. "మన రాజకీ యవాదులకి సిన్సియారిటీ లేదు సార్. ఈ పాతవాళ్ళందర్నీ రాజకీయాల్లోంచి పంపించందే దేశానికి విముక్తి లేదు'' అని ఎవ్వరూ మాట్లాడుకుండా వుండడం చూసి సి.ఎమ్. మధ్యలోనే ఆపాడు.

"అవును కరెక్టు'' అంటూ శివయ్య తలూ పాడు. బాలన్న ఈ విషయంలో తల దూర్చ కుండా "ముందేం చేయాలో చెప్పండి. హెల్త్ ఇన్స్‌పెక్టర్‌ని ఎవరు కలుస్తారు?" అని ప్ర శ్నించాడు.

అంతా ఒకరి మొహం మరొకరు చూసుకు న్నారు. ఒకరన్నారు. "అతనిల్లు నాకు తెలుసు సార్. కాని అతనింకా లేచే సమయం కాలా''

"అతను మనకి రెస్పాన్సు యిస్తాడన్న గ్యారంటీ ఎక్కడ?" మరొకరన్నారు.

"ఇవ్వకపోతే... ఆ విషయమే రాసివ్వనీ'' అన్నాడు శివయ్య.

"రాసిస్తే ఏమవుతుంది? వాసన పోతుందా? అతన్ని కలిసినందువల్ల అతడు రిపోర్టు చేస్తాడంతే! అతనేమైనా ఈ చెత్తకుండి ఎత్తడానికొస్తాడా? అతని రిపోర్టు అంది మున్సి పాలిటీ నౌకర్లు ఇక్కడికొచ్చేసరికి రెండ్రోజులు పడ్తుంది. ఈలోగా మనమంతా ఈ కంపుతో చచ్చిపోవడం ఖాయం" బుద్ధిమంతుడొకరు సమస్యను చక్కగా వివరించాడు.

"సి.ఎమ్.గారు అనుకుంటే అన్నీ అవే అవుతాయి. మనమతన్ని ఎంఎల్ఏగా చేస్తే ఈ ప్రశ్నే వుండదు. వచ్చే ఎలక్షన్లలో ఖచ్చి తంగా పార్టీ గీర్టీ చూడకుండా మనమంతా సపోర్టు చేస్తే సి.ఎమ్. ష్యూర్‌గా విన్ అవుతా రు'' శివయ్య అందరి ఆలోచనల్ని మరోవేపు తీసుకుపోయాడు.

బాలన్నకు కోపమొచ్చింది. "ఎస్.టి.డి. సౌకర్యం వుంటే బాగుండేది. ఈ పాటికి నేనే రాజధానికి ఫోన్ చేసి మా ఎడిటర్‌కి చెప్పి వుండేవాణ్ణి! ఐదు నిముషాల్లో ఈ చెత్తకుండి ఇక్కణ్ణించి మాయమైపోయేది. ట్రంక్ బుక్ చేస్తే ఒక్కోసారి రోజు రోజంతా ఎదురుచూ సినా దొరకిచావదు''

చర్చ దిక్కూదివాణం లేకుండా ఎక్కడెక్క డికో వెళ్ళిపోతూంటే-

"నేను వస్తాను'' అంటూ ఫొటోగ్రాఫర్ లేచాడు. బాలన్న "ట్రంక్‌కాల్ బుక్‌చేస్తాను'' అనుకుంటూ ఇంటికొచ్చాడు. శివయ్య వుల్లా సంగా "నేను హెల్త్ ఇన్స్‌పెక్టర్ని కలుస్తాను సార్' అన్నాడు సి.ఎమ్.తో.

"తప్పకుండా కలవాలి. మీరు ఎవరినైనా వెంట తీసుకెళ్ళండి. అతని ఇల్లు తెలుసన్నారు కదూ?" అన్నాడు సి.ఎమ్.

ఇద్దరూ బయటికొచ్చారు. వీధిలో జన సంచారంలేక నిశ్శబ్దంగా వుంది. వెంకటేష్ కొట్టు తలుపులు తీసి కూచుని అగరొత్తుల్ని అంటిస్తూ అవి వృధాగా కాలుతుంటే తన రక్తమే కాలిపోతున్నదేమో అన్నట్టు లోపల్లో పల ఏడుస్తున్నాడు. పొద్దుట ఇడ్లీ తినకుండా రావడంచేత అతని పొట్టలో ఎలుకల చప్పుడు. నిజానికి ఆ ఆకలి మంటకన్న శివయ్య తన

దగ్గరికొచ్చి చెప్పిన విషయాన్ని తన పక్కింటి
రత్నాకర్ విని హఠాత్తుగా స్కూటర్‌మీద
వచ్చేసి వీధంతటికీ అవసరమైన అగరొత్తుల
వ్యాపారం చేసి వుండొచ్చు అన్న అనుమానం
ఎక్కువగా కాల్చిపారేస్తోంది. వీటిల్లో వేటినీ
లక్ష్య పెట్టనట్టు కాకులు చెత్తకుండీ చుట్టూ తిరు
గుతూ దాని పైభాగంలోని చెత్తా చెదారాన్నీ,
రద్దు కాయితాల్నీ ఎంగిలాకుల్నీ తమ ముక్కు
లతో పారేస్తున్నాయి. చెత్తకుండీ అట్టడుగున
ఉన్న వాసనకి మూలకారణమైన కుళ్ళిపో
యిన మాంసం కోసం ఆశపడుతున్నాయి.
ఇందువల్ల తొట్టిలో ఇంకా మిగిలిపోయిన చెత్తా
చెదారంకన్న ఎక్కువగా కాకులన్నీ చెల్లాచెదు
రు చేయగా వీధంతా పరుచుకొని పోయిన
చెత్తాచెదారమే ఎక్కువగా గబ్బు వాసన పుట్టి
స్తోంది. అందువల్లే అగరొత్తుల్ని అంటించి
కిటికీ రెక్కలు మూసి వుత్త అగరొత్తులవాసననే
పీల్చుకొన్న వీధి జనంలో కొంతమందికి ఈ
అగరొత్తుల వాసన కూడా ఎలర్జీగా మారి
చిన్నగా దగ్గుకు కారణమైంది. మరికొందరికి
అగరొత్తుల వాసన ఏదో, బయటి వాసనేదో
అయోమయంగా వుంది. అలాంటివాళ్ళు





క్షణంసేపైనా ఇల్లు విడిచి వేరే వీధికైనా వెళ్ళివద్దామనుకుని బయట కాలుపెట్టేసరికి బ్రహ్మాండంగా చెట్టుమీద బైఠాయించిన కాకిమాలోకం రెట్టలువేయసాగింది. 'హతవిధీ!' అనుకుంటూ వాళ్ళంతా మళ్ళీ తమ యిళ్ళలో చేరి శరీరంమీద పడ్డ రెట్టల్ని కడుక్కోవడంలో నిమగ్నమై కాస్సేపు వాసన విషయాన్ని మరిచిపోయారు. శివయ్యకూ ఇలాంటి అనుభవం ఎదురైంది. అయినా అతను ఖాతరు చేయకుండా జేబురుమాలుతో రెట్ట తుడిచేసుకుని హెల్త్ ఇన్స్పెక్టర్‌ను కలవడానికి మరొకర్ని వెంటబెట్టుకుని స్కూటర్‌ను పరుగులు తీయించాడు.

శివయ్యకు తెలీకుండానే లోపల్లోపల అతను అప్పటికే పురపాలక సంఘానికి ఈ కాలనీనించి ఎన్నికైనట్లు ఓ పగటికల రూపుదిద్దుకుంటూ వుండగా- అకస్మాత్తుగా ఆ పక్క అంబేడ్కర్ వీధినుంచి వచ్చిన రిక్షా- శివయ్య స్కూటర్‌కు ఢీకొట్టింది. అతను స్కూటర్‌తో సమేతంగా రోడ్డుమీద పడిపోయాడు.

హెల్త్ ఇన్స్పెక్టర్ని కలవడానికి వెళ్ళిన శివయ్యా, మరో మనిషీ గంటదాటినా తిరిగి రాకపోవడం చూసి సి.ఎమ్. ఆందోళన చెందాడు. శివయ్య అందరితోనూ సర్దుకుపోగల మనిషి. కాని అతనితోపాటు వెళ్ళిన సంజీవ్‌కుమార్ ఉడుకురక్తం ఉరకలేస్తోన్న యువకుడు. మాటామాటా పెరిగి చెంప ఛెళ్ళుమనిపించే వరకూ తయారయ్యే మనిషి. ఇప్పుడక్కడేమైనా జరగరానిది జరిగితే ఎలా తెలుస్తుంది. ఇక్కడంటే ఫొటోగ్రాఫర్ తప్పించుకోగలిగాడు. కారణం ఇక్కడివాళ్ళు మంచివాళ్ళు. మరి అక్కడో?

హాలంతా కాలుగాలిన పిల్లిలా పచార్లు చేస్తూ ఆలోచించసాగాడు సి.ఎమ్.

హెల్త్ ఇన్స్పెక్టర్ ఇల్లు ఎక్కడో తనకి తెలీదు. తెల్సినవాళ్ళు ఈ వీధిలో చాలా మంది వుండొచ్చు. అయితే వాళ్ళని కనుక్కోవడానికి యిల్లిల్లూ తిరగడం తన ప్రతిష్ఠకు భంగం. ఇంతకీ ఈ బాధ్యత తనకెందుకు? ఎలాగూ బాలన్న ఈ విషయంలో ఉత్సాహాన్ని కనబరుస్తున్నారు. అతనికే ఈ బాధ్యతా అప్పగిస్తే సరి అనుకుంటూ సి.ఎమ్. బాలన్నకు ఫోన్ చేశాడు.

బాలన్న 'రాజధానికి బుక్‌చేసిన ట్రంక్‌కాల్ దొరికినట్టుంది' అనుకుంటూ ఫోన్ ట్రిన్, ట్రిన్ అనగానే ఎత్తి "హలో, బాలన్న స్పీకింగ్" అన్నాడు.

"నేను మునియప్పను'' అన్నాడు సి.ఎమ్.

నిరాశపడ్డ బాలన్న అనివార్యంగా "ఏంటి?" అన్నాడు.

"ఇంకా శివయ్య రాలా. ఏమైందోనని గాభరాపడ్తున్నాను. అతనితో వెళ్ళిన వ్యక్తి చాలా షార్ట్ టెంపర్డు. మరక్కడ గొడవేమైనా అయిందేమోనన్న అనుమానం"

"అలాగా!" బాలన్న కూడా భయపడ్డాడు.

"నేనే వెళ్ళాల్సింది! చూడండి, ఇన్స్పెక్టర్ ఇల్లు తెలీదు. అలాగని దిక్కులు చూస్తూ కూచుంటే మనం చచ్చినట్టే!" బాలన్న పరోక్షంగా సి.ఎమ్.ని రెచ్చగొట్టాడు.

అంతలో బాలన్న ఇంటిముందు ఓ రిక్షా ఆగింది. "ఒక్క నిముషం ఆగండి!" అంటూ రిసీవర్ కిందపెట్టిన బాలన్న ముక్కు మూసి పట్టుకుని కిటికీ రెక్కలు తెరిచి చూస్తే రిక్షాలోంచి దిగిన అపరిచితుడు కిటికీలోంచి కన్పించే బాలన్నను చూసి "సార్ తాలూకా ఆఫీస్ శివయ్యగారి ఇల్లు ఇదేనాండీ?" అనడిగాడు.

"ఊ! ఎందుకండీ?" బాలన్న ఆసక్తిగా అడిగాడు.

"వారికి ఆక్సిడెంట్ అయింది. దేవి నర్సింగ్‌హోమ్‌లో అడ్మిట్ అయ్యారు. ఇంట్లో చెప్పిరండని నన్ను పంపించారు''

"ఏమైంది, ఏమైంది'' బాలన్న వణికే గొంతుతో ప్రశ్నించాడు.

"రిక్షా, స్కూటరూ ఢీకొట్టుకున్నాయట! చెయ్యి ఫ్రాక్చరయినట్టుంది. రెండ్రోజులు రెస్టు




తీసుకోవాలన్నారట డాక్టర్లు. పాపం! చాలా మంచిమనిషి. నాకూ బాగా పరిచితుడే. నా భార్యకి ఒంట్లో బాగోలేక నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళాను. సరిగ్గా అప్పుడే అతనూ అడ్మిట య్యాడు''

ఆ అపరిచితుని మాటలు విని బాలన్న బేజారయ్యాడు. నర్సమ్మకి ఈ విషయం చెప్పకూడదు. తను వెళ్ళి శివయ్యని పలక రించిరావాలి అనుకుంటూ "మీరు పదండి స్వామి! బాలన్న వస్తున్నాడని చెప్పండత నితో'' అన్నాడు.

లోపలికివచ్చి రిసీవర్ తీసుకుని "హల్లో!" అన్నాడు. సి.ఎమ్.తో బాలన్న విషయం వివ రించి "నేనిప్పుడు అక్కడికి వెళ్ళాలి కదా!" అన్నాడు హడావుడిగా.

"తొందరపడకండి సార్! ప్రాణానికైతే ప్ర మాదం లేదు కదా వారికి, మీరు హెల్త్ ఇన్స్‌పెక్టర్ యింటికెళ్ళి వాసన విషయం చెప్పండి. నేను శివయ్యను చూసొస్తాను''

ఆలోగా బాలన్నకు తను ట్రంక్‌కాల్ బుక్‌చే సింది గుర్తుకొచ్చింది. బయటికి వెళ్ళాక లైన్ దొరికితే ఎలా అని సి.ఎమ్.కు విషయం చెప్పాడు.

బెంగుళూరుకి ఎక్కడ దొరుకుతుందండీ లైన్? ఎక్స్‌ఛేంజ్‌లో చెప్పి వెళ్ళండి''

సరేనని బాలన్న మళ్ళీ ఎక్స్‌ఛేంజ్‌కి ఫోన్ చేసి నంబర్ గుర్తుచేస్తూ "నా కాల్ ఏమైంది? అన్నాడు. రెండు నిముషాల తర్వాత "లైన్ క్లియర్‌గా లేదు. సాయంత్రం దొరుకుతుంది'' అనే జవాబందింది.

అతనికి విపరీతమైన కోపమొచ్చింది. ఫోన్ పెట్టేసి హెల్త్ ఇన్స్‌పెక్టర్ ఇంటికి వెళ్ళడ మే బావుంటుందనుకుని డ్రెస్ మార్చుకు నేందుకు సిద్ధమయ్యాడు.

ఇంతలో ఫోన్ మళ్ళీ చప్పుడైంది. బాలన్న కంగారుగా ఎత్తాడు.

"ఏంటి స్వామి? మీరో జర్నలిస్టా? మీలాంటి పాత్రికేయులు వుండీ మీ వీధి దుర్వాసనను తెల్లవారి రెండు గంటలయినా నివారించలేకపోయారంటే మీకెందుకండీ ఈ రాతలూకోతలూ! మీ పేపరుండి లాభమేంటి? షేమ్ షేమ్!" అంటూ, బాలన్న ఎవరు? ఏమిటని అడిగే లోపే లైన్‌కట్ అయ్యింది.

"జర్నలిస్టులేమైనా చెత్తకుండీ ఎత్తుతారా? వాసన రాకుండా చూసే పూచీ మాదేనా?" అని ఎదురు తిట్టాలనుకున్నప్పటికీ లైన్ కట్ అయ్యి అలా తిట్టే ఛాన్స్ పోయినందుకు బాలన్నకు పీకల్దాకా కోపమొచ్చింది.

ఆ కోపంతోనే లోపలిగదిలోకి వెళ్ళాడతను. ఆలోగా మళ్ళీ ఫోన్ శబ్దం.

'హలో!' అనడానికి ముందే మళ్ళీ యిందా కటిలాగే తిట్లు.

బాలన్నకు ఏం చేయాలో తోచలా. పూర్తిగా విన్పించుకోకుండానే ఫోన్ పెట్టేశాడు.

మరుక్షణంలో మళ్ళీ ఫోన్. మరో వ్యక్తి తిట్లు.

బాలన్నకు ఇది కొత్త అనుభవం.

ఈ దుర్వాసన వెనక ఏదో గూడుపుఠాణి వున్నట్టు అర్ధమై అతనికే తెలీని ఓరకమైన భయం మొదలయింది.

ఈ వాసనకు నేనే ఎందుకు బాధ్యుణ్ణి? అందరి ఫోన్లూ తనకే వస్తున్నాయి. తనేనా ఈ వీధిలో ప్రముఖ వ్యక్తి?

ప్రముఖుణ్ని కాబట్టే కదా వాళ్ళంతా అడు గుతున్నారనే సంతృప్తి మళ్ళీ.

అందుకనే ఏదో ఒకటి చేసి దీనిక్కారణం కనుక్కోవాలన్న పట్టుదల అతనిలో ఏర్ప డింది.

బాలన్న బయటకు బయల్దేరాడు. అంతలో మళ్ళీ ఫోన్ పిలుపు. దాని దగ్గరకెళ్ళాడు. ఎత్తనా వద్దా అని ఆలోచిస్తూ నించున్నాడు. తనను తిట్టే కాల్ అయితే టైం వృధా. మరి వేరే ఏదైనా అయితే?

ఛ, ఛ! ఎలాంటి ధర్మసంకటం,

బాలన్న భార్యని పిలుస్తూ "ఎవరు రింగ్ చేసినా ఎత్తకు. ఎందుకో ఈరోజు బాగోలేదు'' అన్నాడు.

"నా ఖర్మ! ఆకలి దంచేస్తోంది. ఈ వాసనలో వంట చెయ్యలేకపోతున్నాను. జర్నలిస్టులట జర్నలిస్టులు. మీవల్లి ఏ పనీ కాదు. అవునూ... ఇంతసేపైనా ఆ ఒక్క చెత్తకుండీని ఈ వీధిలోంచి తీయించడం సాధ్యంకాలేదా? ఈ వీధిలో మీసాలున్నోళ్ళు ఒక్కరూ లేరా?" అంది.

భార్య మాట విని బాలన్నకు సిగ్గు కలిగింది. తన భార్య అన్నమాటల్లో నిజముంది. మరి తనకు ఆ శక్తి లేదా? అని ప్రశ్నించుకుని ఉత్సాహంతో "చూడూ! మరో అరగంటలో అన్ని ఏర్పాట్లు చేసేస్తాను'' అంటూ లూనా ఎక్కి బయటపడ్డాడు.

దుర్వాసన వేసే రంగయ్య వీధి దాటి అంబేడ్కర్ వీధికి తిరిగేచోట వున్న కొట్టు ముందు లూనా ఆపి కొట్టు యజమానిని "మన ఏరియా హెల్త్ ఇన్స్‌పెక్టర్ యిల్లు మీకు తెలుసా?" అనడిగాడు.

"తెలుసు స్వామీ! రుద్రయ్యేకదా?"

"హాఁ! రుద్రయ్యో రుద్రస్వామియోగానీ హెల్త్ ఇన్స్‌పెక్టర్ ఇల్లు కావాలి చెప్పండి''

"చూడండి! ఈ వీధిలో తిన్నగా వెళ్ళి ఎడమకి తిరగండి. అక్కడో బాదంచెట్టు వగ్గర ఆర్.సి.సి. ఇల్లుంటుంది. దానికి ఎడమగా ఉన్న దారంట ముందుకి వెళ్ళగానే ఓ లైబ్రరీ తగుల్తుంది. దాని పక్కవీధిలోకి తిరిగితే ఓ పాలడిపో. ఆ డిపో వెనకాలే ఓ లాండ్రీ. ఆ లాండ్రీ కుడివేపు సందులో ఆరో ఇల్లు రుద్రయ్యగారిది!"

బాలన్నకు ఆ మాటలు గుర్తుంచుకోవడం కష్టమైంది. రాసుకున్నా చదువుతూ లూనా నడుపలేడు. దీనికి మార్గం ఒక్కటే. రిక్షావాలాని ఆశ్రయించడం అనుకుంటూ లూనాను కొట్టుపక్కన వుంచి "మీరు చెప్పింది నాకు అర్థంకావడంలా స్వామీ! నేను రిక్షాలోనే వెళ్తాను'' అన్నాడు.

"ఛ. ఛా! అంత కష్టం ఏముందీ? పేపర్‌వాళ్ళు మీరే ఇలా బెదిరితే ఇంకేం మిగుల్తుంది చెప్పండి?"

ఇతనికి తన పరిచయం ఎలా అయిందబ్బా అని బాలన్నకు ఆశ్చర్యం కలిగింది. "నేను జర్నలిస్టునని నీకెలా తెలుసు?" అన్నాడు ఆత్మీయంగా.

"మీ రిపోర్టులన్నీ చదువుతానుకదండీ! పైగా కిందటేడు మీకు రామయ్య అవార్డు వచ్చిందికదా! అప్పుడు ఫొటో చూశాను''

బాలన్నకు ఆనందంగా వుంది. "మరి నేను హెల్త్‌ఇన్స్‌పెక్టర్‌ని కలవాలికదా! ఎలా?" అనడిగాడు.

"రిక్షా వస్తోంది స్వామీ! నేనే ఏర్పాటు చేస్తాను. మీ లూనా ఇక్కడే వుంచండి. నేను చూస్తాను'' అంటూ రిక్షావాలాతో హెల్త్ ఇన్స్‌పెక్టర్ ఇల్లు ఆనవాలు చెప్పి బాలన్నను పంపించాడు.

బాలన్న రిక్షాలో కూచున్నాడు. అది సందులు గొందులు తిరిగి చివరికి గమ్యం చేరింది. బాలన్న అలాగే కూచుని "కాస్త తలుపులు తట్టవయ్యా! రుద్రయ్యగారు వున్నదీ లేందీ కనుక్కో'' అన్నాడు రిక్షావాలాతో.

"నేనెందుకు అడగాలండీ! మీరే కనుక్కోండి''

"నేనెవరో తెలుసా నీకు?" అంటూ బాలన్న తన ఐడెంటిటీ కార్డుకోసం జేబులో చెయ్యిపెట్టాడు.

రిక్షావాలా ఇతనెవరో పోలీస్ డిపార్టుమెంటు మనిషి అయివుంటాడు అని బెదిరి "ఫరవాలేదు సార్! నేనే పిలుస్తాను'' అంటూ రిక్షా దిగి మెల్లిగా ఇంటి తలుపులు తట్టాడు.

లోపల్నించి పళ్ళు తోముకుంటున్న బక్కపలుచని ఓ మనిషి నైట్‌డ్రెస్‌తోనే తలుపులు తీసి, "ఎవరు?" అన్నాడు.




రిక్షావాలా "సాబ్ పిలుస్తున్నారు" అన్నాడు.

అతనికి విషయం తెలీక వస్తున్నాను అని ముఖం గబగబా కడిగేసి తలుపులు పూర్తిగా తెరిచాడు. "లోపలికి రండి!" అంటూ బాలన్నను ఆహ్వానించాడు. అతను రిక్షాలోంచి దిగకుండానే "మీరే వున్నపళంగా బయల్దేరండి. అంతా దార్లో చెబుతాను" అన్నాడు.

ఆ వ్యక్తి గాబరా చెంది ఎక్కడికన్నాడు.

"రంగయ్య వీధికి! ఎన్నివారాలైంది మీరటురాక?" కోపంగా అన్నాడు.

"నాకూ రంగయ్యవీధికీ ఏం సంబంధమండీ? మీరెవరు? ఎందుకొచ్చారు? విషయమేంటి?" ఆందోళనపడ్డా బయటికి కనబరచకుండా జాగ్రత్తగా ప్రశ్నించాడు.

"హెల్త్ ఇన్స్పెక్టర్ మీరేకదూ?"

"అవును"

"మరి రంగయ్య వీధికి రానంటున్నారేం?"

"నా జ్యూరిషిడిక్షన్ అదికాదండి. అది స్వామిగాడిది. కామరాజనగర్ నా ఏరియా"

బాలన్న సిగ్గుపడ్డాడు. కాని ఆమాత్రానికి తిరిగి వెళ్ళిపోతే బాగోదనిపించింది. ఎలాగైనా ఈ దుర్వాసనకు పరిష్కారం కనిపెట్టాలికదా అనుకున్నాడు. అందుకని కొంత నిదానించి, "మీరు రుద్రయ్యగారా? సరే! స్వామిగారిల్లు ఎక్కడో చెప్పండి" అన్నాడు.

"అలా అనండి. కాని రంగయ్య వీధిలోని విశేషం ఏంటి?"

బాలన్న పూసగుచ్చినట్టు చెప్పేశాడు.

రుద్రయ్య బాలన్నతో "పబ్లిక్‌పనిమీద వచ్చారు. చాలా సంతోషం. ఓ కప్పు కాఫీ తాగి వెళ్ళండి సార్! కావాలన్నా మీలాంటివాళ్ళు మా ఇంటికి వస్తారా?" అన్నాడు.

బాలన్న అతని ఇంట్లోకి వెళ్ళాడు.

కాఫీ తాగుతూ "ఇలాంటి అనుభవం నాకు మొదటిది" అన్నాడు.

"ఈ బ్యూరోక్రసీలోనూ మీలాంటివాళ్ళు వుండడం అపురూపం" అన్నాడు రుద్రయ్య. తర్వాత అతనే "మీరు స్వామి దగ్గరికి వెళ్ళండి సార్! కాని ఒక్కమాట, ఈ దుర్వాసన అనేది మా హెల్త్‌డిపార్ట్‌మెంటుకి సంబంధించిందే! అయితే చెత్తకుండి వుంది చూడండి. అది పి.డబ్ల్యు.డి. శాఖకు చెందింది. అలా చెత్తకుండిని అక్కణ్ణించి తరలించే సమస్య బహుశ స్వామిచేతిలో లేదు" అన్నాడు.

బాలన్నకూ నిజమే అనిపించింది. మరి ఈమాత్రం సంగతి తనకెందుకు తట్టలేదనుకున్నాడు.

"అలాగయితే నన్ను నేరుగా పి.డబ్ల్యు.డి. ఆఫీస్‌కి వెళ్ళమంటారా?" అనడిగాడు బాలన్న.

"మీకు నేను చెప్పాలా సార్? మీరు జర్నలిస్టునంటున్నారు. మీ 'దినసుద్ది' పత్రిక అంటే రాష్ట్రంలో ప్రముఖ పత్రిక. అలాంటప్పుడు..."

"అఫ్‌కోర్స్! ఈ సర్కారు కానూన్లు ఎవరికి తెలుస్తాయి చెప్పండి?"

"అయితే ఓపని చేయండి. మీరు ఇక్కణ్నించి కాస్త ముందుకెళితే లీడింగ్ లాయర్ రామారావుగారుంటారు. వారి అడ్వైస్ తీసుకోండి. ఆయన ప్రభుత్వ చట్టాలన్నింటిని అవుపోశన పట్టినవారు. ఈ చెత్తకుండి విషయంలో సరైన సలహా యివ్వగల్గిన సమర్థులు"

బాలన్నకు ఏంచేయాలో తోచలేదు.

"స్వామిని కలిసి ఓ నిర్ణయానికి వస్తాను" అన్నాడతను రుద్రయ్యవద్ద స్వామి అడ్రస్ తీసుకుంటూ!

రిక్షావాలా ఆ అడ్రస్ చూస్తూ, "అక్కడికి రంగయ్య వీధిగుండానే వెళ్ళాలి" అన్నాడు.

బాలన్న "మనం ఎక్కణ్నించి బయల్దేరామో అక్కడికే పద!" అన్నాడు.

రిక్షా మళ్ళీ అదే దారంట సాగి కొట్టు ముందు ఆగింది.

బాలన్న రిక్షాలోంచి దిగడానికన్నా ముందే "హెల్త్ ఇన్స్‌పెక్టర్ కలిశారా సార్?" అన్నాడు కొట్టువాడు.

"కలిశాడు మహానుభావా! కాని నాక్కావాల్సింది అతను కాదు'' అన్నాడు బాలన్న కోపంగా.

విషయం అర్థంగాక దేబెమొహం వేసిన కొట్టు యజమాని "అతను చాలా మంచిమనిషి సార్! మీతో అతను అమర్యాదగా ప్రవర్తించాడంటే నమ్మలేను'' అన్నాడు.

బాలన్న విషయం వివరించాడు. "నాక్కావాల్సింది మా ఏరియా ఇన్స్‌పెక్టర్. అతనిల్లు తెలుసా నీకు?"

"స్వామిగురించి అడుగుతున్నారా? నాకు మళ్ళీ అడ్రస్ చెప్పాలంటే భయంగా వుంది. మీరెక్కడ ఇబ్బంది పడతారో అని..."

"కానివ్వండి... నేను చెప్పింది పూర్తిగా అర్థంచేసుకోక అప్పుడలా చెప్పారు. తప్పు నాదికూడాలెండి''

"అలాకాదు సార్! మీరు హెల్త్ ఇన్స్‌పెక్టర్ తెలుసా అని నన్నడిగారు. నేను రుద్రయ్యగారి గురించి అనుకున్నాను. అతనెప్పుడూ మా కొట్టుకే వస్తాడు. స్వామితో పరిచయం తక్కువ"

"మరి ఇప్పుడేం చేద్దాం?" బాలన్నే ప్రశ్నించాడు.

"రిక్షావాలాకి కిరాయి ఇచ్చి పంపించండి. ఇక్కడే పక్కనే మా ఇల్లుంది. మాకు కాలేజికెళ్ళే కుర్రాడున్నాడు. ఈరోజు వాడికి సెలవుకదా! వాణ్ణిక్కడ కూచోబెట్టి, నేను మీతో వస్తాను''

వీళ్ళిద్దరి సంభాషణ వింటూ రిక్షావాలా కుతూహలంగా నించునిపోయాడు. బాలన్న బాడుగ యిచ్చేసి కొట్టు యజమానితో "నువ్వు వెళ్ళిరా! అందాకా నేను ఎదురుచూస్తాను. అన్నట్టు... ఓ బ్రిస్టల్ ఇవ్వు. ఓ దమ్ము లాగొచ్చు'' అన్నాడు.

కొట్టు యజమాని సిగరేటు ఇచ్చి బాలన్న అందించిన డబ్బులు స్వీకరించక, "ఒక్క నిముషంలో వస్తాను'' అంటూ కొట్టు చూస్తూండమని వెళ్ళాడు.

బాలన్న పొగ పీల్చుతూ, 'ఎలాంటి గ్రహచారమిది? నిన్నటిరోజు బెంగుళూరు వెళ్ళాల్సింది. వద్దని వాయిదావేశాను. వెళ్ళివుంటే ఈ కష్టాలన్నీ తప్పివుండేవి!' అనుకుంటూ చేతులు పిసుక్కున్నాడు.

మరో ఐదునిముషాల్లో కొట్టు యజమాని తన కొడుకుతో వచ్చాడు. "నేను రెడీసార్! వెళ్దామా?" అన్నాడు ఆలోచిస్తూ అలా నించుని వుండిపోయిన బాలన్నని చూసి.

"ఓ, వెళ్దాం! సరేగానీ, నీకు వీళ్ళందరి యిళ్ళు ఎలా తెలుసు?"

"అందులో విశేషమేముందిలెండి! మా కులంవాళ్ళం కొంతమందిమి ఇక్కడ ఓ సంఘం పెట్టుకున్నాం. వీళ్ళిద్దరూ మా కులంవాళ్ళే! నేను సంఘానికి జాయింట్ సెక్రెటరీని. వీళ్ళు మెంబర్లు. అలా పరిచయం మాకు. పైగా ఈ కొట్లు, హొటళ్ళ వ్యాపారం చేసేవాళ్ళకి సాధారణంగా ఈ హెల్త్ డిపార్టుమెంటు, సేల్స్‌టాక్స్... ఇలాంటి శాఖలతో పరిచయాలుంటాయి''

బాలన్న అతని మాటలకు నవ్వాడు. ఈ మనిషి తమాషాగా మాట్లాడతాడే అనుకున్నాడు. "సరే! ఇక స్వామి ఇంటికి వెళ్దామా?" అంటూ బాలన్న లూనా స్టార్టుచేసి, అతన్ని వెనుక కూచోమన్నాడు.



లూనా బయల్దేరిన తక్షణం బాలన్నకు

శివయ్యని పరామర్శించి వెళితేపోలా అని పించింది. కాని నర్సింగ్‌హోమ్‌వైపు వెళితే అక్కడో అరగంట పడుతుంది. ఆలోగా ఈ హెల్త్ ఇన్స్‌పెక్టర్ ఇంటినుంచి బయటకెళ్తే మళ్ళీ దొరకడం కష్టం అనుకున్నాడు. కొట్టిత ను భీమయ్య "లెఫ్టికి తిప్పండి లెఫ్టికి'' అంటున్నా బాలన్న, "ఆగవయ్యా! ఓ నిముషం ఆగు'' అన్నాడు ఆలోచనల్లోంచి తేరుకోలేక.

"లెఫ్టికి వెళ్తే మన రంగయ్య వీధి వస్తుంది కదా?" అన్నాడు బాలన్న.

"ఔనుసార్!"

"అక్కడికే వెళితే మళ్ళీ ఆ వాసనను తట్టుకోవడం ఎలా మహానుభావా?"

"మరేంచేయగలం? ప్రపంచమన్నాక ఇవ న్నీ వుంటాయి. వాసన కూడా ఓ కులంలాంటి దే? వదుల్చుకోగలమా? కళ్ళు, ముక్కు మూ సుకుని నడిపించండి!"

బాలన్న వేగం కొంత పెంచి, "జోరుగా మాట్లాడుతున్నావే!" అన్నాడు.

భీమయ్య లోపల్లోపల సంతోషించాడు. అయితే వాసన భీమయ్య ముక్కుమీద దాడి చేయనారంభించింది. ఎడమచేత్తో ముక్కు ఒత్తి పట్టుకున్న బాలన్న, "కావాలంటే నువ్వూ ముక్కు మూసుకో ఇలా!" అంటూ క్షణాల్లో రంగయ్య వీధిగుండా లూనాను పరుగులు తీయించాడు.

అలా వెళ్తూ చుట్టుపక్కల ఇళ్ళవంక కళ్ళు తిప్పాడు. ఏ యింటి తలుపులూ తెరిచిలేవు. కిటికీలుసైతం మూసున్నాయి. కాకుల గోల అలాగేవుంది. వెంకటేశ్‌మాత్రం కొట్టు తలుపు లు సగం తెరిచి ఓచేత అగరొత్తిని వెలిగించి ఎవరైనా వస్తున్నారా అని కొంగజపం చేస్తున్నా డు.

రంగయ్య వీధిని లంఘించి లూనా కుడికి తిరగ్గానే స్వచ్ఛమైన గాలి దొరికింది. "ఏం వాసనండీ యిది? అద్భుతం, అద్భుతం!! ఇలాంటి వాసన నేనెప్పుడూ చూళ్ళేదు'' అన్నాడు భీమయ్య.

"వాసనలో అద్భుతం ఎక్కణ్నించి వచ్చింది మహానుభావా? పైగా వాసనను చూడగలమా?" బాలన్న కావాలనే భీమన్నను ఆటపట్టించాడు.

కొంచెం వెళ్ళాక "ఇంకెంతదూరం స్వామి ఇంటికి?" అనడిగాడు.

"ఓ కిలోమీటర్ పోతే చాలు. ఆ నాల్గంత స్తుల బిల్డింగ్ కన్పిస్తోంది చూడండి... అక్కడే ఎడమ సందులో"

చివరికి భీమయ్య చెప్పినచోట బాలన్న లూనా ఆపి, "నువ్వే వెళ్ళి కనుక్కో!" అన్నా డు.

"కలిసి వెళదాం పదండి'' అంటూ బాలన్న ను ఒప్పించి మెల్లిగా తలుపు తట్టాడు.

ఓ నిముషం తర్వాత పెద్దబొజ్జతో రిటైర వ్వడానికి సిద్ధంగా వున్న ఓ వ్యక్తి తలుపుతీశా డు. "ఓ! భీమయ్యా! ఏంటి మీ దర్శనం ఇటువైపు?" అంటూ గుమ్మంలోనే అడ్డంగా నుంచుని పలకరించాడు.

"వీరికి మీతో అర్జంటుగా మాట్లాడాల్సిన పనుందట! ఇల్లు తెలీదని నేను తీసుకొచ్చా''

"నేనిప్పుడు లీవులో వున్నాను. డ్యూటీ విషయం ఇప్పుడు మాట్లాడే తీరిక నాకులేదు''

"అలాకాదు స్వామీ! విషయం ఏంటంటే..." అని భీమయ్య మాట్లాడబో యేంతలో, "పొద్దుటి టిఫిన్ కూడా కాలా. ఎక్కణ్నించి దాపురించారబ్బా వీళ్ళు?" అని స్వామి గొణుక్కుంటూ తలుపులు బడాలున మూసేశాడు.

. "ఓహోయ్! ఏమయ్యోయ్!" అటూ బాల న్న వద్దంటున్నా రెండుసార్లు తలుపులు తట్టా డు భీమయ్య. తలుపులు తెరుచుకునే పరిస్థితే కన్పించలా. అందుకు బదులు కిటికీలో కన్పించిన ఓ ఆడ తలకాయ "వారి వంట్లో బాగోలేదు. ఎందుకిలా తిప్పలు పెడుతున్నా రు?" అంది.

బాలన్నలో అవమానం, కోపం, ఆత్రుత ఒక్కసారిగా ముప్పిరిగొన్నాయి. ఈ మనిషి సాయంచేయకున్నామానె, కనీసం వచ్చిందెవ రని అయినా కనుక్కోరాదూ! మరి ఇప్పుడు రంగయ్య వీధి వాసనకి ఏమిటి పరిష్కారం? ఏదో ఒకటి చేయాలి. అలా పరిష్కరించాక ఈ తలపొగరు అధికారులకి గర్వభంగం కల్గించా లనుకుంటూ "రా భీమయ్యా! ఇదంతా మా మూలే!" అని మళ్ళీ లూనా స్టార్టుచేశాడు.

"ఛ, ఛా! స్వామి ఇలాంటివాడు కాదండీ! ఇవాళేదో అయిందతనికి. ఆరోగ్యం చెడిపో యిందనేది నిజమే!" అని తనకుతనే చెప్పు కుంటూ లూనా ఎక్కిన భీమయ్యకి మళ్ళీ రంగయ్యవీధి గుర్తుకొచ్చి, "మరిప్పుడు ఏంచే ద్దాం?" అనడిగాడు.

బాలన్నకూ ఎటూ పాలుపోలేదు. నేరుగా పురపాలక సంఘ కార్యాలయానికి వెళదా మంటే అక్కడింకా తలుపులే తీయరు. పురపా లక సంఘ ముఖ్యాధికారి ఇంటికి వెళితే అక్కడా ఇలాంటి అనుభవమే ఎదురైతే ఎలా? సి.ఎమ్. మాత్రం పదహారణాల పక్కా రాజకీ యవాదిలా ప్రవర్తిస్తున్నాడు. రంగయ్యవీధి జనాల్లో ఎవరికి దీనిగురించి బెంగలేదు. ఎవరో ఒకరు దీనికి పరిష్కారం కనుక్కుంటా రనే ధీమా వాళ్ళది. శివన్నమాత్రం తనలా ఎంతో ఆసక్తి చూపించాడుగానీ పాపం ఆసుప త్రిలో వున్నాడు. ఇప్పుడు తను ఏకాకి.

రంగయ్య వీధివీధంతా లేచివచ్చి తన భుజాలమీద వాలినంత భారంగా వున్నట్టు తోచి లూనా నడుపుతోన్న బాలన్న ఎదురు గుండా వాహనాలు రాగానే కొంచెం తికమకప డ్డాడు. భీమయ్య, కాస్త కేర్‌ఫుల్‌గా నడపండి సార్! ఈరోజేం బాగున్నట్లు లేదు. అమావాస్య కావచ్చు. ఇంక ఆక్సిడెంటవుతే దేవుడేగతి. తండ్రీ! నువ్వే కాపాడు'' అన్నాడు కాస్త గట్టిగా.

బాలన్నకు ఏడవాలో నవ్వాలో అర్థంకాలే దు. రంగయ్య విధికి కాస్త ముందె లూనా ఆపి భీమయ్యతో చూడయ్యా! నేనిప్పుడు వకీలు ను కలుసుకోవాలి. ఈ మున్సిపాలిటీని, ఈ హెల్త్ ఇన్స్పెక్టర్‌ని మూడుచెరువుల నీళ్ళు తాగించకపోతే నేను బాలన్ననే కాదు. దయ చేసి నువ్వు ఇక్కడ దిగిపోతావా?" అన్నాడు.

భీమయ్యకు భయంవేసింది. బాలన్నపట్ల అతనికి ఎక్కడలేని గౌరవం. ఇతను అను కుంటే స్వామి ఉద్యోగం పోతుందన్న అను మానం కలిగింది. ఉన్నపళాన వెళ్ళి, "బాలన్న కోపంగా వున్నాడు. నువ్వు క్షమాపణ కోరడం మంచిది'' అని స్వామితో చెప్పితీరాలని పించింది.

"సరే సార్! మీ ఇష్టప్రకారం వెళ్ళండి. నేను వాపస్ వెళ్తాను'' అన్నాడు వినయం వుట్టిపడు తోంటే.

నిన్ను మీ కొట్టుదాకా తీసుకుపోవాల్సింది భీమయ్యా! కాని మా వీధిగురించి తిరిగి తిరిగి అలిసిపోయాను. ఈ దుర్వాసనకు ఓ పరిష్కారం చెయ్యకుండా నేను మా వీధిలో అడుగుపెట్టగూడదని నిర్ణయించుకున్నాను'' అన్నాడు బాలన్న స్థిరచిత్తంతో.

తర్వాత లూనా స్టార్టుచేశాడు బాలన్న.



పోలీస్ కానిస్టేబుల్స్ రంగయ్య, రామయ్యలి ద్దరికీ ఎన్నడూ స్టేషన్‌కు తొమ్మిదిగంటలు దాటితేగానీ రాని ఎస్.ఐ. రామస్వామి ఎనిమి దింటికే వచ్చేసరికి ఆశ్చర్యమేసింది

"మీరిద్దరూ రంగయ్య వీధికి వెళ్ళండి. డాక్టర్ శ్రీవాత్సవ అని అక్కడ ఓ సైంటిస్ట్ వున్నారు. వారి ఇంటిముందు మీరు ఫుల్ ప్రొటెక్షన్ యివ్వాలి. ఫర్దర్ ఆర్డర్స్ ఏమిటో సాయంకాలం చెబుతాను'' అన్నప్పుడు వారికి ఆశ్చర్యం కలుగలేదు. రామస్వామి ఆర్డర్లకి ముందు సూచనలేవీ వుండవని వాళ్ళకు బాగా తెలుసు. ఎందుకీ డిపార్టుమెంటుకొచ్చామ్రా అని ఎన్నోసార్లు తమలోతామే గొణుక్కోవడ మూ రివాజే. ఎంతోమంది ఎస్.ఐ.లకింద పనిచేసిన అనుభవం వాళ్ళది. తమను మను షులుగా లెక్కవేయని అధికారులే జాస్తి. కాని ఈ రామస్వామిమాత్రం అలాంటివాడు కాదు. ఎంతో స్టాండర్డు మనిషని వచ్చిన ఆరునెలల్లో నే తెలిసిపోయింది. సమర్థుడూ, బుద్ధిమంతు డూను. లంచం తీసుకోవటం తప్పని చెపు తుంటాడు. పనిలో చేరిన ప్రారంభదినాల్లో లంచం తీసుకోడానికి సంకోచించిన ఈ హె.సీ.లు యిద్దరూ ఇప్పుడు మంచినీళ్ళప్రా యంగా బల్లకింద చేతులుంచుతున్నారు. రా మస్వామిని ఎంత తరచి తరచి చూసినా లంచం పుచ్చుకున్న దాఖలాలు కన్పించలే దు. అందువల్ల ఇంతకుముందున్న అధికారు లు తిట్టిపోసినప్పుడుల్లా "వీడి అబ్బ గురించి మనకు తెలుసులే' అంటూ లోపల్లోపలే గొణు క్కునేవాళ్ళు ఈ ఇద్దరూను. కాని రామస్వామి విషయంలో అలా మాట్లాడలేరు. పైగా ఇలా డ్యూటీమీద బయటికి పంపిస్తున్నప్పుడు 'మా మూళ్ళు' తీసుకోవద్దని మందలించి, ఖర్చు లకు తనే ఐదో పదో యిస్తారు రామస్వామి.

ఈరోజూ అలాగే రామస్వామి రంగయ్యని పిలిచి, "రిక్షాలో వెళ్ళండి. దాని కిరాయి శ్రీవాత్సవగారి భార్య యిస్తారు. తిండీ తిప్ప లు ఆమే చూస్తారు. లేకుంటే హెటలుకి వెళ్ళండి!" అన్నారు ఇరవై నోటు ఒకటి ఇస్తూ.

"ఎస్ సర్!" అని సెల్యూటు కొట్టి రంగ య్య 'బయల్దేరదామా?' అంటూ రామయ్యను అడిగాడు.

"ఊ!" అని యిద్దరూ మళ్ళీ రామస్వామికి సెల్యూట్ కొట్టి బయల్దేరారు.

వీళ్ళు వెళ్ళిపోగానే రామస్వామి "ఇప్పుడే వస్తాను'' అంటూ హెడ్కానిస్టేబుల్కు చెప్పి బైక్ స్టార్టుచేశాడు.

రామస్వామి వెళ్ళిపోవడం గమనిస్తూ, "మన డిపార్టుమెంటులో అపురూపమైన మనిషి. కాని పాపం, చచ్చేదాకా ఈ పోస్టులో నే కుళ్ళిపోతారో ఏమిటో? ఇలాంటివాళ్ళకి ప్రమోషన్ ఎలా వస్తుంది?" అనుకున్నారు.

"ఈ సైంటిస్ట్ ఇల్లు ఎందుకు కాపాడాల్సివ చ్చింది?" అని రామయ్యకు కుతూహలంగా వుంది.

"ఎందుకై వుంటుంది?" అన్నాడు మిత్రు నితో.

"నాకూ అదేప్రశ్న. నక్సలైట్ల బెదిరింపు కావచ్చు'' అన్నాడు రంగయ్య లోపల్లోపల బెదురుతూనే.

"అదే నిజమైతే మనగతి దేవుడికే తెలి యాలి. మన పెళ్ళాంపిల్లలు బజారుపాలు కాకపోతేచాలు. నాకయితే రిటైరుమెంటుకి ఐదేళ్ళే బాకీ. నీకింకా పద్దెనిమిదేళ్ళు వున్నాయి. నేను స్వచ్ఛంద విరమణకి తయారే!" అన్నాడు రామయ్య.

రంగయ్యకు మరోదారి కన్పించక ఏమీ మాట్లాడలేదు.

"అంతా ప్రారబ్ధం ప్రకారం జరుగుతుందిలె ద్దూ! నా జాతకంలో ఎనభైఏళ్ళ ఆయుష్షు అనివుంది. అదొక్కటే నాకు ధైర్యం" అన్నాడు లోపల్లోపల భయంగా వున్నా బయటికి కన్పించనివ్వకుండా జాగ్రత్తపడి.

. రామయ్య "ఈ నక్సలైట్లముందు ఏ దేవుడై నా బలాదూర్. ఇంక నీ జాతకం ఎక్కడ ఆపుతుంది?" అంటూ బెదిరించాడు.

రంగయ్యకు నిజంగానే బెదురుగా వుంది. "నేనిప్పుడు లీవ్ పెడితే ఎలావుంటుంది? అన్నట్టు ఉన్నట్టుండి కడుపులో నొప్పి వస్తోంది కూడా'' అన్నాడు.

రామయ్యను ఈ మాటలు ఇరకాటంలో పడేశాయి. నిజంగానే లీవ్ అప్లై చేస్తే తను ఒంటరివాడవాలని భయం పట్టుకుంది. అందుకని "భయపడకు. మొదట నేనే ఎదుర్కొంటాను. ఆ తర్వాత నువ్వు సాయపడితేచాలు. ఇంక భయపడితే మనశాఖకే అవమానం" అన్నాడు రామయ్య.

వీళ్ళిలా మాట్లాడుకుంటూండగానే ఓ రిక్షా వచ్చింది. రామయ్య తన చేతిలో వున్న లాఠీ వూపుతూ దాన్ని ఆపాడు.

రిక్షావాలా బెదిరిపోతూ ఉత్తపున్నేనికే వీళ్ళని తీసుకుపోవాలికదా! అనుకుని "ఎక్కడికి సార్?" అన్నాడు.

"రంగయ్యవీధికి'' అన్నాడు రామయ్య.

రిక్షావాలా "అది కొంచెం కష్టమైన పనిసార్! పొద్దుట్నించి ఆ వీధికి ఎవ్వరూ వెళ్ళడంలేదు'' అన్నాడు సంకోచిస్తూనే.

"ఎందుకు? అక్కడేదైనా శవం పడుందా?" రంగయ్య ఠీవి ఒలకబోస్తూ అడిగాడు. అతని మనసులోపలేమో నక్సలైట్ల భయం వుండనేవుంది.

"కాదుసార్ కంపువాసన. ఎందుకో ఏమిటో తెలీదు''

"శవం కాకుండా వాసనెలా వస్తుంది? శవంలేదు అంటున్నావా? నీకు తలకాయ చెడిపోయుండాలి. మేం ఆ వీధి డ్యూటీకి బయల్దేరాం. నువ్వు అటువైపు రానంటే ఏమిటర్థం? మేం మనుషులంకామా?" అన్నాడు రామయ్య దర్జాగా.

రిక్షావాలా విధిలేక ఇద్దర్నీ కూచోబెట్టుకుని బయల్దేరాడు.

రంగయ్య వీధి కార్నర్‌కు రాగానే ఆ పోలీసులిద్దరికీ భయంకరమైన వాసన కొట్టింది.

"వామ్మో, వామ్మో!" అని ముక్కు గట్టిగా మూస్తూ, "నువ్వు చెప్పింది నిజమే తండ్రీ! ఏ గ్రహచారం తగిలిందో మాకివాళ?" అన్నాడు రామయ్య రిక్షావాలాతో.

"డ్యూటీ చెయ్యకపోతే ఉద్యోగం పోతుంది'' అన్నాడు రంగయ్య.

ఈ చర్చ వింటూ ముక్కుమూస్తూ తెరుస్తూ రిక్షావాలా రిక్షాలోవున్న అగరొత్తి ముట్టించి వాసన చూశాడు.

కానిస్టేబుళ్ళిద్దరూ "ఇక్కడ శ్రీవాత్సవగారి ఇల్లెక్కడయ్యా?" అన్నారు అగరొత్తి వాసనతో కొంత తేరుకుని.

తనకి తెలిసినప్పటికీ "తెలీదుసార్' అన్నాడు రిక్షావాలా ఆ వీధిలో రిక్షా నడపడానికి భయపడి.

"వెళ్ళవయ్యా నువ్వు. మేమే కనుక్కుంటాంలే' అన్నాడు రామయ్య అప్పుడే తలుపులు సగం తెరిచి తల బయటికి పెట్టిన ఓ కొట్టు యజమానిని చూసి.

"సరే సార్!" అంటూ, కిరాయిసైతం అడక్కుండా రిక్షాలోంచి ఈ శనిగాళ్ళు దిగితేచాలనుకున్న రిక్షావాలా కానిస్టేబుళ్ళు దిగడం తరువాయి రిక్షా స్టార్టుచేసి, బతికిపోయాను భగవాన్ అనుకుంటూ ముందుకి సాగాడు.

రిక్షాలో వచ్చి దిగిన పోలీసుల్ని చూసి వెంకటేశ్ కంగారుపడ్డాడు. అసలే ఈరోజు వ్యాపారం బాగోలేదన్న బేజారు. పైగా ఈ వాసనకు ఏ కారణమూ తెలీక, తెలిపేవాళ్ళు లేక, ఉన్న శివయ్య కూడా యాక్సిడెంట్‌పై ఆస్పత్రిలో అడ్మిటయ్యాడన్న కలవరం వెంకటేశ్‌ది. ఇప్పుడేమో పోలీసుల రంగప్రవేశం. అందులోనూ వాళ్ళు తన కొట్టువంకే వస్తున్నారని చిన్నగా వణికిపోయాడు. తలుపులు వేస్తే దొంగబేరం చేస్తున్నావంటారు. పూర్తిగా తీస్తే ఏం జరిగిపోతుందో అన్న భయం.

ఆలోపు అక్కడికొచ్చిన రామయ్యా, రంగయ్యలు వెంకటేశ్‌ని ఓమారు క్రూరంగా చూసి, "ఇంత వాసనలోనూ వ్యాపారం పిచ్చిపట్టుకుంది కదూ నీకు?" అన్నారు.

"ఏంచెయను స్వామీ? పొట్టతిప్పలు''

"అగరొత్తులున్నాయా నీదగ్గర?" అన్న రా





మయ్య ప్రశ్నకి అవునంటూ తలాడించాడు వెంకటేశ్.

"సిగరెట్లు?" ఇది రంగయ్య ప్రశ్న.

"ఉంటే ఓ డజన్ అగరొత్తులూ, రెండు పాకెట్ల విల్స్ ఇవ్వు" అన్నాడు రామయ్య.

వెంకటేశ్ కిక్కురుమనకుండా వాళ్ళడిగినవన్నీ యిచ్చి 'డబ్బులు?" అన్నాడు మెల్లిగా.

"తర్వాత యిస్తాం. ఇప్పుడు శ్రీవాత్సవగారిల్లు ఎక్కడో చెప్పు" అన్నాడు రంగయ్య.

"చూడండి స్వామీ, అదే! ఆ కార్నర్ ఇల్లు" అని వెంకటేశ్ చూపించాడు.

"ఈ వాసనలో సిగరెట్ తాగడం కష్టమే!" అనుకుంటూ ఇద్దరూ ఆ యింటివేపు గబగబా అడుగులు వేయసాగారు.

రంగయ్య శ్రీవాత్సవగారి ఇంటి గేటు దాటి లోనికొచ్చి, గేటు బయటే వుండిపోయిన రామయ్యను రమ్మని సైగచేస్తూ కాలింగ్‌బెల్ మీద వేలుంచాడు.

ఓ నిముషమయ్యాక ఓ లావుపాటి శరీరంగల స్త్రీ తలుపులు సగం తెరిచి "ఓ... మీరా? ఎస్.ఐ. రామస్వామిగారు పంపించారు కదూ?" అంది.

తలుపులు పూర్తిగా తీసి వాళ్ళిద్దర్నీ లోనికి ఆహ్వానించిందామె ఆ తర్వాత!

"సార్ లేరా మేడం?" అన్నాడు రంగయ్య.

"లేరు. నిన్న రాత్రి ఫ్లైటులో ఢిల్లీ వెళ్ళారు"

"ఓహో! అయితే మేం గేటుబయటే వుండి కాపలా కాస్తాం" అన్నాడు రామయ్య.

"సరే! దానికేం... ఒక్క నిముషం. కాఫీ తాగి వెళ్ళండి" అంటూ ఆమె వీళ్ళమాట కోసం ఎదురుచూడకుండా లోనికెళ్ళింది.

నించునేవుండిపోయిన ఇద్దరూ ఫేముకుర్చీల్లో కూర్చుని గోడకు వేలాడుతోన్న ఫొటోల వంక దృష్టి మరల్చారు. ప్రధానమంత్రితో, రాష్ట్రపతితో అవార్డుల్ని స్వీకరిస్తోన్న ఓ వ్యక్తి ఛాయాచిత్రాలు ద్వారానికి అటూ ఇటూ వేలాడుతున్నాయి. ద్వారంమీద బాపూజీ ఫొటో. దానిపక్కన సైంటిస్టు సారాభాయ్‌గారి ఫొటో.

రామయ్య మెల్లిగా రంగయ్యతో, "ఈ ఇంటి యజమాని గొప్ప సైంటిస్టు కావచ్చు. అందుకే నక్సలైట్ హిట్‌లిస్టులో వున్నట్టున్నారు" అన్నాడు.

"ష్! ఇక్కడ ఈ మాటలన్నీ మనకెందుకు? మనమేమిటో, మన డ్యూటీ ఏమిటో చూసుకోవాలి అంతే!" అన్నాడు రంగయ్య.

"అదిసరే! ఇంటిలోపల అంటే ఫరవాలేదు కాని ఈ వీధిలో ఈ గబ్బుని పీలుస్తూ ఇంటి యజమానిగారొచ్చేదాకా ప్రొటక్షన్ అంటే మనకు నూకలు చెల్లినట్లే!"

ఇద్దరూ ఇంటావిడ తెచ్చిచ్చిన వేడివేడి కాఫీ తాగినా ఎందుకో దిగులు దిగులుగా వుండి కాఫీ తాగినట్టే అన్పించలేదు. ఈ వాసనతో బతకడమెలా? ఎవరికి చెప్పుకోవడం? ఏమీ తోచక ఇంటావిడ మొహంచూశారు. ఆమె ఏం వూహించిందో ఏమిటో ఇలా అంది, "ఆయనగారు రావడానికి ఇంకా నాలుగురోజులు పడుతుంది. అన్నిరోజులూ నాకు ప్రొటెక్షన్ కావాలని మీ ఎస్.ఐ.కి మొరపెట్టుకున్నాను. ఓ.కే. అన్నారు. మీరు బయట కాపలా వుంటేచాలు. గేటుబయట కాదు. కారు షెడ్డులో వుండండి"

"అదిసరే మేడం! ఈ వీధిలో ఇంత చెడ్డవాసన ఏమిటీ, ఎన్నాళ్ళనుంచనీ మా ఆశ్చర్యం?"

ఆ ప్రశ్నకి మేడం మాలతి "నిన్న సాయంత్రందాకా ఏ వాసనా లేదు. ఈరోజు పొద్దుటే వున్నట్టుండి మొదలైంది" అంది.

"ఇందులో ఎవరి జోక్యమో వుండి వుండాలి" అన్నాడు రామయ్య.

"ఔను. నాకూ అదే డౌట్. మేం ఈ యింటికొచ్చి కేవలం పదిహేనురోజులైంది. అంతే! మా ఇంటికి ఎదురుగా అంటే గేటుకి బయట పి.డబ్ల్యు.డి.వాళ్ళ చెత్తకుండి వుంది. అందులో ఈ వీధివాళ్ళందరూ అవసరమైందీ అనవసరమైందీ అంతా తెచ్చివేసేవాళ్ళు. మా

వారు ఆస్తమా పేషంటు. దుమ్ము, ధూళి అంటే వారికి ఎలర్జీ. అంతేకాకుండా యింటి ముందు చెత్తకుండీ వుంటే మా యింటికి వచ్చేవాళ్ళందరికీ అసహ్యంగా వుంటుంది. అందుకే మున్సిపాలిటీకి అర్జీ పెట్టి ఇక్కణ్ణించి తరలించండి అన్నాం. నిన్న తరలిస్తామన్నారు అధికారులు. కాని పగటిపూట వద్దు. పబ్లిక్‌కు కోపం వస్తుంది అనుకుని వాళ్ళు రాత్రి చెత్త కుండీని ఎత్తేశారనిపిస్తోంది. ఆ కుండి ఇప్పుడు ఈ వీధిమధ్యవుంది. వాస్తవంగా వుండాల్సింది అక్కడే. కాని చూడండీ! ఆ చెత్త కుండీని ఈ మున్సిపాలిటీవాళ్ళు రాత్రి తరలించేటప్పుడు ఏదైనా కుళ్ళిన వాసన వచ్చేదాన్ని వేశారో లేక ఆ తర్వాత మరెవరన్నా వేశారో అంతుపట్టడంలేదు. కానీ చెత్తకుండీ తరలింపుకి కారణం మేమని ఈ జనానికి ఇవాళ కాకుంటే రేపైనా తెలిసిపోతుంది. మావారూ లేరు. జనం గొడవచేసి మా ఇంటికి ఎలాంటి నష్టం కల్గించకుండా వుండేందుకని ప్రొటెక్షన్ కోరాను''

ఆమె మాటలు విని పోలీసులిద్దరూ పరస్పరం చూసుకున్నారు.

"ఎలాంటివాళ్ళండి ఈ వీధిజనాలు?" అన్నాడు రామయ్య.

"డిపార్టుమెంటువాళ్ళ జోక్యమే వుండొచ్చు'' అనుమానం వెలిబుచ్చాడు రంగయ్య.

మాలతి లోనికెళ్ళి ఓ పచ్చనోటు తెచ్చిస్తూ రామయ్య వద్దన్నా, "ఇది లంచంకాదు. మీ కాఫీ, భోజనాల ఖర్చుకు'' అని వెళ్ళిపోయింది.

ఇద్దరూ ఇటు ఆనందంతోనూ, అటు వాసన భయంతోనూ బయటికి వెళుతూ "తలుపులు వేసుకోండి మేడం!" అన్నారు.

కొట్టు యజమాని వెంకటేశుకు మళ్ళీ పోలీసులు అటువైపుకు రావడం కనిపించి, మరలా ఏం అడుగుతారో అని కలవరమైంది. ఈ వాసనని భరిస్తూ వ్యాపారార్థం ఎదురుచూస్తూ కూచోవడం అసహ్యమనిపించింది. దీంతోపాటు ఈ పోలీసుల పీడ ఒకటి. మెల్లిగా కొట్టు తలుపులు వేసి వెళ్ళిపోవడమే నయమనుకున్నాడు. అసలు ఈ పోలీసులెందుకొచ్చారన్న ఆలోచనతో కొట్టుమిట్టాడుతున్నాడు. డా. శ్రీవాత్సవగారు ఇక్కడికొచ్చి ఇంకా ఓ నెలయినా కాలేదు. అతనేంటి అనే విషయమైనా తనకు తెలీదు. రిటైర్డైన ఓ ప్రసిద్ధ శాస్త్రవేత్తని వాళ్ళూ వీళ్ళూ చెప్పగా తెల్సింది. వాళ్ళ ఇంట్లో అతను, అతని భార్య ఇద్దరే వుంటారు తప్ప కనీసం ఓ కుక్కని కూడా సాకడంలేదు. వాళ్ళ తాలూకు బంధువులెవరూ ఇంతవరకూ వచ్చి వెళ్ళిందీ లేదు. మార్కెట్‌కు కావచ్చు శ్రీవాత్సవగారి మేడం అడపాదడపా స్వయంగా కారు నడుపుకుంటూ వెళ్ళడంమాత్రం వెంకటేశ్ కళ్ళారా చూశాడు. శ్రీవాత్సవగారినైతే చూసిన గుర్తేలేదు. వచ్చి ఇన్నిరోజులైనా అతను బయట కన్పించిందే లేదు. అతనేమిటో అతని పనేమిటో? అక్కడ కాన్ఫరెన్సు, ఇక్కడ సింపోజియం అంటూ అతను పరుగులుతీస్తారని ఎవరో చెప్పినట్టు గుర్తుంది. అతను ఈ వీధిలో నివసించడానికొచ్చాక ఈ వీధి ప్రతిష్ఠ పెరగనూలేదు, తగ్గనూలేదు. అతన్ని, అతని ఇంటినీ ఎవ్వరూ అంత సీరియస్‌గా లెక్కించనూలేదు. అతనికన్నముందు ఆ యింటిలో ఓ బ్యాంకు ఆఫీసర్ వుండేవాడు. అతను ఈ వీధంతటికీ తలలో నాలుకలా వుండేవాడు శ్రీవాత్సవగారు ముప్ఫై ఏళ్ళ కిందట కట్టించిన ఈ యింటిని ఇలా అద్దెకిచ్చారంట. రిటైరయ్యాక ఇల్లు తనకే కావాలి. సీతాపురంలాంటి ప్రశాంత వాతావరణం దేశంమొత్తంలో ఎక్కడా లేదని ఇక్కడకొచ్చి సొంతింటిలో వుంటున్నారనే వార్తని వెంకటేశ్ ఎవరినీ అడక్కుండానే గ్రహించాడు. కానిప్పుడు పోలీసులు వచ్చారంటే ఏదో రహస్యం వుండాలి. అతనికేమైనా బ్లాక్‌మార్కెట్‌తో సంబంధముందా? లేక నక్సలైట్లు అతన్ని కిడ్నాప్ చేశారా...? అని ఆలోచించి ఆలోచించి శ్రీవాత్సవగారిగురించి జాలిపడ్డాడు. ఏమైనా ఈ పోలీసులు ఎందుకొచ్చారో తెల్సుకోవాలనుకుంటూ తలుపులు వేశాడు.





"ఇప్పుడు నువ్వు కొట్టు మూసేస్తే పబ్లిక్‌కు యిబ్బందికాదా?" రామయ్య అడిగాడు.

వెంకటేశ్‌కి కోపమొచ్చింది. "చూడండి స్వామీ! మీకెలా జవాబు చెప్పాలో తెలీదు. వస్తూనే తలుపులు ఎందుకు తెరిచావని అడిగారప్పుడు, ఇప్పుడేమో ఎందుకు మూస్తున్నావనీ మీరేఅంటున్నారు. ఏం చెప్పను?" అన్నాడు.

రంగయ్యకు వెంకటేశ్ మీద జాలి కలిగింది "వదిలేసెయ్ రామయ్యా! మనకెలాగూ తప్పదు, అతనికీ తలనొప్పి దేనికి?" అని "సరే! మా బిల్లుఎంతో చెప్పు" అన్నాడు.

వెంకటేశ్ బతికిపోయాననుకున్నాడు. "ఈ పోలీసువాళ్లు మంచివాళ్లే అని మనసులోపలే ఆశ్చర్యపోయాడు. మళ్లీ కొట్టు తలుపులు తీసి ఓ అగరొత్తి తీసి అంటించి పోలీసులకిచ్చిన సామాన్ల మొత్తం లెక్కచేసి చెప్పాడు. డబ్బులు తీసుకుని తీసుకోండంటూ మళ్లీ రెండు సిగరెట్లు యిచ్చి అగ్గిపెట్టె అందించాడు. పోలీసులిద్దరూ సిగరెట్లు ముట్టించుకుంటూండగానే ఇదే సరైన సమయం అనుకుని వెంకటేశ్ మెల్లిగా రంగయ్యను "ఏంటిసార్? మీరిటు వైపు వచ్చారేంటి? మన సైంటిస్టుగారికేదైనా...?" అనడిగాడు.

"అతనికేమవుతుందిలెండి! అయింది మాకు. శవజాగరణలా ఈ వాసన సహిస్తూ వుండాలి మేం"

"అదిసరేకానీ ఉత్తుత్తిగానే రారుకదా మీరు?" అన్నాడు వెంకటేశ్ మెల్లిగా.

"శ్రీవాత్సవగారు చాలా గొప్పవారుకదా! వారింటిముందు ఈ చెత్తకుండివుంటే అలర్జీ అవుతుందని మున్సిపాల్టీకి అప్లికేషన్ పెట్టారట! వాళ్లు సరే అనక తప్పలేదు. కానీ పగటిపూట చెత్తకుండీని ఎత్తి వేరే దిక్కు పెడితే జనం గొడవచేస్తారని అధికారులు అర్ధరాత్రి దాటేక తరలించారట. ఆ తర్వాత ఏమైందో ఏమిటో మరి? విపరీతమైన వాసన! మీకిదంతా తెలీదా ఏం?"

రంగయ్య మాటలు విన్న వెంకటేశ్‌కు ఒక్కసారి డాక్టరేటు దొరికినంత పనైంది. ఈ చెత్తకుండి తరలింపు ఎలా జరిగిందన్న విషయం ఎవ్వరికీ తెలీదు. అలాంటప్పుడు అసలు సమాచారం ముందు తనకే దొరికిందనే ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు. శివయ్య వుంటే అతనికి చెప్పి వుండేవాడు. అతను ఈ వీధికంతటికీ కావాల్సిన మనిషి. అందరికీ అగరొత్తుల్లానే ఈ విషయాన్నీ సరఫరా చేసేవాడు. అతని తర్వాతి స్థానం ఈ వీధిలో తనదే! ఈ వీధివాళ్లందరికీ చెప్పాల్సిన కర్తవ్యం తనది. కానీ ఈ వాసన మధ్య యిల్లిల్లూ తిరిగి చెప్పడం ఎలా సాధ్యం? సి.ఎమ్‌కి చెప్పేస్తే చాలు. ఆ తర్వాతిదంతా అతనే చూసుకుంటాడనుకుంటూ అతను మరలా కొట్టు మూసి తాళం వేశాడు.

పోలీసులు తిరిగి డా. శ్రీవాత్సవగారింటి వైపు వెళ్లారు. వెంకటేశ్ వాళ్లు వెళ్లిపోవడం చూసి మనసులో సంతోషపడ్డాడు. సి.ఎమ్.కు చెప్పడమే సరైంది అనుకుంటూ బయల్దేరాడు. గబ్బుమని వాసనకొట్టింది. 'ఛట్! దీనితల్లి' అనుకుని కోపంతో శ్రీవాత్సవగారిని, పురపాలక సంఘాధికారుల్ని తిట్టుకుంటూ ముక్కుపుటాల్ని ఒత్తి పట్టుకుని సి.ఎమ్. యింటివేపు అడుగులేశాడు. చివరికి వాసన భరించలేక పరుగు లంకించుకున్నాడు. కాని పరుగెత్తేటప్పుడు ఊపిరి చాలక దమ్ము ఆగినట్టనిపించింది. పైగా ముక్కుని ఓ చేత్తో గట్టిగా మూసుకుని పరుగెత్తడం చాలా కష్టమైందన్న అనుభవం ఎదురైంది. అయినప్పటికీ ఎలాగైనా ఈ వీధిలోంచి ఈ కంపు వాసన పోవాలన్న అభీష్టంతో, చెత్తకుండి తరలింపు వెనక వున్న కారణపురుషుల విషయం సి.ఎమ్.కి తెలపాలన్న తలంపుతో పరుగులు తీస్తూనే వున్నాడు.

ఇటు రంగయ్య, రామయ్యలిద్దరూ ముక్కులు గట్టిగా మూసుకుని శ్రీవాత్సవగారి యింటిగేటు తెరుస్తుండగా, కొట్టు యజమాని వెంకటేశ్ దౌడు తీయడం కనిపించింది. ఉన్నట్టుండి ఆ యిద్దరి పోలీసు మెదళ్లు జాగరితమ

య్యాయి. రామయ్య రంగయ్యతో "చూడు! అతను ఎలా పరుగెత్తుతున్నాడో, ఈ వాసనలో ఇతని హస్తమూ వుంది. పట్టుకుని స్టేషన్‌కు తీసుకెళ్లడం మంచిది. అంతేకాక ఈ వాసనలో మనం ఎలా డ్యూటీ చెయ్యడమో ఎస్.ఐ.గారితో తేల్చుకుందాం" అన్నాడు.

రంగయ్యకు రామయ్య వాదంలో అర్థముందనిపించింది. కాని ఇక్కడ మనం డ్యూటీ చెయ్యలేమని ఖండితంగా ఎలా చెప్పగలం? రామయ్య కుండబద్దలు కొట్టినట్లు చెప్పలేదు. తను చెప్పాలన్నది అతని ఆలోచనై వుంటుంది అనుకుని "నువ్వు చెప్పుతున్నది నిజమే రామయ్యా! కానీ ఎస్.ఐ.గారి ముందు డ్యూటీ చెయ్యలేమని ఎలా అనగలం?" అన్నాడు.

"నువ్వొహడివి... ఇలాంటి ఎస్.ఐ.ల్ని ఎంతమందిని చూశాన్నేను" అంటూ మీసాలు మెలివేసి వెంకటేశ్‌ని కాలరు పట్టుకొని తెచ్చేందుకు బయల్దేరాడు.

వెంకటేశ్ సియం గారింటి కాలింగ్‌బెల్లు నొక్కాడు.

సి.ఎమ్. తన మిత్రులతో ఈ వీధిలో అసలేమీ కానట్టుగానే రాబోయే ఎన్నికల్లో తను ఎం.ఎల్.ఏ.గా పోటీ చేసే విషయం చర్చిస్తున్నాడు. ఇంకో ఆరు నెలల్లో ఎన్నికలున్నాయి. తనకు టిక్కెట్టు అధికారపార్టీ నుండి లభించడం ఖాయం. ఎన్నికల వ్యూహం ఎలా వుండాలి? అన్నదే ఆ చర్చాంశం.

కాలింగ్‌బెల్లు చప్పుడు అక్కడున్నవాళ్లందరినీ క్షణంపాటు అసహనంలో ముంచింది. పానకంలో పుడకలా వీడెవడ్రా? అనుకుంటూ సి.ఎమ్. ఆప్తమిత్రుడొకడు తలుపులు తీసేసరికి కొట్టుయజమాని వెంకటేశ్ కనిపించాడు.

"స్వామీ! మలియప్పగారూ! ఈ వాసనక్కారణం నేను కనుక్కోగలిగాను" అంటూ యక్షగానంలోని హాస్యగాడిలా రెండు చేతులు జోడించి లోనికొచ్చాడు.

విషయం తెలీక తలుపులు తీసివుంటంతో లోనికి తోసుకొచ్చిన వాసనకు కష్టంగా వూపిరి తీస్తూ తలుపు వేయమని ఆజ్ఞాపించాడ సి.ఎమ్.

"ఏం కనుక్కోగలిగావ్? కాస్త వివరంగా చెప్పు" అన్నాడు సి.ఎమ్. చిరుకోపంతో.

వెంకటేశ్ నించునే పోలీసులు చెప్పిన వార్త అప్పగించాడు. అంతా విన్న సి.ఎమ్. "ఇంతేనా? ఇందులో విశేషమేముంది? చెత్తకుండి తరలింపు ఎవరైనా చేయించనీ, అది తర్వాతి సమస్య. ఇప్పుడందులో ఏముందో తెలియాలి కదా? వెళ్లి చూడగల్గితే చూడు. అప్పుడు నీకు సర్టిఫికేటు దొరుకుతుంది" అంటూ సి.ఎమ్. వెంకటేశ్ గాలి తీసేశాడు.

తన వుత్సాహాన్ని నీరుగార్చిన సి.ఎమ్.తో వెంకటేశ్ వస్తానని కూడా చెప్పక బయటికి వెళ్లేందుకు తలుపులవద్దకు చేరాడు.

అక్కడ అప్పటికే హాజరైన పోలీసులిద్దరూ "ఎక్కడికి వురుకుతావు నా కొడకా? నడువ్ స్టేషన్‌కి" అంటూ వెంకటేశ్ కాలరు పట్టుకుని ఆపారు.

ఏమీ అంతుపట్టని వెంకటేశ్ "ఓ, మునియప్పన్నా! ఊరికినే నన్ను స్టేషన్‌కి లాక్కుపోవడం చూస్తున్నారా?" అంటూ కాళ్లావేళ్లా పడ్డాడు.

విషయం తెలీని సి.ఎమ్. పోలీసుల్ని సంగతేమిటని అడిగాడు.

వాళ్లు ఇతను పరుగెత్తుకొచ్చిన విషయం చెప్పి "ఈ వాసన లేపిందే ఇతగాడని మా అనుమానం. ఇతణ్ణి స్టేషన్‌కి తీసికెళ్లి రెండు అంటిస్తే అన్నీ చెబుతాడు" అన్నాడు సి.ఎమ్.తో.

వెంకటేశ్ పోలీసులకి రెండు చేతులూ జోడించి నమస్కరించి "నేను నిర్దోషిని స్వామీ! దేవుడిమీద ఒట్టు నాకూ ఈ వాసనకూ సంబంధమే లేదు. కావాలంటే మా మునియప్పన్ననే అడగండి" అన్నాడు.

సి.ఎమ్.కి వెంకటేశ్ పట్ల జాలి కల్గింది.




"వదలండయ్యా అతణ్ణి, అతనలాంటివా డుకాదు. కావాలంటే నేను రాసిస్తాను. మీ ఎస్.ఐ.సాబ్ నాకు తెలుసు. నాకు చీఫ్ మినిస్ట రుదాకా అందరూ తెలుసు. నేనెవరో మీకే తెలీదు. వెళ్లి మీ డ్యూటీ చేయండి'' అన్నాడు హుందాగా.

పోలీసులిద్దరూ కొంచెం మెత్తబడ్డారు. ఈ సి.ఎమ్. గొప్పవాడెవడో అయి వుంటాడను కుని వెంకటేశ్‌ను వదిలేశారు. తర్వాత అటె న్షన్ పొజిషన్‌లో నించుని సెల్యూట్ కొట్టి సి.ఎమ్.తో "సరే సార్! మీరు చెప్పారు కాబట్టి వదిలేస్తున్నాం. వస్తాం" అంటూ వీధిలోకొచ్చా రు.

"ఎంత దరిద్రపు రోజివాళ" అన్నాడు రామ య్య దార్లో.

'ఔను ఇవాళ డ్యూటీ ముగిసేలోపు ఎన్నె న్ని సంఘటనలు జరుగుతాయో ఏమిటో?" అన్నాడు రంగయ్య వాసన తట్టుకోలేక వుమ్మే స్తూ.

ఇద్దరూ వాసన పీలుస్తూ తమనుతామే తిట్టుకుంటూ నడవసాగారు. కాకులగోల తారా స్థాయికి చేరడంతో వాళ్లిద్దరూ మాట్లాడుకుంటు న్న మాటలు వాళ్లకే వినరావడంలేదు. కాకుల్లా గే వాళ్లూ గట్టిగా అరుస్తూ మళ్లీ శ్రీవాత్సవగారి యింటి గేటు తెరిచి లోపలికొచ్చారు. కారు షెడ్డులోకి శ్రీవాత్సవగారి పనిమనిషి తెచ్చివే సిన రెండు కుర్చీల్లో కూలబడి చేతుల్లోవున్న లాఠీలతో నేలను కొడుతూ పెళ్లాం పిల్లల్ని గుర్తు చేసుకోసాగారు.

కానీ రంగయ్య వీధిలోని వాసన వాళ్లని ఓ పట్టాన నిలవనివ్వడంలేదు కూచోనివ్వడమూ లేదు. మళ్లీ అగరొత్తులు అంటించి ఆ సువాసన కోసం వాళ్లు తమ ముక్కుల్ని వికసింపచేసుకో నారంభించారు.

★ ★ ★

బాలన్నకు విపరీతమైన కోపం వచ్చింది.

ఈ వ్యవస్థ ఎంత చెడిపోయింది, ఇందులో తనూ ఓ భాగమేకదా? అని మరుక్షణం తననుతానే శాంతింపచేసుకున్నాడు. తను పాత్రికేయుడై వుండీ ఈ హెల్త్ ఇన్స్‌పెక్టరనీ, ఇదీ అదీ అని ఉరుకులు పరుగులు పెట్టాల్సిన అవసరమేంటి? నేరుగా మాకు ప్రాతినిధ్యం వహించే మున్సిపల్ మెంబర్‌కు ఈ విషయం తెలిపివుంటే సరిపోయేది. అలా కాకుండా ఎందుకు జోక్యం చేసుకున్నానా అని కొంచెం సిగ్గుపడ్డాడు. ఇప్పటికైనా సమయం మించిపో లా అని కౌన్సిలర్ కొండయ్య యింటివైపు లూనాను పరుగులు తీయించాడు.

పది నిముషాల్లో కొండయ్య ఇల్లు వచ్చింది. ఇక తను వచ్చిన పని అయిపోయి నట్లే అన్న హుషారుతో లూనా ఆపి బాలన్న ఆ యింటి తలుపులు తట్టడమూ, అటు కొండ య్య కాలకృత్యాలు తీర్చుకుని బయటపడ్డాని కి తలుపులు తీయడమూ ఒకేసారి జరిగిపో యాయి.

ఇద్దరూ పరస్పరం నమస్కరించుకున్నాక బాలన్న "అర్జంటు పనిమీదొచ్చాను. మీరెక్క డికో బయల్దేరినట్టున్నారు'' అన్నాడు.

"ఔను బాలన్నగారూ! పార్టీ మీటింగుంది. అధ్యక్షుడి ఎన్నిక జరిగి ఓ సంవత్సరమైంది కదా! ఈ యేడు మార్పు కావాలంటున్నారు పార్టీలో మావాళ్లు. నాకూ అది నిజమే అన్పించింది''

—"మీరూ నించుంటున్నారా? మున్సిపాల్టీ అధ్యక్ష స్థానానికి?"

"ఔనండీ! ఎందుకు నించోగూడదు?"

"మా ప్రతినిధి అధ్యక్షులవుతే మా వీధి బాగుపడ్డట్టేకదా! చాలా సంతోషం కాని వ్వండి''

బాలన్న అభినందనలు కొండయ్యకు అవ సరమనిపించలేదు. కానీ బాలన్న కొండయ్య ను బయటకు వెళ్లకుండా వుండేలా ముఖస్తుతి చేసి ఎలాగోలా వుపయోగించుకోవాలని చూ స్తున్నాడు.

"ఇప్పటికే లేటైంది. వస్తాను. ఎలెక్షన్ గెలె క్షన్ అయ్యి సెలెక్షన్ అయ్యాక మిమ్మల్నంద ర్నీ పిలిచి డిన్నర్ యిస్తానండీ!" అంటూ

కొండయ్య బయటపడ్డాడు.

బాలన్న "ఆగండిస్వామీ! నేను పత్రికలో పనిచేసేవాణ్ణని మరిచిపోకండి'' అంటూ హెచ్చరించాడు.

కొండయ్య కొంచెం డీలాపడిపోతూ "మిమ్మల్ని మరిచిపోతే మేం జనాలతో ఎలాగండీ సంబంధాలు పెట్టుకునేది? ఇంపాసిబుల్ ఇంపాసిబుల్'' అని మళ్లీ వెనక్కి తిరిగి "ఇప్పుడు చెప్పండి మీకేం కావాలో? కే.జీ. స్కూల్లో సీటా లేక ఇంకేదైనానా'' అని ప్రశ్నించాడు.

పిల్లలేలేని తనను కావాలనే ఇలా అడిగాడని బాలన్నకు అన్పించింది.

"అదికాదు... ఇది మా వీధి విషయం" అంటూ రంగయ్య వీధివాసన గురించి సంక్షిప్తంగా చెప్పాడు.

కొండయ్యకు సమస్య అర్థమైంది. ఈ విషయంలో ఏదో ఓ పరిష్కారం కనుక్కోకపోతే రేపు తను అధ్యక్షుడిగా ఎంపికైనా ఈ బాలన్న దీన్నంతా ఓ పెద్ద వార్తచేసి తనకి కళంకాన్ని ఆపాదించేరకం. అలాగని పార్టీ మీటింగుకి వెళ్లకపోతే ఉపాధ్యక్షుడే రేపు అధ్య



క్షుడవుతాడు. "నువ్వే అధ్యక్షుడివి కావాలి కొండయ్యా! నీకు నా మద్దతుంది. ఉపాధ్యక్షుడు మాత్రం నా కుర్చీలో కూచోరాదు'' అని అధ్యక్షుడు వారం క్రితమే ఫోనులో చెప్పి, పార్టీ మీటింగ్‌లో ఎలాంటి వాదాల్ని ఎలా మొదలెట్టాలి, ఏ రకమైన వ్యూహాలు అవలంబించాలి అనేవన్నీ మాట్లాడారు.

కానీ ఇప్పుడు మీటింగ్‌కి వెళ్లినా వెళ్లకున్నా కష్టమే. ముందునుయ్యి వెనక గొయ్యి. ఈ విషయమంతా ఈ బాలన్నకి చెప్పేస్తే మళ్లీ పేపర్‌లో రాస్తాడు. కొండయ్యకు చిన్నగా చెమటలు పోశాయి. కళ్లు బైర్లు కమ్ముతున్నట్టు అన్పించింది.

"లోనికి రండి'' అంటూ బాలన్నని ఆహ్వానిస్తూనే కుర్చీ చూపించాడు. "బాలన్నగారూ! ఉన్నట్టుండి నా తల తిరుగుతోంది. ఏం చేయాలో తోచడంలేదు'' అంటూ తలమీది గాంధీ టోపిని తీసి పక్క టేబుల్ మీదుంచి "శాంతా!" అని భార్యని పిలిచాడు.

లోపల్నించి పలికిన, శాంత "మీరింకా వెళ్లనేలేదా?" అంటూ బయటికొచ్చి డల్‌గా కూలబడిపోయున్న భర్తని చూసి "నిన్న రాత్రంతా నిద్రపోలేదు. మీకెందుకు చెప్పండి ఈ రాజకీయాలు?" అంది గోముగా.

"డాక్టర్‌ని పిలుస్తాను'' అని ఆవిడ ఫోన్ కోసం బయల్దేరుతుంటే కొండయ్య క్షీణస్వరంతో వద్దన్నాడు.

బాలన్నకేమో ఇక్కడకెందుకొచ్చాన్రా అన్పించింది. ఇప్పుడితని పరిస్థితి చూడకుండా వెళ్లలేడు. వెళ్లకపోతే వీధివాసన విషయం ఎలా అన్న కంగారు.

కానీ బాలన్నతో కొండయ్య "మున్సిపాల్టీ ముఖ్యాధికారికి ఇక్కడినుంచే మీరు ఫోన్ చేసి చెప్పండి. ఇప్పటికిప్పుడే ఆ చెత్తకుండిని అక్కణ్ణించి లారీలో తీసుకుపొమ్మని అడగండి. అలాగే మా అధ్యక్షుడికీ నా ఆరోగ్యం బాగోలేదని ఓ మాట చెప్పండి'' అని "చూడూ! వాళ్ల ఫోన్ నంబర్లు బాలన్నగారికివ్వు'' అన్నాడు భార్యతో.

"ఈ అనారోగ్యంలోనూ మీ పనులు ఆపరు'' అని కోపగించుకుంటూ బాలన్నకు నంబర్లు యిచ్చిందామె.

"మీరు రెస్టు తీసుకోండి కొండయ్యగారూ! నావల్ల మీకిబ్బంది కల్గింది. వెరీసారీ! నేను మరోచోటునించి ఫోన్ చేస్తాను'' అన్నాడు బాలన్న.

"ఛఛా! నేనలా అనుకోను. ఇక్కణ్ణించే మాట్లాడండి. నేనూ చివరికి వారితో ఓ మాట చెబుతాను'' అన్నాడు కొండయ్య.

విధిలేక బాలన్న మొదట మున్సిపాల్టీ ముఖ్యాధికారికి ఫోన్ చేశాడు. "సరే చెత్త కుండిని తరలించేందుకు ఆటంకమేం లేదు. కానీ అందులోంచి అంత వాసన వస్తోందంటే ఏదో పడి చచ్చుండాలి. అఫ్‌కోర్సు అది ఏ అనాధశిశువో అయివుంటే ఆ రిస్కు ఎవరు తీసుకోటం? మీరు స్టేషన్‌కి వెళ్లి ఎస్.ఐ గారిని అడగండి. అతను ఓకే అంటే తక్షణం నేను మందిని పంపిస్తాను'' అన్నాడతను.

బాలన్న "ఆ చెత్తకుండిలో శిశువు శవం వుండొచ్చునంటారా?" అనడిగాడు.

"నేనేమైనా చూశానా! మీ పేపర్‌వాళ్లు మానోట చెప్పించాలని చాలా తెలివిగా వుంటారు. పరిస్థితి మీకు తెలుసు. ఇది ఆఫీస్‌లో కూచుని ఫోన్‌లో మాట్లాడే విషయం కాదుసార్. మీ పేపర్‌వాళ్లే చెత్తకుండిలో సజీవశిశువు అంటూ వార్తలు రాస్తే చదివాను. మీరు చెప్పేదాన్నిబట్టి చూస్తే అందులో డెడ్‌బాడీ ఎందుకుండకూడదని నా అనుమానం"

అతనితో ఎలా మాట్లాడాలో బాలన్నకు అయోమయంగా వుంది. ఏమీ తోచక తల గోక్కున్నాడు. ఎందరెందరో మహామహా రాజకీయవాదుల్ని పత్రికా గోష్ఠుల్లో తికమకపెట్టి మట్టికరిపింపచేసిన ప్రఖ్యాతిగల తనను ఓ అధికారి నోరు మూయించాడుకదా అని బిడియపడ్డాడు.

"ఇప్పుడేం చేయాలో సెలవివ్వండి!" అన్నాడు నిరాశగా.




"మీరు మీ ఏరియా పోలీస్ స్టేషన్‌కు వెళ్లి ఓ కంప్లెయింటు రాసివ్వండి సార్! వాళ్లొచ్చి ఓకే అని సిఫారసు చేస్తే మా పని సులభమవుతుంది''

"మీరే ఓ మాట పోలీసులకు చెప్పొచ్చుగదా?"

"మీకున్న దర్పం మాకెక్కడిది?"

ఎంత వెటకారంగా మాట్లాడుతున్నాడు బాలన్నకు చిరాగ్గా వుంది. ఫోన్ పెట్టేసి "సారీ! మీకు చాలా యిబ్బంది కల్గించాను'' అని కౌన్సిలర్‌కు చెప్పి సెలవు పుచ్చుకొని మళ్లీ వీధిలో పడ్డాడు బాలన్న. ఈసారి లూనా పోలీస్ స్టేషన్‌కేసి పరుగులు తీసింది.

ఎస్.ఐ.రామస్వామి బాలన్నని చూడ్డంతోటే "రండి, రండి, ఎన్నాళ్లకెన్నాళ్లకు?" అన్నాడు.

"రోజూ రావాలంటారా? మేమేమైనా దొంగలమా ఏం?" అంటూ ఎస్.ఐ. చూపించిన కుర్చీలో కూచున్నాడు.

"రెండు కాఫీలు అర్జంటు'' అని ఎస్.ఐ ఓ కానిస్టేబుల్‌తో చెప్పి సిగరెట్టు పాకెట్ అందిస్తూ "ఇంక చెప్పండి సార్! ఏం విశేషం?" అనడిగాడు.

బాలన్న సిగరెట్టు అంటించుకుని రంగయ్య వీధి విషయం చెప్పి దానికై తను పడ్డ పాట్లన్నీ వివరించాడు.

అంతలో కాఫీ వచ్చింది. కాఫీ తాగుతూ తల గోక్కుని రామస్వామి "చాలా ఇంట్రస్టింగ్ కేస్ సార్ ఇది! కానీ అంత సులభంగా దీని చిక్కుముడి విడేట్టు లేదు. బహుశా దీని వెనక ఎవరి హస్తమో వుండివుండాలి'' అన్నాడు.

"ఎవరిది మరి?" బాలప్ప ఆసక్తి వహించాడు.

"ఇంకెవరు? మన పొలిటీషియన్లే. వాళ్లున్నారంటే ఎవరికీ తెలీనంత నిగూఢంగా ఏమేం చేయాలో అన్నీ చేసి పారేస్తారు''

"అంటే...? అయినా మా వీధిలో రాజకీయం జరపాల్సినంత అవసరంలేదే?"

"మీకేం తెలుసు సార్? పేపర్ వాళ్లని జనం మీదగ్గరికి రారు. మీకూ తెలియని విషయాలు బోల్డు జరుగుతున్నాయి''

"అంటే మా వీధిలో ఏముందని?"

"అది నేనెలా చెప్పాలి? ఇన్వెస్టిగేషన్ చెయ్యకుండా నేను ఏ నిర్ణయానికి రాను''

"మరి ఇన్వెస్టిగేషన్ చెయ్యవచ్చుకదా!"

"చెయ్యవచ్చు. కానీ అదంత సులభం కాదు బాలన్నగారూ! నేనీ కేసులో ఇంట్రస్టు తీసుకున్నానంటే రేపు ఇక్కణ్ణించి బదిలీ అయ్యి నీళ్లులేని ఏ అడవుల్లోకో వెళ్లాల్సి వుంటుంది''

"అంటే ఈ వాసనతో ఇలాగే చావమంటున్నారా మీరు?"

"నేనెందుకంటాను స్వామీ! నాకూ ఈ వాసన సహించరానిదిగావుంది. కాని అది అలవాటైపోయింది. మా డిపార్టుమెంటును చూడండి, ఎవ్వరికీ ముక్కుల్లేవు. ఇంక మాకెక్కడుంటుంది వాసన చెప్పండి?"

ఇద్దరూ ఒకేసారి గొల్లుననవ్వారు. బాలన్న రామస్వామికి కితాబిస్తూ "కన్నడంలో ఎం.ఏ. చేసినమీరు ఎస్.ఐ కావడం సార్థకమైంది'' అన్నాడు.

"సార్థకమెక్కడ స్వామీ? వ్యర్థమైందనండి, ఈ డిపార్టుమెంటుకు భాషతో పనేలేదు. అసలు మా భాషే వేరు''

మళ్లీ ఇద్దరూ నవ్వారు. బాలన్న "తమాషా చాలు. ఇప్పుడు నేనేం చేయాలో చెప్పండి'' అన్నాడు కాస్త గంభీరంగా.

"మీ వీధిలో పొలిటీషియన్లు ఎవరైనా వున్నారా?"

"సి.ఎమ్. అని ఒకరున్నారు. ఇంకా రాజకీయాల్లో పాతబడని జంటిల్‌మాన్''

"పొలిటీషియన్లు ఎవరూ జంటిల్‌మెన్ కారు. నా అనుమానమైతే అతనిమీదే!"

"నెవర్, నెవర్! ఇంపాజిబుల్' అని చిన్న

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకు? 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.
- ★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

## చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

గా ముందున్న బల్లమీద కొడుతూ-

"అతనీ విషయంలో ఎంతో సీరియస్‌గా నాతోపాటు చర్చించాడు'' అన్నాడు.

"మరి అతనే ఎందుకు ముందుకురాకూడదు? మీలాంటివాళ్ళని ఈ పనిలో తిరగనీ అనుకుంటున్నాడంటే ఆలోచించండి సార్. పత్రికల్లో రాసినంత సులభం కాదు ఈ ప్రపంచంలోనివాళ్ళని అర్ధంచేసుకోవటం అనే నిజం మీకు తెలియాలన్నది అతని అభిమతమేమో'' అన్నాడు రామస్వామి నవ్వుతూ.

"అయితే సి.ఎమ్.ని నా గురువుగా భావించమంటారా మీరు?"

"మీ ఇష్టం. విషయమైతే అంతే! చివరికైనా తెలుస్తుందిలెండి మీకు''

"అదికాదు... ఈ వీధంతా వాసన గుప్పించడంవల్ల అతనికేం లాభం" బాలన్న సీరియస్‌గా అన్నాడు.

'పేపర్‌వాళ్ళకే నేను అర్ధంచెప్పే కాలమొచ్చింది బాలన్నగారూ! పొలిటీషియన్లకు ఎప్పుడూ ఏదో ఒక సమస్య వుండాల్సిందే! సువాసనేకానీండి, దుర్వాసనే అవనీండి. జనంలో తాము మరుపుకురాకూడదని ఇలాంటివి చేస్తారు''

బాలన్నకు ఈ విషయాన్ని కొనసాగించడం ఇష్టంలేక, "ఓ కాయితం ఇవ్వండి సార్! నేను కంప్లయింట్ రాసిస్తాను. ఆ తర్వాత మీరు ప్రొసీడ్ కావచ్చు'' అన్నాడు.

అందాకా చెత్తకుండీ తరలింపు విషయాన్ని ఇంకా చెప్పకుండా వుండిపోయిన రామస్వామి- డా. శ్రీవాత్సవగారి భార్య మాలతి ద్వారా తెలిసిన విషయాన్ని వివరించి, "ఆమె పోలీస్ ప్రొటెక్షన్ అడిగారు. మేము ఇచ్చాం. ఇప్పుడు చెప్పండి ఇందులో రాజకీయం వుందో, లేదో?" అన్నాడు.

"అదేమైనా అలా తగలడనివ్వండి! నా కంప్లయింట్ ప్రస్తుతం స్వీకరించండి'' అంటూ బాలన్న పదినిముషాల్లో రంగయ్య వీధి దుర్వాసనా విషయాన్ని వివరాలతో రాసి యిచ్చాడు. దాన్ని నవ్వుతూనే తీసుకున్న రామస్వామి, "ఇది పత్రికావార్తలా వుంది బాలన్నగారూ! అఫ్‌కోర్స్, ఐ విల్ ప్రొసీడ్ నౌ'' అని కాలింగ్ బెల్లు ఒత్తి ఇద్దరు కానిస్టేబుళ్ళను పిలిచి, "మీరు ఇప్పటికిప్పుడే వీరితో రంగయ్య వీధికి వెళ్ళి అక్కడ దుర్వాసన పుట్టిస్తోన్న చెత్తకుండిలో ఏముందో తెలుసుకుని రిపోర్టు చేయండి!" అన్నాడు.

ఇద్దరూ సెల్యూట్ కొట్టి 'మేం రెడీ!' అన్నట్టు బాలన్న వంక చూశారు. బాలన్న "వస్తాను ఎస్.ఐ.గారూ! చాలా థాంక్స్. మీ హెల్ప్‌ను ఖచ్చితంగా వార్తలో రాస్తాను'' అన్నాడు సంతోషంగా.

"దయచేసి వద్దు. మళ్ళీ మా శాఖలో రాజకీయం ప్రారంభమవుతుంది. మా పై అధికారుల అనుమతి లేకుండా మీరు మమ్మల్ని పొగడరాదు, తెగడరాదు'' అని నవ్వుతూ మీసాల గుబురుల్లో విషాదం మేళవించగా ఎస్.ఐ. బాలన్నని మెట్లదాకా వచ్చి సాగనంపారు.

బాలన్న లూనా ఎక్కి బయల్దేరాడు. అతని వెనకాలే ఆటోరిక్షాలో ఇద్దరు పోలీసులు.

రంగయ్య వీధికి వాళ్ళు చేరేసరికి పదకొండు గంటలైంది. ఎండ కారణంగా వీధిలో వాసన మరింత ఎక్కువైంది. నిర్మానుష్యమైన వీధిలో ఈ లూనా, ఆటోరిక్షా పరుగులు తియ్యటం చూసి వీధికిరువైపులా వున్న యిళ్ళ కిటికీల్లోంచి కొన్ని కళ్ళు కుతూహలంతో చూడసాగేయి.

బాలన్న లూనా ఆపుచేయకుండానే చెత్తకుండి దగ్గర నిలిపి, "ఇదే చెత్తకుండీ'' అని ముక్కు మూసుకుని చెప్పాడు. రిక్షాలోంచి దిగిన పోలీసులు తమ ముక్కుల్ని దిట్టంగా మూసుకున్నారు.

'ఏ దొంగనాకొడుకు ఈ పని చేశాడో!" అని మనసులో తిట్టుకుంటూ చెత్తకుండిలోపలికి తొంగిచూశారు.

అప్పటికే కాకులు చెత్తకుండి పైభాగపు చెత్తాచెదారాన్ని పురుగుల్నీ లాగి బయటపడే యడంతో, చెత్తకుండి అడుగుభాగంలో గబ్బు మంటూ వాసనక్కారణమైన ఓ మాంసపుము ద్ద కన్పించింది.

దానిమీద ఈగలు జొబ్బుమంటూ ముసు రుతున్నాయి. పురుగులు పారుతున్నాయి. ఒకే ఒక్కక్షణం దాన్ని చూసి, "కుక్కపిల్లో, పంది పిల్లో కావచ్చు!" అన్నాడు ఓ పోలీస్ మరో పోలీస్‌తో.

"అవునా?" అంటూ రెండోవ్యక్తి తొంగి చూసి, "కాదయ్యా మహానుభావా! శిశువులా అన్పిస్తోంది'' అన్నాడు.

సరే! చూడ్డమే మంచిది అంటూ ఇద్దరూ మళ్ళీ వంగారు. గుర్తించలేనివిధంగా ఓ మాంసపుముద్ద కుళ్ళిపోయి వుంది.

"కుక్కపిల్లదే అని రిపోర్టుచేద్దాం. శిశువని చేస్తే ఇంక మన పని అయినట్టే!" అంటూ సులభమార్గం చెప్పాడు ఒకడు.

దూరంగా బాలన్న వాసనతో ముక్కు మూసుకుని కిందా మీదా అవుతున్నాడు. అతణ్ణి సమీపించిన ఓ పోలీస్, "కుక్క పిల్లసార్! ఇప్పటికిప్పుడే మున్సిపాల్టీ అను కుంటే తీసిపారేయవచ్చు'' అన్నాడు.

గెలుపు తనదే అనుకుని వుబ్బిపోయిన బాలన్న, "మీరు నా వెనకే రండి. నేను మీ ఎస్.ఐ.గారితో ఇప్పుడే చెప్పేస్తాను'' అని మళ్ళీ లూనా ఎక్కాడు.

పోలీసులు ముక్కులు పట్టుకుని ఆటోరిక్షా కోసం చూస్తూ రంగయ్య వీధిలోని వాసనను చేతనైనంతవరకు తమ వూపిరితిత్తుల్లోంచి బయటికి తోడేస్తూ బతికి బట్టకట్టాము బా బోయ్! అనుకుంటూ కాళ్ళు జాడించారు.

కిటికీల్లోంచి ఈ తతంగాన్నంతా చూస్తోన్న కళ్ళకి పోలీసులు పరుగులు తీస్తున్నట్టే అన్పించింది.

బాలన్న కూడా వున్నట్టుండి మళ్ళీ వాళ్ళ వెంట ఎందుకు ఆఘమేఘాలమ్మీద వురుకుతు న్నదీ అర్థంగాలేదు. కాని వీధిలోకి వచ్చి ఎవర్ని అడగడం? కాకుల్నా లేక ఈ వాసనా మృతాన్ని గ్రోలడానికి విచ్చేసిన శునకలోకా న్నా? అనుకున్నారంతా. ఇలా ఆ వీధిలో ఎంతోమందికి... ఇరుగుపొరుగుతో మాట్లా డక, ఉన్న విషయాల్నీ లేని విషయాల్నీ చర్చించక పొట్టలు వుబ్బిపోయినట్టు అన్పించింది.

కాని యిన్ని గొడవల మధ్యా అసహాయు లైన పోలీసులు మాత్రం శ్రీవాత్సవగారి కారు షెడ్డులో కూచుని తామే అంటించుకున్న అగరొ త్తుల్ని ఆరిపోకుండా వూదుతున్నారు. వాళ్ళ కళ్ళలో అగరొత్తుల తాలూకు వెలుతురు కన్పి స్తున్నటికీ అక్కడ పొగ మాత్రం లేదు.



ఎస్.ఐ.రామస్వామి అరగంటలోనే తిరిగొ చ్చిన బాలన్నను ఆహ్వానించి, "మీరే గెలిచా రు, కంగ్రాట్స్!" అన్నాడు చిరునవ్వుతో.

"ఎందులో గెలిచాను సార్?" అన్నాడు బాలన్న ఆశ్చర్యంతో.

"మీరు దేనికోసం పోరాడుతున్నారో అందులో''

"మీకెలా తెలిసిందండీ?" బాలన్న ప్ర శ్నించాడు.

"మీ ముఖం చూస్తుంటే తెలీడంలేదూ? లైన్ క్లియరైందని అర్థమైపోయింది. ఇంక నేనే రిపోర్టు చేస్తాను కావాలంటే పురపాలక సంఘా నికి''





బాలన్న ఖుషీగా నవ్వాడు. "యు ఆర్ కరెక్టు రామస్వామి! కాని ఈ చెత్తకుండీ ఇన్ని సమస్యలకు మూలకారణమవుతుందని నేను కలలో కూడా అనుకోలేదు. రోజూ సవాలక్ష చెత్తకుండీల్ని చూస్తాం మనం, కాని ఇలాంటి అనుభవం ఇదే మొదటిసారి!" అంటూ విజయం తనదే అన్నట్టు ఉబ్బిపోయాడు బాలన్న.

"నిజమే, ఈ ప్రపంచంలో ప్రతి వస్తువూ సమస్యను పుట్టించగలదు. అది యిది అని కాదు. ఓ పెన్ను, ఓ గుండుసూది సైతం అల్లకల్లోలం పుట్టించిన విషయం నాకు తెలుసు, అయితే వాటినన్నింటినీ మీకు చెబితే మీరు వార్త రాసేస్తారు. పైగా అది నా మూలంగానే వచ్చిందని కొంపదీసి రాశారంటే... మరిన్ని సమస్యలు వుత్పన్నమవుతాయి''.

"వదిలెయ్యండి. మనకిప్పుడు ఆ తలనొప్పులన్నీ వద్దు. ఇప్పుడున్న దాంతోనే మనకు ముక్కుల్దాకా వచ్చింది. అన్నట్టు ఇప్పుడు మున్సిపాల్టీ అడ్మినిస్ట్రేటర్‌కి ఓ ఫోన్ చేస్తే పోలా?" అంటూ ఆదుర్దా కనబరిచాడు.

అంతలో రంగయ్య వీధి ఎంక్వయిరీకి వెళ్ళి వచ్చిన పోలీసులు వచ్చి సెల్యూట్ కొట్టి నించున్నారు. ఎస్.ఐ. అడిగింతర్వాతే విషయం చెబుదాం అన్నట్టు విధేయులై వున్నారు. బాలన్న వాళ్ళవైపు తిరిగి, "చెప్పండయ్యా! ఉన్న విషయం చెప్పండి. సాధ్యమైనంత త్వరగా ఆ చెత్తకుండీ అక్కణ్ణించి పోవాలి!" అన్నాడు.

"ఔనౌను'' అంటూ రామస్వామి "అందులో ఏముంది?" అన్నాడు మామూలుగానే.

"కుక్కపిల్లలా ఏదో ఓ మాంసపుముద్ద వుంది సార్. చాలా జాగ్రత్తగా చూశాం. బాలన్నగారూ చూశారు''

"మీరింక వెళ్లొచ్చు'' అంటూ ఎస్.ఐ. పోలీసులకి సైగచేసి, "చూడండి బాలన్నగారూ! మీరున్నారని నేను ప్రొసీడ్ కావచ్చు. కానీ ఈ పోలీసులు ఓ తప్పు చేశారు. కంప్లయింట్ ఇచ్చింది మీరే కావడంతో బాధలేదులెండి. లేదంటే ఇలాంటి సందర్భాల్లో సాధారణంగా మేము నలుగురిని పిలిచి సాక్ష్యంగా వుంచుతాం. ఈ దరిద్రపుగొట్టు పోలీసులు మీరు సాక్ష్యం వున్నారని వచ్చేశారు. కాకుండా ఆ చెత్తకుండీలో శవముందని ఏమీ కంప్లయింటు లేదు కదా?" అని తనే సమస్య ఎలా వుత్పన్నం అవుతుందో వివరించి దానికి జవాబునీ చెప్పారు.

బాలన్న తలాడిస్తూ, "భలే ఆఫీసరండీ మీరు! ప్రతి చిన్న విషయాన్నీ నాల్గు వైపుల్నించి విశ్లేషిస్తున్నారు. గుడ్! మీకు ఖచ్చితంగా మంచి భవిష్యత్తుంది'' అన్నాడు.

"ఈ దేశంలోనా?" అని అడగాలన్పించింది ఎస్.ఐ.కి కాని ఎందుకో అలా అనక "థాంక్స్'' అంటూనే పురపాలక సంఘాధికారికి ఫోన్ చేశారు.

"హలో! నేను ఎస్.ఐ. రామస్వామిని మాట్లాడుతున్నాను. చెంగల్రావుగారేనా? నమస్కారం సార్ నమస్కారం''

"ఓ, నమస్కారం! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు? ఎలా వున్నారు సార్''

"అంతా మీ దయ సార్, బావున్నాను''

"కానివ్వండి, మమ్మల్నెవరడిగారు? మీలాంటోళ్ళు బాగుండాలి. మీకు మంచి పేరుందయ్యా ఈసారి రాష్ట్ర అవతరణోత్సవాల్లో పోలీస్ పతకం కోసం మీ పేరు సిఫార్సు అయ్యిందని విన్నాను. కంగ్రాట్సు''

"ఓ, అదా సార్! వద్దులెండి ఆ విషయం. వచ్చాక వచ్చిందనుకోవచ్చు. ఇంతకు ముందోసారి ఇలా రికమెండై రాకుండాపోయింది. ఇప్పుడు రాకపోయినా ఆశ్చర్యపోనక్కర్లేదులెండి. పైగా మా శాఖలో నాకన్న సమర్థులు చాలామందున్నారు. వాళ్ళకొచ్చాక నాకొస్తే చాలన్నదే నా ఆశ కూడాను''

"అంటే ఇందాకా వచ్చినవన్నీ అసమర్థులకే అంటారా?"

"నేనలా అన్నానా స్వామీ! ఒకవేళ అది

నిజమైనా అలా చెప్పే హక్కు ఏ ప్రభుత్వోద్యోగికైనా వుందా సార్?"

"ఊరికినే తమాషాగా అన్నాను. సీరియస్‌గా మనం దీన్ని చర్చించి ఏమీ చేయలేం. విషయమేంటి చెప్పండి?"

"అదే రంగయ్యవీధి దుర్వాసన గురించి మన జర్నలిస్టూ, రచయిత బాలన్నగారు పొద్దుట్నించి ఆ కంపు వేస్తోన్న చెత్తకుండి తరలింపుకై చాలా అవస్థపడ్డారు. మీరు అన్నారట మా డిపార్టుమెంటు నించి ఆ చెత్తకుండిలో ఎలాంటి శవమూ లేదని ఓ.కే. చేయించమని. బాలన్నగారు ఇక్కడికొచ్చి చెప్పారు. వారితో కంప్లయింటు రాయించుకుని ఎంక్వయిరీ చేశాం. చెత్తకుండీలో మానవజాతికి సంబంధించిన ఎలాంటి కుళ్ళిపోయిన భాగమూ లేదు. ఇంక మీరు చెత్తకుండీని ఎత్తేయవచ్చు సార్'

"సరే రామస్వామీ! మాకేం అభ్యంతరంలేదు. కాని చట్టం ఏం చెబుతుందో చూడాలి కదా?"

"మళ్ళీ చట్టానికి సంబంధించిన మెలిక ఏంటండీ?"

"చెత్తకుండి క్లీన్ చేయించడానికి ఎలాంటి అభ్యంతరమూ లేదు. కాని ఆ చెత్తకుండీని



మళ్ళీ మొదట వున్నచోటికి తీసుకొని వెళ్ళండి అంటే తిరిగి సమస్య మొదలవుతుంది. ఆ చెత్తకుండీ ఇంతకుముందు వున్నచోట లేదన్నది నిజమే! కాని ఈ దేశంకోసం అపూర్వ త్యాగం చేసిన చేస్తోన్న ఓ శాస్త్రవేత్తగారి ఆరోగ్యదృష్టితో దాన్ని తరలించాం. ఇప్పుడు ఆ చెత్తకుండీని క్లీన్‌చేయించి మొదట వున్న చోటే వుంచండి అంటున్నారు. అలా సాధ్యంకాదని తర్వాత చూద్దామంటే జనం వదలడంలేదు. అందుకని మీరు మా మనుషులకు ఫుల్ ప్రొటెక్షన్ కల్పిస్తే ఇప్పుడే పంపిస్తాను. అన్నట్టు మీ పంచనామా జిరాక్స్ కాపీ ఒకటి పంపించండి''

రామస్వామి అవాక్కయ్యాడు. ఏం చెప్పాలో తెలీక "ఒక్క నిముషం సార్! బాలన్నగారిని అడిగి చెపుతాను" అని రిసీవర్‌ని చేత్తో మూస్తూ, "చూడండి బాలన్నగారూ! ఇప్పుడు మరో సమస్య ఎదురైంది. 'చెత్తకుండిని క్లీన్ చేయించేందుకు అభ్యంతరంలేదు. ఇప్పుడున్న చోటినించి పూర్వస్థానానికి తరలించడం కుదరదు' అంటున్నారు చెంగల్రావుగారు. మీ విజ్ఞాపన- చెత్తకుండీని తరలించమనా? లేక అందులోని దుర్వాసనను తొలగించమనా?"

బాలన్న ఈ దుర్వాసన విషయం ఇన్ని మలుపులు తిరుగుతుందని వూహించలేదు. "చెత్తకుండీని ఇంతకుముందున్నచోటికే బదలాయించాలి" అన్నాడు.

రామస్వామి చెంగల్రావుగారికి బాలన్న చెప్పిన విషయం తెలిపాడు. ఆయన అరని ముషం ఏమీ మాట్లాడక మళ్ళీ ఆలోచించి, "మనం చర్చించడం వద్దు సార్. అతన్నే ఇక్కడికి పంపించండి" అన్నాడు మెల్లిగా.

రామస్వామి ఇబ్బందిగా ఫీలయ్యాడు. మళ్ళీ రంగయ్య వీధిలో గొడవ కావచ్చు. అది ఏ మలుపులైనా తిరగొచ్చు. ప్రశాంతంగావున్న ఆ ఏరియాలో ఇప్పటివరకూ ఇలాంటి కేసుల్లేవు. బాలన్నకు ఇప్పుడు సాయంచేయనట్లయితే ప్రజలకు ఇబ్బంది కల్గుతుంది. ఈ చెంగల్రావు ఇలా బరిలోకి దిగడంచూస్తే- అతను శ్రీవాత్సవగారినించి కావల్సినంత లంచం పుచ్చుకొని వుండొచ్చు. కాదంటే దీనివెనక రాజకీయ హస్తమైనా వుండి వుండాలి- ఇలా ఆలోచిస్తూ ఖచ్చితమైన నిర్ణయానికొచ్చినట్టు బాలన్నతో, "నేను దీన్ని ఛాలెంజ్‌గా తీసుకుంటున్నాను బాలన్నగారూ! మీరు అలాగే తీసుకోండి. మీ మద్దతుంటే చాలు నేను ఖచ్చితంగా న్యాయం చేస్తాను" అంటూ తనకూ చెంగల్రావుకూ మధ్య జరిగిన సంభాషణంతా చెప్పాడు.



సమస్య పరిష్కారమైందని సంతోషపడుతున్న బాలన్నకు అది మరోవైపు మళ్ళడం చూసి వున్నట్టుండి ఫ్యాన్ తిరుగుతున్నప్పటికీ చెమటపోసింది. దాంతోపాటే రామస్వామి

హుషారును చూసి ఇప్పటికే ఇలాంటి అధికారులున్నారు కదా మనదేశంలో అని ఆనందించాడు. రామస్వామి చెప్పినట్టు తను దీన్ని సవాలుగా స్వీకరించాల్సిందే, అనిపించింది బాలన్నకు. వీలుంటే ఈ విషయాలన్నింటినీ నేపథ్యంగా తీసుకుని ఓ నవల రాయాలని ఆలోచిస్తూ "గివ్ మీ యువర్ హ్యాండ్' అని రామస్వామితో చెయ్యి కలిపి "మీ పంచనామా ప్రతి ఇవ్వండి. అంతే కాకుండా మున్సిపాలిటీ నౌకర్లకు పోలీసు రక్షణ ఇవ్వబడుతుందనీ రాసి ఇవ్వండి'' అన్నాడు.

బాలన్న చెప్పినట్టు రామస్వామి రికార్డులన్నీ సిద్ధం చేసి బాలన్నకిస్తూ, "మీరింత చేసినా ఆ చెంగల్రావు చెత్తకుండీని పూర్వస్థానంలో వుంచేందుకు అవకాశమివ్వడన్పిస్తోంది నాకు. దీనికి మార్గమేమంటే మీరు రంగయ్యవీధి జనాన్ని జాగృతంచేసి చెత్తకుండీని తీసుకుపోవడానికి మున్సిపాల్టీవాళ్ళ లారీ రాగానే గొడవ ప్రారంభించాలి. ఇది మీరు రంగయ్యవీధికి వెళ్ళడంతోటే చేయాల్సిన అత్యవసరమైన పని'' అన్నాడు.

"నిజమే'' బాలన్న ఒప్పుకున్నాడు.

"ఇంకా ఏం చేద్దాం?"

"అదే ఆలోచిస్తున్నాను. సి.ఎమ్.కి ఫోన్‌చేస్తే ఎలా వుంటుంది?"

"అతను పొలిటీషియన్ అని అన్నదీ మీరే! అతనీ సమస్యని ఎలా వాడుకున్నా దాంతో తనకేమైనా రాజకీయలాభం వుందా లేదా అనే చూస్తాడు''

"చూడనివ్వండి! మనదేశంలోని రాజకీయ నాయకుల్ని బాగుచేయడం మనతో కానిపని. ప్రజలకి ప్రయోజనం కలిగే పక్షంలో మనమూ అతణ్ణి హీరోగా అంగీకరిస్తే పోలా?" అన్నాడు బాలన్న తప్పదన్నట్టు.

రామస్వామి నవ్వాపుకోలేకపోయాడు.

అయోమయంగా "ఎందుకు?" అంటూ భ్రుకుటి ముడిచాడు బాలన్న.

"మేధావులం అనుకునే మనలాంటి వాళ్ళం పొరబడేది ఇక్కడే! ఈ రాజకీయనాయకులు నిరక్షరాస్యుల్ని ఎలాగో మభ్యపెట్టి ఓట్లు వేయించుకుంటున్నారు. ఇంక మనలాంటి వాళ్ళను ఇలాంటి విషయాల్లో సాయంచేసినందుగ్గాను ఓట్ల సందర్భంలో ఖచ్చితంగా వుపయోగించుకొంటారు చూడండి''

"అప్పుడు మనం ఒప్పుకోకపోతే సరి''

"కాని వాళ్ళు వదలాలికదా! మీలాంటి మేధావుల్ని కలుపుకునే మేం పరిపాలించడం అంటారు. కాని మీ సలహాలన్నింటినీ ఫైళ్ళలో పెట్టేసి వాళ్ళు హాయిగా శాసనసభలో విరాజిల్లుతారు''

"సరే! మరిప్పుడు ఏం చేద్దామంటారు?"

"సి.ఎమ్.కు ఫోన్‌చేసి విషయం చెప్పండి. కాని ముందుముందు అతని సహవాసంపట్ల కాస్త జాగ్రత్తగా వుండండి. మనమూ రాజకీయం చేయాల్సివస్తుంది. అంటే రాజకీయం కోసం రాజకీయం అన్నమాట!"

అలా చెప్పిన రామస్వామి ఫోన్ బాలన్న ముందు వుంచాడు.

బాలన్న రింగ్ చేశాడు. అవలివైపునించి "హలో!" అన్నాడు సి.ఎమ్. అతనికి మాట్లాడే అవకాశం యివ్వకుండా బాలన్న నాల్గు నిముషాల్లో తను ఏమేం చేసిందీ చెప్పి, తను పోలీసు రక్షణతో మున్సిపాల్టీవాళ్ళ లారీ తెప్పించగలననీ, ఇంతలో జనాన్ని సమీకరించవలసిందనీ, వాళ్ళతో చెత్తకుండీ పూర్వస్థానంలో వుంచేందుకు నిర్బంధించేలా చూడవలసిందనీ వివరంగా చెప్పాడు.

"నిజమే బాలన్నగారూ! నాకూ చెత్తకుండీ ఇంతకుముందున్న చోటే వుండాలనుంది. ఇందాకే నేను ఓ మాస్ పిటిషన్ రాయించి మన వీధి జనాలందరితోనూ సంతకాలు సేకరించి పెట్టాను''

"గుడ్ ఐడియా కంగ్రాట్స్!"

"థాంక్స్''

బాలన్న పురపాలక సంఘ కార్యాల




యంకేసి లూనా తిప్పాడు. చెంగల్రావు ఎలాంటి భావాన్నీ ప్రదర్శించని ముఖంతో బాలన్నను ఆహ్వానించాడు. రామస్వామి యిచ్చిన రికార్డులన్నీ బాలన్న చెంగప్పకు అప్పగించాడు. అన్నీ పరిశీలించిన చెంగల్రావు ఓమారు కనుబొమలు ఎగరేసి బల్లమీది బెల్లు నొక్కాడు.

"సార్' అంటూ ఓ వ్యక్తి వినయంగా నించున్నాడు.

"మన లారీ వుందా?"

"చూడలేదుసార్, చూసివస్తాను''

చెంగల్రావు లావుపాటి కళ్ళద్దాల వెనకవున్న తన కళ్ళని ఫైళ్ళమీద వుంచాడు. ఐదునిముషాలయ్యాక ఇందాకటి వ్యక్తి లారీడ్రైవర్‌ను వెంటపెట్టుకొని వచ్చాడు.

చెంగల్రావు డ్రైవర్‌ను ఎగాదిగా చూసి, "రంగయ్యవీధి చెత్తకుండిక్లీన్ చేసి ఎన్నాళ్ళైంది?" అన్నాడు ఠీవి ఒలకబోస్తూ.

"రోజూ అటేపు ఎళ్తున్నాం సార్. నిన్న కూడా ఎళ్ళాం"

"చూడు! ఇతను పత్రికలో పనిచేసే మనిషి. పొద్దుట్నించీ చెత్తకుండి కంపుకొడుతోందని ఆపసోపాలు పడుతున్నారు. ఇప్పటికిప్పుడే వెళ్ళి తరలించండి''

"మంచిదన్నట్టు తలాడించి డ్రైవర్ బయల్దేరాడు.

వెంటనే బాలన్న "చెత్తకుండీ యింతకు ముందున్నచోటనే వుంచాలి సార్' అన్నాడు.

చెంగల్రావుకు కోపమొచ్చింది. "ఇప్పుడిది కానివ్వండి సార్! మీరన్నది తర్వాత చూద్దాం!" అన్నాడు ఈ విషయంలో తను నిమిత్తమాత్రుణ్ణి అన్నట్టు.

బాలన్నకూ చర్చ కొనసాగించడం ఇష్టంలేదు. ముందు తన వీధి దుర్వాసన తొలగడం మంచిదనుకున్నాడు. మౌనంగా బయల్దేరి డ్రైవర్‌ను అనుసరించాడు.

"ఐదు నిముషాల్లో వస్తాం సార్! మీరు ముందెళ్ళండి'' డ్రైవర్ అన్నాడు బాలన్నతో, "చూడయ్యా! మా వీధి భాగోతం నీకు తెలీదు. అక్కడ ఏమైందంటే..." అంటూ బాలన్న చాటభారతం విప్పి, "మీరిలా వస్తే జనం ఆవేశంలో ఏం చేసేదీ తెలీదు. అందుకని ఎస్.ఐ.గారితో మీకు రక్షణ కావాలని చెప్పాను'' అన్నాడు.

లారీ డ్రైవర్‌కి ఏమీ అంతుపట్టలేదు. అతని బతుకంతా మున్సిపాల్టీ చెత్తని ఎత్తిపారబోసే లారీతోనే ముడివడివుంది. ఎన్నడూ అతణ్ణి దబాయించిన అధికారులు లేరు. అనేక రకాల వాసనలు కల్గిన అశుద్ధాన్ని తరలించిన అనుభవశాలి అయిన అతనికి ఇప్పుడు ఏ వాసన అయినా వాసనలా అన్పించడంలేదు. ముక్కే లేనివాడిలా మారిపోయాడు. అందుకని అతను తమాషాకే అయినా తన భార్యతో యిలా అంటుంటాడు "నువ్వు ఎంత వేపుడు చేసినా నాకు పదార్థాల రుచి ఒక్కటే. నూనె కష్టమైన ఈ రోజుల్లో ఎందుకు ఈ వేపుళ్ళూ, గీపుళ్ళూ?" అని.

అతనికి బాలన్న ఎలాంటి మనిషో తెలీదు. కాని "మీరన్నట్టు చేద్దాం సార్! మీరు స్టేషన్‌కు నడవండి. నేనక్కడికి వస్తాను'' అన్నాడు.

బాలన్న లూనామీద మళ్ళీ పోలీస్ స్టేషన్ చేరేసరికి ఆ డ్రైవర్ కృష్ణప్ప నల్గురు కూలీవాళ్ళని తీసుకుని వారితో హాజరయ్యాడు.

రామస్వామి ఇరవైఏడు, ఇరవై తొమ్మిది నంబర్ల కానిస్టేబుళ్ళను లారీలో వెళ్ళమని ఆజ్ఞాపించాడు. పోలీసులిద్దరూ ఎందుకు, ఏమిటని అడగకుండానే లారీ ఎక్కి కూచున్నారు.

లారీ స్టార్టుచేసిన కృష్ణప్ప ఎడమచేత్తో స్టీరింగ్‌వీల్ పట్టుకుని కాస్త కుడికి వాలి ఎస్.ఐ.గారికి సెల్యూట్ కొడుతూ క్లచ్ వదలి ఎక్సలేటర్ నొక్కాడు.

బాలన్న 'రంగయ్యవీధిలోని అందరూ తమతమ యిళ్ళ తలుపులు తెరిచి వుంచవచ్చు, సి.ఎమ్. అందరినీ జమచేసి తనకోసం ఎదురుచూస్తూ వుండవచ్చు' అనుకుంటూ లూనాను పరుగులుపెట్టించసాగాడు. శివయ్య

ఇప్పుడు తన వెంట వుంటే ఎంత బావుండేది! పాపం, ప్రమాదానికి గుర్రై ఆసుపత్రిపాలయ్యాడు కదా అని బాధపడ్డాడు.

దేన్నీ లెక్కచేయని డ్రైవర్ మాత్రం లూనా నడుపుతోన్న బాలన్న వెనకాలే సీరియస్‌గా పోలీసుల్ని మాటల్లోకి ఎలా దించాలా అని ఆలోచిస్తూ లారీ నడిపిస్తున్నాడు, లూనా ఎక్కువ వేగంతో వెళ్ళడంలేదు కనుక మాటి మాటికి కృష్ణప్పకు ఏక్సిలేటర్ నించి కాలు తీయక తప్పడంలేదు. అయినా ఈలోపు అతను పోలీసులతో మాటల్లోకి దిగగలిగాడు. కాని ఆ పోలీసులు రంగయ్య వీధిలోని దుర్వాసన గురించి ఇంతకుముందే తమతోటి సహోద్యోగలవల్ల వినివుండటంతో, తామెలా దాన్ని ఎదుర్కోవాలోనని విచారపడుతూ డ్రైవర్ మాటలపట్ల ఆసక్తి కనబర్చలా.

చివరికి రంగయ్యవీధి రానే వచ్చింది.

వీధిలో ఒక్క పురుగూ లేదు. అంతా నిర్మానుష్యం. బాలన్న తన ఇంటినించి బయల్దేరేప్పుడు ఎలా వుందో అలాగే వుంది వీధి.

అదే గబ్బువాసన.

అవే జొబ్బుమంటున్న ఈగలు.

కాకుల అల్లరీ అలాగే వుంది.

నాలుగైదు కుక్కలు చెత్తకుండి చుట్టూ మూగి గునగున మంటున్నాయి. వీధంతా నిశ్శబ్దంగా వుంది.

'అరే! సి.ఎమ్. ఎందుకిలా చేశాడని' ఆలోచిస్తూనే విధిలేక లూనాను చెత్తకుండివైపు తిప్పాడు. లూనా వెనకే లారీ బయల్దేరింది. అది ఎంత శబ్దం చేయగల్గుతుందో అంత చప్పుడుతోనూ సాగిపోతోంది. ఆ చప్పుడుకి హఠాత్తుగా రంగయ్యవీధిలోని అనేక యిళ్ళ కిటికీలు తెరుచుకున్నాయి. ఇహ... కిటికీల నిండా కళ్ళే! అవి ఆసక్తిగా బయటికి చూశాయి. మరుక్షణం నాలుగైదు తలుపులు తెరుచుకున్నాయి.

అలాంటి ఓ గుమ్మంలోంచి సి.ఎమ్. అతని వెనకాల నలుగురైదుగురు అతని అభిమానులూ, మిత్రులు వచ్చారు. సరిగ్గా అదే సమయానికి రంగయ్య వీధికి పక్కనే వున్న అంబేడ్కర్ వీధినించి, చెట్టియార్‌వీధినుంచి ఒక్కసారి డెబ్బైమందికి పైగా జనాలు గబగబా వచ్చేశారు. వాళ్ళంతా ఆటోరిక్షాల్లో వచ్చారు. డ్రైవర్‌కూ, పోలీసులిద్దరికీ అలా వచ్చిన జనం లారీవైపు విసురుగా రావడం చూసి భయంకల్గింది. డ్రైవర్ కృష్ణప్ప అయితే జనం తన తల పగులగొట్టడం ఖాయం అనుకున్నాడు. పోలీసులు తాము ఇద్దరే వుండటంతో తమ పోలీసునిర్వాకం ఇక్కడ పనికిరాదనుకుంటూ మీసాలు దిద్దడం ఆపేసి లారీలోంచి కిందకి దిగకుండా, చేతుల్లో వున్న లాఠీల్ని చిన్నగా జారవిడిచారు.

అంతలో చెత్తకుండీ క్లీన్ చేసేందుకొచ్చిన కూలీలు నల్గురూ జనం ఎక్కడ తమమీదికి దూసుకొస్తారో అని భయపడి పెళ్లాం పిల్లల్ని తలచుకుని పలాయనం చిత్తగించారు. దీన్నంతా సైడ్ మిర్రర్‌లోంచి గమనిస్తోన్న కృష్ణప్ప తనూ వాళ్ళలాగే ఆ వీధికి వెన్ను చూపాలనుకున్నాడు. కాని తను పారిపోతే జనం లారీని తగులబెట్టవచ్చు... తర్వాత తను నౌకరీ ఎలా వెలగబెట్టడం అనుకుని, ఏం చేద్దాం అన్నట్టు పోలీసులవైపు చూశాడు.

ఆలోగా సి.ఎమ్., బాలన్న... ఇద్దరూ జనాన్ని "శాంతించండి... శాంతించండి!" అంటూ విజ్ఞప్తిచేశారు.

బాలన్న సంతోషంగా "చెంగల్రావుగారికి చెత్తకుండీని పూర్వపుచోట వుంచడానికి యిష్టంలేదు. అయితే మనం చెత్తకుండీనీ లారిలోకి ఎక్కించి క్లీన్ చేయించి మొదట ఎక్కడుందో అక్కడే మళ్ళీ వుంచేద్దాం!" అన్నాడు.

"నా ఆలోచన కూడా అదే! మీరు ఫోన్ చేయకున్నా పొద్దుట్నించి నేను దీన్ని గురించే తల బద్దలుకొట్టుకుంటున్నాను. ఈ జనమంతా నేను చెబితేనే వచ్చారు'' అన్నాడు సి.ఎమ్.




బాలన్న సి.ఎమ్.గారిలా మాట్లాడతారని అనుకోలా. కాని ఇప్పుడు సి.ఎమ్. మాటల అంతర్యంగురించి పట్టించుకునే సమయంకా దనుకున్నాడు. బాలన్నకు ఎస్.ఐ. మాటలు గుర్తుకొచ్చాయి. కాని చెత్తకుండీ ముందు ఇక్కణ్ణుంచి కదలాలి. తర్వాత సి.ఎమ్.గారితో మాట్లాడొచ్చు.

"ఇప్పుడర్థమైందిలెండి! మరి మీరే ఇప్పుడీ జనంతో చెత్తకుండీని ఎత్తి లారిలో పెట్టమంటే మన పని అవుతుందికదా?" అన్నాడు సి.ఎమ్.తో.

సి.ఎమ్. అనుకున్నదీ అదే. అతడు జనమధ్యలోకి చొచ్చుకొచ్చి గట్టిగా, "మహా జనులారా! మీరంతా పెద్దమనస్సు చేసుకొని ఈ చెత్తకుండీని లారిలోకి ఎక్కించండి'' అన్నాడు.

జనం ఒక్కుమ్మడిగా ముందుకు తోసుకొచ్చారు. దుర్వాసన ఏదీ లేనట్టుగానే నేను ముందు అంటే నేను ముందంటూ చెత్తకుండీ వైపు విరుచుకుపడ్డారు. క్షణాల్లో చెత్తకుండీ వారి చేతులమీద నాట్యంచేస్తూ లారీ ఎక్కింది.

అప్పటివరకూ మౌనంగా వుండిపోయిన డ్రైవర్ కృష్ణప్ప, పోలీసులిద్దరూ తమతోపాటు వచ్చిన కూలివాళ్ళు ఎక్కడున్నారని అటూ ఇటూ చూశారు.

అంతలో సి.ఎమ్. లారీముందుకొచ్చి "ఇంకా అలా కూచున్నారేంటి? పొద్దుట్నుంచి ఈ వాసనతో చస్తున్నారు జనం. వెంటనే లారీ తీసుకెళ్ళండి!" అన్నాడు.

కృష్ణప్ప లారీ స్టార్టుచేసి పారిపోయిన కూలీల్ని మనసులో తిట్టుకుంటూ ఏక్సిలేటరును నొక్కాడు. మొత్తం లారి అంతా 'ఓ దుర్వాసనకు చెందిన ముద్ద' అన్నట్టుగా నిదానంగా రంగయ్యవీధినుంచి కదలసాగింది. జనం 'సి.ఎమ్.గారు వర్థిల్లాలి' అంటూ నినాదాలు చేస్తూ ముందుకు సాగిపోయారు.

రంగయ్యవీధిలో అన్ని ఇళ్ళలోంచీ గొంతులు తమకు తెలీకుండా ఈ నినాదాలకు వంత పాడాయి. శ్రీవాత్సవగారి ఇంటికి కాపలాగా వున్న పోలీసులుసైతం ఈ జయజయధ్వానాలకు తమవంతు గొంతు కలిపారు.

కాని శృతి కలపకుండా వుండిపోయిన వ్యక్తి బాలన్న ఒక్కడే! అతని లూనాను ఎవరో పడేసినట్టున్నారు. దాన్ని తొక్కుకుంటూనే జనం వెళ్ళిపోయినందువల్ల అది స్టార్టుకానని మొరాయించింది. దాన్ని లేపి నెమ్మదిగా నెట్టుకుంటూ బాలన్న తన ఇంటి వైపు వెళ్ళిపోవడాన్ని ఏ ఒక్కరూ గమనించలేదు. కనీసం ఒక్క కాకి కూడా చూళ్ళేదు అతన్ని.



వచ్చేవారం జరుగబోయే పురపాలక సంఘం మీటింగులో చర్చించవలసిన ముఖ్యమైన విషయాల గురించి సంబంధిత అధికారుల నుంచి పొందిన రిపోర్టులు, లెక్కలమీద దృష్టి సారించిన చెంగల్రావు కుర్చీలో అలా కాసేపు వాలిపోయాడు.

అంతే! అతని ముక్కుపుటాలు ఛెంగు ఛెంగున కొట్టుకోసాగాయి. అరే, ఇదేమిటి అని తలెత్తి చూస్తే ఏదో కంపు ముక్కును తాకుతోంది. అది ఎక్కణ్నించి వస్తోందో తెలీక ఆశ్చర్యపోయాడు. రంగయ్య వీధి దుర్వాసన గురించి పొద్దుట్నుంచీ తానూ ఆలోచిస్తూండబట్టి బహుశా వాసన తనకూ వస్తోందన్న భ్రమ

కావచ్చు అనుకున్నాడు. కాని ఎందుకో అలా నమ్మలేకపోయాడు. వాసన వాస్తవంగానే తన ఆఫీసులో వ్యాప్తి చెందుతున్నట్టు ఫీలయ్యాడు. విషయం కనుక్కుందామని బల్లమీది బెల్లు నొక్కే ప్రయత్నం చేస్తుండగానే అతనికి ఎదురుగా డ్రైవర్ కృష్ణప్పతోపాటు ఓ జవానూ ప్రత్యక్షమయ్యారు. అరే! వీడెందుకిక్కడికొచ్చాడనుకుంటూ కనుబొమలు ఎగరేసి, "వాసనేదో వస్తోంది'' అన్నాడు యిద్దర్నీ చూస్తూ.

డ్రైవర్ కృష్ణప్ప రంగయ్యవీధిలో జరిగిందంతా వివరించి "కూలీలు ఎక్కడికి పారిపోయింది తెలీదుసార్. జనం నాకుమటుకు అవకాశం యివ్వకుండానే అమాంతం చెత్తకుండీని ఎత్తి లారిలో వేశారు. చెత్తకుండీని క్లీన్ చేయిద్దామంటే జనంలేరు. లారీ తెచ్చి మన ఆఫీసుముందు ఆపాను. నాకొక్కడికీ ఆ చెత్తకుండీని నెట్టడం ఎలాసాధ్యం?" అన్నాడు.

చెంగల్రావు ఆశ్చర్యపోవడమేకాక అధైర్యపడి, "ఇదో పెద్ద సమస్య అయికూచుందికదా!" అని ఏమీతోచక రెండుసార్లు బెల్లునొక్కాడు.

"సార్! నేనిక్కడే వున్నాను'' అన్నాడు జవాను వంగి నించుంటూ.

"ఎప్పుడూ చెత్త పారబోసేవైపు వెళ్ళి లారీ ఖాళీచేయొచ్చుకదా?" అన్నాడు చెంగల్రావు కంగారుగా.

"అంటే చెత్తకుండీని కిందకు నెట్టమంటారా సార్?" అన్నాడు కృష్ణప్ప ఆ మాటలు అర్థంగాక.

"ఇంకేం చేయగలం? చెత్తకుండీని తీసుకురావద్దని మొత్తుకున్నాను. జనం వదల్లేదని మోసుకొచ్చావ్. ఇప్పుడు చెత్తకుండీని తోసెయ్యకపోతే ఈ ఆఫీసులో ఎలా కూచుంటాం?" అన్నాడు కోపంతో.

"ఈ పని నా ఒక్కడివల్ల కాదు సార్!"

"మరి నేను రావాలా? నాపని చెత్తకుండీ నెట్టడమేనా?" చెంగల్రావు చిందులేశాడు.





కృష్ణప్పకు ఎలా మాట్లాడాలో అర్థంకాలేదు. మాట్లాడకుండా నించున్నాడు. చెంగల్రావు గొంతు పెద్దదిచేసి, "ఎలాగైనా లారీని ఆఫీసు ముందర్నుంచి తీసుకెళ్ళు. లేదంటే నేను ఈ వాసనతో చస్తాను'' అన్నాడు.

చెంగల్రావు అరుపులవల్లా, ఆఫీసులో నెమ్మది నెమ్మదిగా వ్యాపిస్తోన్న వాసనవల్లా ఆఫీసు సిబ్బంది ఒక్కరొక్కరే తమతమ ఆసనాల్లోంచి లేచి వరండావైపు రావడం మొదలెట్టారు.

'ఇంక ఇక్కడుంటే ఇంతే సంగతులు' అనుకుంటూ కృష్ణప్ప మళ్ళీ లారీ దగ్గరికి పరుగెత్తాడు. నిస్సహాయులై లారిలో కూచున్న పోలీసులు ఈ డిపార్టుమెంటుకి ఎందుకొచ్చామ్రా? అని లోపల్లోపలే గొణుక్కుంటూ హార్మోనియంమెట్లని శృతి చేస్తున్నట్టు ముక్కుల్ని మూస్తూ తెరుస్తూ కూర్చున్నారు. లారీవైపు పరుగెత్తుకుంటూ వస్తోన్న కృష్ణప్పను చూసి "ఉంటే ఇతనిలా వుండాలి'' అని అతని ముక్కుతాలూకు శక్తిసామర్థ్యాల్ని తెగ మెచ్చుకున్నారు. కృష్ణప్ప వస్తూనే ధుమధుమలాడిపోతూ గొణిగాడిలా, "ఇలాంటి ఆఫీసర్ని ఇంతవరకు చూళ్ళేదు. ఏ ఒక్క పనీ చేయలేనివాడు ఆ కుర్చీలో ఎందుక్కూచోవాలి?"

చివరికి కృష్ణప్ప ఓ నిర్ణయానికి వచ్చాడు. సీతాపురం చెత్తనంతా పారబోసే రంగావతి నదీతీరానికి లారి తీసుకువెళ్ళాలి. అక్కడ ఈ చెత్తకుండిని లారీలోంచి తోసేసి నదిలో ఎప్పటిలా స్నానంచేసి వాపస్ రావాలి. ఈ విషయాన్నే అతను పోలీసులతోనూ చెప్పాడు. వాళ్ళకు జవాబేం చెప్పాలో తోచక "సరే!" అని తమ ముక్కులు మూసుకున్నారు.

ఇలా రంగయ్యవీధిలో హఠాత్తుగా అవతరించిన దుర్వాసన మున్సిపాలిటీ లారీవల్ల దాదాపు సగం సీతాపురంవరకు వ్యాపించి మున్సిపాలిటీ ఆఫీస్‌నీ అల్లకల్లోలం చేసి ఆఖరికి రంగావతి నదీతీరంలో అంతరించిపోయింది. ఇటు రంగయ్యవీధిలో నివసిస్తోన్న జనాలు ఏదో పెద్ద గెలుపు సాధించినట్టు, పైగా పగలైనప్పటికి అప్పుడే తెలతెలవారినట్టు

ఎప్పటి ఉత్సాహంతో తమ దినచర్యల్ని ప్రారంభించారు.

బాలన్న ఇంట్లో అడుగుపెట్టి వాలుకుర్చీలో వాలిపోయి, "హుష్..." అంటూ నిట్టూర్చి "లక్ష్మీ!" అన్నాడు.

అప్పుడే లారిలో చెత్తకుండీ తరలిపోవడం కళ్ళారా చూసిన లక్ష్మి ఇంకా ముఖం కడుక్కోకపోవటం గుర్తొచ్చి బాత్రూంకు దౌడుతీసింది. ఆమె అక్కణ్ణుంచే "వస్తున్నాను" అంది. ఎప్పుడూ పడుకునివుండే భాగీరథమ్మ ఆరోజు నెమ్మదిగా లేచి "బాలూ" అంది.

"ఏంలేదమ్మా! నువ్వు పడుకో!" అని బాలన్న కుర్చీలోంచి లేచాడు.

"నాకీరోజు మునుపటిలా ఆయాసం లేదు బాబూ! ఇంత పొద్దయినా ఒక్క కప్పు టీ కూడా ముట్టుకోలేదు. ఈరోజు ఎందుకో సుస్తీగా లేదు. శరీరం చాలా తేలిగ్గా వుంది" అని భాగీరథమ్మ మంచమ్మీంచి దిగి వరండాలోకి వచ్చేందుకు అడుగులేసింది.

ఆమెని సగంలోనే ఆపాడు బాలన్న. అయినా ఆమె వరండాలోకి వచ్చి పేంకుర్చీలో కూలబడుతూ, "నేను ఇక్కడికి వచ్చి వారంరోజులైంది. ఈరోజు మంచిరోజు. నా బాలు లేకుంటే రోజంతా ఈ వీధిజనం ఈ గబ్బుని పీలుస్తూ చచ్చేవాళ్ళు" అంది ప్రేమగా బాలన్నని కళ్ళనిండా చూస్తూ.

అంతలో లక్ష్మి బాత్రూంనుంచి బయటికొస్తూనే "ఐదు నిముషాల్లో టీ చేస్తాను. అరగంటలో వంట రెడీ!" అంది. అలసిసొలసిపోయిన మగణ్ణి చూసి దగ్గరకి వెళ్ళి తల నిమరాలనిపించినా ఎదురుగా అత్తగారు కూచోవడం చూసి విధిలేక వంటింట్లోకి వెళ్ళింది.

బాలన్న "ఓ గ్లాసు నీళ్ళు పట్రా" అన్నాడు లక్ష్మితో.

"ఇదుగో వచ్చేస్తున్నాను" అంటూ లోపల్నించి లేడిపిల్లలా గెంతి భర్తచేతికి నీళ్ళు అందించి, "కాస్త పడుకోండి. అలసిపోయారు మీరు" అంది చిన్నగా.

వాలుకుర్చీలో కళ్ళు మూసుకుని పడుకున్న బాలన్నకు పొద్దున్న రామస్వామి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. తను సగంరోజంతా మల్లగుల్లాలుపడి చెత్తకుండి తరలింపుకోసం యింత శ్రమ తీసుకున్నా జనం నమ్మింది సి.ఎమ్.నే! అతనివల్లే ఈ కంపు తరలింపు అయ్యిందని నమ్ముతున్నారు. అతనూ అంతే. ఇంట్లోనే కూచుని తననీ, శివయ్యనీ ఎంత చక్కగా వాడుకున్నాడు! ఏ గొడవలోనూ తల దూర్చని తను ఈవాసనవల్ల నిద్రలేవడమే ఈ పశ్చాత్తాపానికి కారణం. తనూ ఇక్కడి జనాల్లో హీరో కావాలన్న ఆశ కల్గివుండడమూ దీనికి మరో కారణం. బాలన్న ఈ వార్తని 'దినసుద్ది'కి పంపడం ఎలాగా అని ఆలోచిస్తున్నాడు. రేపు సీతాపురంలోని చిన్నచిన్న పత్రికల్లోసైతం ఇది పెద్ద వార్తయికూచుంటుంది. అలాంటప్పుడు 'దినసుద్ది'లో ఓ మూలకైనా ఈ వార్తకు స్థానం దొరక్కపోతే తను ఆ పత్రికకు జర్నలిస్టుగా వుండి ప్రయోజనం ఏమిటి?

బాలన్నకు కలిగిన శారీరక శ్రమ, దాంతోపాటు అనుకోకుండా సంభవించిన మానసికాయాసం, ఆకలితో వున్న పొట్ట... ఇవన్నీ కలిసి వున్నట్టుండి అతనికి కునుకు తెప్పించాయి.

భర్త పొద్దుటినుంచీ పరుగెత్తి పరుగెత్తి నీరసపడిపోయి హాయిగా పడుకున్నారనుకుంది లక్ష్మి. అయినా పళ్ళెం పెట్టి "ఏమండీ! భోజనానికి రండి" అంది. కాని బాలన్న అప్పటికే నిద్రలోకి జారిపోయాడు. లక్ష్మి వచ్చి చూస్తే బాలన్న మగతలో వున్నాడు. నోరు తెరిచివుంది. సగం తెరిచివున్న కళ్ళలోంచి కనుపాపలు లీలగా కదులుతున్నాయి.

లక్ష్మి గాబరాపడిపోయి "అయ్యో! ఇదేంటండీ!" అని అరిచింది. దాంతో బాలన్నకు తట్టి లేపినట్లైంది. అతనూ కంగారుగా కళ్ళు నులుముకుంటూ "ఇప్పుడు నిద్రపోతున్నారా? మీరు నిద్రపోయిన వాలకం చూసి నేను ఆందోళనపడ్డాను" అన్న లక్ష్మి మాట

లకు సిగ్గుపడి,, "ఇవాళ మంచిరోజు కాదు" అనుకుని లేచి బాత్రూంకు వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చి భోజనానికి కూచున్నాడు.

భోజనాలు ముగించి వరండాలో కూచుని అంతవరకూ విప్పకుండా వున్న దినపత్రికల్ని తీసి, 'దినసుద్ది'ని చేతిలోకి తీసుకుంటూ పేజీలు తిరగేస్తుంటే బయట మెల్లగా తలుపులు తడుతున్న చప్పుడైంది.



బాలన్న చిన్నగా 'ఎవరూ?' అన్నాడు. ప్రత్యుత్తరంగా "లక్ష్మి అమ్మగారు లేరా?" అన్న ఆడగొంతుక వినిపించింది.

"ఉన్నారు రండి! తలుపులకు గడియ వేసిలేదు" అన్నాడు బాలన్న కూచున్నచోటి నుంచే. తలుపులు కిర్రుమన్నాయి. ఎదురుగా పరిచితముఖం. ఖచ్చితంగా చూసిన గుర్తుంది. పేరు తెలీదు. చుట్టుపక్కల వున్నవాళ్ళ గుమ్మం తొక్కితేకదా తనకు ఇతరులు తెలిసేది! రంగయ్య వీధిలో అతను తామరాకు మీది నీటిబొట్టులా వుంటున్నాడు. ఇప్పుడతనికి ఆ వచ్చినావిడ ఎవరు? ఏమిటి? అన్న ఆసక్తి కూడా లేదు.

"లక్ష్మి! చూడు, ఎవరు వచ్చారో" అన్నాడు మెల్లగా.



వస్తున్నానంటూ ఆమె వూకొట్టడానికి ముందే ఎలాంటి సంకోచమూ లేకుండా ఓ స్త్రీ లోనికొచ్చింది.

వస్తూనే, "నాపేరు వెంకటమ్మ'' అంది. లక్ష్మి ఆమెని చూసి, "ఇంత తొందరగా మీ వంట అయిందా?" అంది.

లక్ష్మి మాటల్ని లెక్కకు తీసుకోనట్లే వెంకటమ్మ అమాంతం లక్ష్మిమీద పడి దుఃఖాన్ని దిగమింగుతూ వెక్కసాగింది. కంగారుపడ్డ లక్ష్మి, "ఏమైంది వెంకటమ్మా? నాదగ్గర దాపరికమేమిటి? చెప్పండి'' అనగానే వెంకటమ్మ ఏం చెబుతుందా అని ఆసక్తిగా బాలన్న తన చెవులొగ్గాడు.

వెంకటమ్మ వణుకుతున్న స్వరంతో అంది. "మావారిని ఆస్పత్రిలో చేర్చారట. ఇప్పుడే బ్యాంకునుండి ఓ జవాను వచ్చి చెప్పివెళ్ళాడు. మొన్న అనగా బయటికి వెళ్ళిన గీత ఇప్పటికీ తిరిగిరాలేదు. నాకు ఈ ఆస్పత్రులచుట్టూ తిరిగిన అనుభవంలేదు. గీత ఉంటే దాంతోపాటు వెళ్ళేదాన్ని! ఇప్పుడు మీరేదిక్కు''

వెంకటమ్మను లక్ష్మి ఓదారుస్తూ, "బాధపడకండి! నేనూ వస్తాను మీతో'' అంది. తర్వాత "రాఘవేంద్రరావుకి ఏమైందింతకీ?" అనడిగింది కుతూహలంగా.

బాలన్నకు ఈవిడ తనను పొద్దుట నిర్లక్ష్యం చేసిన పక్కింటి రాఘవేంద్రరావు భార్య అని తెలిసింది. వాళ్ళకి ఓ కూతురుందన్న విషయమూ అప్పుడే తెలిసింది. రావుకి ఏమైందోనన్న మానవ సహజమైన ఆత్రుతకి బాలన్న కూడా లోనై ఉన్నపళాన లోపలికొచ్చి "లక్ష్మి! ఏంటిట?" అన్నాడు.

"నేనూ అదే అడుగుతున్నాను'' అంటూ వెంకటమ్మ ముఖంలోకి చూసింది లక్ష్మి. వెంకటమ్మ పొంగిపొరలి వస్తోన్న దుఃఖాన్ని ఆపుకుని, "మావారికి బి.పి., డయబెటిస్ అన్నీ వున్నాయి. వద్దంటున్నా పూజ చేసుకుని ఈ వాసనలో తిండి తినడం ఎలాగని పరగడుపునే బ్యాంకుకు వెళ్ళిపోయారు. ఆస్పత్రిలో అడ్మిట్ చేశామని ఓ మనిషిని బ్యాంక్ మేనేజర్ పంపించారు. విజయ క్లినిక్ అట!" అంది.

వ్యాధి ఏమైవుంటుందని ముగ్గురూ ఒక్కో రీతి ఆలోచించారు. బాలన్న "మీరిద్దరూ రిక్షాలో రండి! నేను ఈక్షణమే బయల్దేరుతున్నాను'' అన్నాడు.

వెంకటమ్మకు ఊరట కలిగింది. బాలన్న అంత తొందరగా కరిగిపోతాడని ఆమె అనుకోలా. లక్ష్మితోనూ, ఆమె అత్తగారితోనూ ఆమెకున్న పరిచయం అంతంతే! పైగా జర్నలిస్టులంటే గర్వపోతులు అనుకుంది.

ఆమె కృతజ్ఞతాభావంతో "మీది పెద్దమనసు. దేవుడు మేలుచేస్తాడు'' అంది.

బాలన్న ఈ ఆశీర్వాదంకోసం ఎదురుచూళేదు. దాంతో ఉల్లాసమూ పొందలేదు. దేవుడి ఉనికిమీదే అనుమానమున్న అతనికి తక్షణం విజయ క్లినిక్‌కు వెళ్ళడం ప్రధానమనిపించి లూనా స్టార్టుచేశాడు.

బాలన్న విజయ క్లినిక్‌కు వచ్చి రాఘవేంద్రరావుగురించి అడిగాడు. అతనికి గుండెపోటు అనీ, ఇంటెన్సివ్ కేర్‌యూనిట్‌లో వున్నారనీ, దగ్గరి సంబంధీకుల్ని మాత్రమే కలవడానికి అనుమతిస్తున్నారనీ తెలిసింది. బాలన్న తను దగ్గరివాణ్ణి అనడానికి మనసురాలేదు. అలా అని చూడకుండా తిరుగుముఖం పట్టేందుకూ మనసొప్పలేదు. ఆస్పత్రి కారిడార్‌లో పచార్లు చేస్తుంటే రిక్షాలో వెంకటమ్మ, లక్ష్మి రావడం కన్పించింది. లక్ష్మిని దగ్గరికి పిలిచి విషయమంతా వివరించాడు బాలన్న. "అలాగా? పాపం!" అంది ముఖం వేలాడేసుకుని లక్ష్మి. వెంకటమ్మను సిస్టర్లు "మీరు డిస్టర్బ్ చేయకుండావుంటే ఆయన్ని చూడొచ్చు'' అంటూ రావు ఉన్న గదివేపు తీసుకువెళ్ళారు.

అంతలో బర్రున వచ్చిన కారులోంచి ఓ జంట దిగారు. వాళ్ళని చూసి లక్ష్మి పలక




రింపుగా నవ్వింది. ఆ స్త్రీ వచ్చి లక్ష్మిపక్కన నుంచుని, "మాకిప్పుడే తెలిసింది. ఎలావున్నారట?" అంది.

లక్ష్మి ఆమెతో విషయం చెప్పి బాలన్నతో, "ఈమె సుమతి అని వెంకటమ్మకు స్వయాన చెల్లి. అతను నరహరిరావు అని ఈమె భర్త' అని పరిచయంచేసి, వారికి తన భర్తను పరిచయంచేసింది. బాలన్న నరహరిరావు ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు.

"మిమ్మల్ని లోపలికి అనుమతించడం కష్టం" అన్నాడు బాలన్న.

"ఇలా అవుతుందని తెలిస్తే నేను ఫోన్ చేసేవాణ్ణి కాదు'' అన్నాడు నరహరిరావు తను తప్పుచేశానన్నట్టు.

ఫోన్‌చేసిన విషయమేమిటి అని అడగాలా వద్దా అనే మీమాంసకు లోనైన బాలన్న చివరికి "విషయమేంటి?" అన్నాడు మెల్లిగా.

నరహరిరావు చెప్పాలా వద్దా అనే గుంజాటనకు గురై బాలన్న రాఘవేంద్రరావుకు దగ్గరి మిత్రుడైవుంటాడనుకుని బాలన్నను తన కారు దగ్గరికి పిల్చుకువెళ్ళి, "రాఘవేంద్రరావు కూతురు గీత వుందే? ఆమెవల్లే ఇదంతా..." అని అర్థోక్తిలో ఆపాడు.

బాలన్న ముఖంలో ఎలాంటి భావాలూ లేకుండా మౌనంగా వుండిపోయాడు.

నరహరిరావు కొనసాగించాడు "మా షడ్రకుడు రాఘవేంద్రరావు సంప్రదాయవాది అని మీకూ తెలుసుకదా! కాని ఆమె చూడండి... అదే గీత... ఎంతో రాడికల్'

బాలన్న ఏమీ అనలా, అతనికీ విషయంలో ఏమీ తెలీకపోవటంతో. కాని నరహరిరావు బాలన్నకు అన్నీ తెలుసుననే భ్రమతో చెప్పసాగాడు.

"గీత ఓ కురుమవాళ్ళ అబ్బాయిని ప్రేమిస్తోంది. పెళ్ళంటూ చేసుకుంటే అతన్నే అని చెప్పేసింది. ఇది మా రెండు కుటుంబాలకు మాత్రమే తెలుసు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ పెళ్ళి సాధ్యంకాదనుకున్నాడు మా షడ్రకుడు. కాని మొన్న మా యింటికని తల్లిదండ్రులతో చెప్పి బయల్దేరిన గీత ఆ కురుమ అబ్బాయితో బెంగుళూరుకు వెళ్ళిపోయి అక్కణ్నించి ఇవాళ పొద్దుట మా ఆఫీసుకు ఫోన్‌చేసింది. నేను ఎల్.ఐ.సి.లో పనిచేస్తాను. ఏంచేయాలో పాలుపోలా. ఇంటికొచ్చి మా ఆవిడతో చెప్పాను. అక్కబావలతో చెప్పకపోతే తప్పవుతుంది, నెమ్మదిగా చెప్పండి అంది ఆమె. సాయంత్రం మా షడ్రకుని ఇంటికొచ్చి చెప్పడమే మంచిదనుకున్నాను. అప్పటిగ్గాని మీ వీధి వాసన విషయం తెలియలేదు. ఇక ఈ గొడవంతా దేనికని ఫోన్‌చేసి విషయం చెప్పాను. అతను నిర్లిప్తంగా ఊఁకొట్టినట్టు అన్పించింది. 'సీరియస్‌గా తీసుకోకండి. సమాజంలో ఇవన్నీ మామూలే అన్నాన్నేను. అవునవును అన్నారు చిన్నగా. సాయంత్రం ఇంటికి రమ్మని చెప్పాను. వస్తానన్నారు. ఓ గంట తర్వాత గుండెపోటు అనీ, ఆఫీసులోనే పడిపోయారనీ మాకిప్పుడే ఫోన్ వచ్చింది''

నరహరిరావు అలా చెప్పి ఆపేశాడు.

బాలన్నకు ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. వెరీ బ్యాడ్ అనుకున్నాడు మనసులోనే.

గీత వెళ్ళిపోవడం గురించే బాలన్నకు కూడా సదభిప్రాయం లేదనుకుని నరహరిరావు "కాలం చాలా చెడిపోయింది సార్! ఇలా చేస్తుందని నేనూ వూహించలేదు. మా షడ్రకుడికి ఆమె ఒక్కర్తే సంతానం. ఈ బాధని అతనెలా భరిస్తాడు చెప్పండి'' అన్నాడు.

'మనం పొరబడేది ఇక్కడే. కులం అనేదానికి అర్థమేలేదు' అనబోయిన బాలన్న అలా అనలేక, "ఇదంతా పూర్తి వ్యక్తిగత విషయం. దీన్ని ఎంతో లైట్‌గానూ, సీరియస్‌గానూ కూడా తీసుకోవచ్చు. కాని మన రావుమాత్రం మీరన్నట్టు..."

"అవును నేనూ అదేకదా అనేది'' అన్నాడు నరహరిరావు.

"పొద్దుట్నించీ ఈ వాసనతో తలనొప్పిగా

వుంది. వెళ్ళొస్తాను'' అంటూ లక్ష్మిని తీసుకుని తిరుగుముఖం పట్టాడు బాలన్న.



రంగయ్య వీధి చెత్తకుండీ తరలింపు తర్వాత ఓ రెండ్రోజులు ఏమీ జరగనట్టు నిశ్చలమైన నీటిలా వుంది వాతావరణం. కాని మూడోరోజునే వీధిలో వున్న ప్రతి ఇంట్లోనూ ఆడవాళ్ళకు ఓ పెద్ద సమస్య ఎదురైంది.

తరలించబడ్డ చెత్తకుండీ వాపస్‌రాలేదు. పోనీ దానికి బదులు వేరొక చెత్తకుండీనైనా మునిసిపాలిటీవాళ్ళు తేలేదు. ఇంట్లో మగాళ్ళు మాత్రం తమకూ, దీనికి సంబంధం ఏమీ లేనట్టు తమపనుల్లో లీనమైవున్నారు. స్త్రీలుమాత్రం రోజూ ఇంట్లోంచి బయట పారబోయాల్సిన చెత్తాచెదారాన్ని ఎత్తి ఎక్కడ పోయడమనే ఆదుర్దాకు లోనయ్యారు. దుమ్ము, ధూళి అంటే వీధిలో పారబోయవచ్చు. మరీ పెద్దపెద్ద వ్యర్థపదార్థాల్ని సరాసరి వీధిలో పోయాలంటే ఎలా? మరొకరి ఇంటిముందు పోస్తే అది మరో ఇబ్బంది. అందుకని వీధిలోని మహిళాలోకం మరోమారు తమ భర్తల్ని నిలదీయడం ప్రారంభించింది.

"ఈ చెత్తని మేమెక్కడ పారబోయాలి? మీరింత పట్టనట్టుంటే మేమేంచేయడం?" అంటూ మొదలయింది దండకం.

బాలన్నకూ ఈ సమస్య ఎదురైంది. అతను భార్యదృష్టిని చెత్తమీంచి మరోవైపు మళ్ళించడానికి ప్రయత్నించాడుగానీ ఆమె వదిలితేకదా! "మీరు చెత్తకుండీని తరలించడానికి వెళ్ళినవాళ్ళలో మొదటివారు. ఇప్పుడు వేరొక చెత్తకుండీని ఏర్పాటుచేసే బాధ్యత మీకు లేదంటే ఎలా?" అని నిలదీసిందామె.

బాలన్న భార్యమొహం చూసి తల దించుకుని, "అలాగా? అందరికి ఏదో ఉపకారం చేద్దామని నేను బయల్దేరాను. కాని ఈ జనం ఆ పని సి.ఎమ్.గారివల్లనే అయిందని జేజేలు పలికింది. ఇప్పుడు ఆ జనం సి.ఎమ్.తోనే కొత్తకుండీని తెప్పించుకోనీ'' అన్నాడు.

"అది నిజమే కావచ్చు. కాని జేజేలు పలికినవాళ్ళలో చాలామంది మన వీధివాళ్ళు కానేకాదు. కిరాయిజనం అంటున్నారంతా. ఏది ఏమైనప్పటికీ మీరిప్పుడు శ్రద్ధవహించకపోతే మనింటి చెత్తని నేను నెత్తిన పోసుకోవాల్సిందే!"

బాలన్న ఆలోచనలోపడ్డాడు. ఇప్పుడు చెత్తకుండీ కావాలి. వెంటనే పెట్టించండి అంటూ మళ్ళీ చెంగల్రావుకాళ్ళు పట్టుకోవాలి. అతను మళ్ళీ చట్టానికి సంబంధించిన మెలికలు ఎన్నెన్ని పెడతాడో? అదీగాక కంపుతో ఉన్న చెత్తకుండీని ఎత్తి లారీలో తరలించడం, దాన్ని డ్రైవరు మున్సిపాలిటీ ఆఫీసుముందు ఆపేసి చెంగల్రావును రెచ్చగొట్టడం... అన్నీ ఎస్.ఐ.గారు బాలన్నకు చెప్పివున్నాడు. బాలన్నకూ అప్పుడు విపరీతమైన నవ్వొచ్చిందిగానీ ఇప్పుడు నవ్వుకుబదులు ఏడుపు వచ్చేట్లుంది పరిస్థితి.

బాలన్న ఏం చేయడమా అని ఆలోచించాడు. ప్రతి యింటి యజమాని పరిస్థితీ యిలాంటిదే అని అతను అంచనావేశాడు. ఆఫీస్‌కు వెళ్ళిన వరదరాజులు, అశోక్, పాండురంగయ్య, నారాయణ... అందరికీ ఇదే అవస్థ. ఒక్కొక్కరి తలలో ఒక్కోరకమైన కోపం. 'ఆ చెత్తకుండీ మరో రెండ్రోజులుంటే ఏం మునిగిపోయేది! వాసన దానికదే తగ్గిపోయేది!' అన్నది పాండురంగయ్య అభిప్రాయమైతే, బాలన్న ఈ వీధిలోనే నివశించేవాడన్న





విషయం రుజువైందని అనుకున్నాడు అశోక్. సి.ఎమ్.లాంటివాళ్ళు ఈ వీధిని ఓరోజు కాకుంటే మరోరోజైనా చెడగొట్టి తీరుతారు అనుకున్నాడు వరదరాజులు. ఊరన్నప్పుడు మురికివాడా వుంటుంది అన్నాడు పాండురంగయ్య ఇవన్నీ మామూలే అన్నట్టు. ఆవిధంగా వీళ్ళందరూ తమతమ భార్యలముందు ఏం చెయ్యలేని అర్భకుల్లా చేతులు కట్టుకుని మౌనంగా వుండిపోయారు.

శివయ్య మూడోరోజు మధ్యాహ్నం ఆస్పత్రినుంచి ఇంటికొచ్చాడు. అతని ఎడంచెయ్యి విరిగింది. ప్లాస్టర్ వేయించుకుని ఆ చెయ్యి మెడకు వేలాడేసుకుని అతను ఇంట్లో ప్రవేశించేసరికి, నర్సమ్మ ఇల్లంతా నిండిపోయిన మూన్నాళ్ళ చెత్తని ఎక్కడ పారబోయడమా అని నెత్తికి చేతులు పెట్టి కూచునివుంది. శివయ్యకు విపరీతమైన కోపం వచ్చింది. అయితే అది ఎవరిమీదో అతనికే తెలియలేదు. బాలన్నమీదా? ఛ, ఛా! అతనిదేమీ తప్పులేదు. చెంగల్రావుమీదా? ఊహూ! మరి తనమీదేనా? తనకెందుకీ వాసన గొడవ అనుకుంటూ తన మీద తనే కోపంతో గొణుక్కున్నాడు.

నర్సమ్మ తన మగని గొణుగుళ్ళూ, సణుగుళ్ళు విని "మీకిప్పుడు శనిబాధ వుందేమో! ఓమారు జాతకం చూసుకోండి'' అంది.

"పక్కింట్లో బాలన్న వున్నాడేమో చూసిరా'' అన్నాడు.

నర్సమ్మ ఎందుకని అడక్క వెళ్ళి బాలన్న ఇంటి తలుపులు తట్టింది.

తలుపులు తీసిన లక్ష్మి "ఓ... మీరా? రండి. రండి'' అంది.

నర్సమ్మ "పొయ్యిమీద చారు పెట్టి వచ్చాను. తీరికలేదు. మావారు ఆస్పత్రినుంచి వస్తూనే మీవారుంటే ఓసారి వచ్చి కలవమన్నారు'' అంది.

ఆ మాట విన్న బాలన్న, "ఓ... శివయ్యగారు వచ్చారా?" అంటూనే నర్సమ్మను అనుసరించాడు.

శివయ్య 'రండి' అన్నాడు అంత దురవస్థలోనూ ఉత్సాహంతో.

"ఇలా కాకుండా వుంటే బావుండేది!" అని రెండుమూడుసార్లు అన్న బాలన్న చెత్తకుండీ లేకపోవడంవల్ల ఉత్పన్నమైన సమస్యలగురించి ఏకరువు పెట్టాడు. శివయ్య "ఆ విషయంకోసమే నేను మిమ్మల్ని పిలిపించాను'' అంటూ ఏంచేద్దామన్నట్టు బాలన్నముఖంలోకి చూశాడు.

"మనమంతా మున్సిపాలిటీకి ఓ రిప్రజెంటేషన్ ఇవ్వడం మంచిది. కాదంటే మన కౌన్సిలర్ కొండయ్యగారికయినా ఫరవాలేదు'' అన్నాడు బాలన్న.

"అదే నేనూ చెప్పేది. కాని ఈసారి దీనికి నాయకుడెవరు?"

"నాకైతే వద్దు''

అంతలో తలుపులు తట్టిన చప్పుడు.

శివయ్య తలుపులు తీస్తే కొట్టు యజమాని వెంకటేశ్.

లోపలికి రండని పిలవడానికి శివయ్యకు సిగ్గూ, భయమూ... కలిగాయి. తను వెళ్ళి మొన్న కొట్టు వెంటనే తెరవమని బలవంతపెట్టినా అది లాభసాటి కాలేదన్న కోపం వెంకటేశ్‌లో ఇంకా వుండివుండవచ్చు.

అయితే వెంకటేశ్ అదేమీ లేనట్టు నేరుగా లోనికొస్తూనే, "మిమ్మల్ని, బాలన్నగారినీ శ్రీవాత్సవగారి భార్య రమ్మంటోంది. ఆమే నా కొట్టుదాకా వచ్చి 'ఓ ఉపకారం చేస్తారా' అంది సరే అన్నాను'' అని చెప్పాడు.

"ఎందుకు?" శివయ్య ప్రశ్నించాడు.

"తెలీదు. ఆమె చెప్పిందింతే! నేను ఎందుకని అడగలేదు. ఆమె కూడా చెప్పలేదు''

"వస్తున్నామని చెప్పు'' అన్నాడు బాలన్న. వెంకటేశ్ వెళ్ళిపోయాడు. శివయ్య "ఎలాంటావిడో ఏమిటో?" అన్నాడు కాస్త భయపడుతున్నట్టుగా.

"ఎలాంటిమనిషి అయితే మనకేంటి?".

లోపల్లోపల భయమున్నా పైకి కన్పించనివ్వ కుండా అన్నాడు బాలన్న.

"అయితే పదండి'' అన్నాడు శివయ్య.

"భోజనం చేయకుండా వెళ్తున్నారా? తిని వెళ్ళండి'' అంది నర్సమ్మ.

ఇద్దరూ భోజనాలు ముగించి శ్రీవాత్సవ గారి ఇంటివైపు నడిచారు. శ్రీవాత్సవగారి శ్రీమతి ఎందుకని పిలిచివుంటుందని ఆలోచి స్తూ సాగిపోతున్నారిద్దరూ. శ్రీవాత్సవగారు ఇంకా వచ్చి ఉండకపోవచ్చు, వచ్చి ఉండవ చ్చు అని బాలన్న ఆలోచిస్తోంటే, తమ ఇద్దరి మీదా ఆరోపణలు చెయ్యడానికే పిలిపిస్తోందని శివయ్య అధైర్యపడసాగాడు.

బాలన్న కాలింగ్‌బెల్ నొక్కాడు.

నెమ్మదిగా తలుపులు తెరుచుకున్నాయి. మాలతి రెండు చేతులు జోడించి "నమస్తే'' అని చిరునవ్వు నవ్వుతూ ఇద్దర్నీ లోపలికి పిలిచి కుర్చీలు చూపించి "కూర్చోండి'' అంది మెల్లిగా.

బాలన్న గంభీరముద్ర దాల్చాడు. శివయ్య భయపడుతూ ముడుచుక్కూచున్నాడు.

మాలతి "నేను మాలతిని. శ్రీవాత్సవగారి శ్రీమతిని. మీలో బాలన్న ఎవరు? శివయ్య ఎవరు?" అంటూ ప్రారంభించింది.

ఇద్దరూ తమతమ పరిచయాలు చెప్పుకు న్నారు.

మాలతి "థాంక్స్'' అంటూనే "కాస్త కాఫీ తీసుకుంటారా?" అంది మర్యాదగా.

"వద్దు ఇందాకే భోజనాలు చేసి వచ్చాం. మీరు రమ్మన్నారటకదా?" బాలన్న అన్నాడు.

"ఔను. మీరిద్దరూ ఈ వీధిలోని చెత్తకుండి దుర్వాసన పరిష్కారంకోసం పడ్డ పాట్లన్నీ విన్నాను. అఫ్‌కోర్స్... దీనికంతటికీ పరోక్షకా రణం నేనే. మావారికి డస్ట్ ఎలర్జీ అని మీకు తెలిసుండొచ్చు. అందుకే ఈ చెత్తకుండీని ఇక్కణ్ణించి ఎత్తేయండని వారే మున్సిపాల్టీకి నివేదించారు. కాని అది ఇలా అవుతుందని మేం వూహించలేదు. ఇప్పుడేమైందంటే ఈ మూణ్రోజుల్నించి మా ఇంటి చెత్త పారబో సేందుకు ఈ వీధిలో చెత్తకుండీ అనేది లేకుండా పోయింది. మళ్ళీ మన వీధికి అది రావాలంటే మీ సాయం కావాలని పిలిపించాను... క్షమించండి!"

బాలన్న డంగైపోయాడు. ఏం మాట్లాడాలో తోచలేదు. శివయ్య "ఓహోహో! దానికేం భాగ్యంలెండి'' అన్నాడు వుబ్బిపోతూ.

బాలన్న నింపాదిగా దుర్వాసన తతంగ మంతా వివరించి చెప్పాడు.

"ఇలా అవుతుందని నేననుకోలేదు. మావా రికి విషయం తెలిస్తే చాలా బాధపడతారు. ఇలాంటి విషయాల్లో ఆయన చాలా సెన్సి టివ్. రేపు వస్తారు మావారు. అంతకన్నా ముందు మన వీధికి చెత్తకుండీ మళ్ళీ ఏర్పా టుకాలేదంటే ఎంత చెలరేగిపోతారో చెప్పలేం. నిజానికి చెత్తకుండీ స్థానచలనానికి ఆయన ఒప్పుకోలేదు. ఆయన ఎలర్జీతో బాధపడడం చూసి నేనే చెత్తకుండీ మా ఇంటిదగ్గర వుండరా దని నిర్ణయించుకున్నాను. ఆ తర్వాతి విషయా లన్నీ మీకు తెల్సినవేకదా? అందుకని మీరే నాకిప్పుడు హెల్ప్‌చేయాలి''

మేడం మాలతిగారి మాటలు విని బాల న్నకు జాలి కలిగింది. శివయ్య, "చెత్తకుండీ లేక మా ఆడాళ్ళంతా ధుమధుమలాడుతున్నా రు. దీనికి ఏదో ఓ పరిష్కారం కనిపెట్టాలని మేమూ అనుకున్నాం. కాని మళ్ళీ మీ ఇంటి ముందుకు చెత్తకుండి రాకూడదుగదా!" అన్నా డు.

మాలతి "ఊఁ"అంది.

"కాని అందుకు జనం ఒప్పుకోవాలికదా?" బాలన్న అడిగాడు.

"మీరు చెబితే ఒప్పుకుంటారు''

"నిజం చెప్పాలంటే నాకీ వీధిలో ఎవ్వరూ పరిచితులు కారు. శివయ్యగారి విషయం అలాకాదు. పేపరు కుర్రాడిలా అందరి ఇళ్ళూ పరిచయం. అతను సమ్మతిస్తే నా అభ్యంత




రంలేదు''

శివయ్య ఏం మాట్లాడాలా అని ఆలోచి స్తుండగానే పెద్దగా చప్పుడు చేస్తూ మున్సిపా లిటీ లారీ ఎకాఎకి రంగయ్య వీధిలోకి దూసు కొచ్చింది.

కుతూహలంతో బాలన్న, శివయ్యలు తల అటువైపు తిప్పారు. మాలతి లేచి కిటికీ దగ్గరికొచ్చి నించుంది.

ఆ మున్సిపాలిటివారిలోంచి నల్గురు కూలీ లు నిదానంగా ఓ చెత్తకుండీని దించారు. మొన్న స్థానచలనానికి గురైన స్థలం పక్కనే శ్రీనివాసయ్య ఇంటిముందు వాళ్ళా చెత్త కుండీని వుంచి క్షణాల్లో మాయమయ్యారు లారీతోసహా.

బాలన్న, శివయ్యలు నోళ్ళు వెళ్ళబెట్టారు గానీ మాలతిమాత్రం ఈ మార్పుతో మహదా నందంగా వుంది.

మళ్ళీ ఎవరు మాటలు కదపాలి అని ఆలోచిస్తూండగానే మాలతి అంది, "దయచేసి మీరు మళ్ళీ చెత్తకుండి వ్యవహారంలో జోక్యం చేసుకోకండి''

"చూద్దాం!" అంటూనే బాలన్న లేచాడు.

శివయ్య "మంచిది మేడం" అన్నాడు.

ఇద్దరూ శ్రీవాత్సవగారి ఇంటినుంచి వీధి లోకి వచ్చేదాకా వారిని సాగనంపి మాలతి తలుపులు వేసుకుంది.

బాలన్న శివయ్యతో అన్నాడు, "పెద్ద ఘటి కురాలే! మనల్ని ఇంటికి పిలిపించిన ఉద్దేశ్యం ఏమిటో మీకిప్పటికైనా అర్థమైందా?" అన్నా డు.

"ఎందుక్కాదు? ఆమే చెప్పేసిందికదా? దయచేసి జోక్యం చేసుకోకండి అందికదా?"

బాలన్న శివయ్యతో చిన్నగా చెప్పాడు, "లోగుట్టు పెరుమాళ్ళుకెరుక అన్నట్టు ఆమె మాటల ఆంతర్యం వేరు శివయ్యగారూ! మీరేం చేసినా వదిలేది లేదనే ఛాలెంజి ఇది. మనమీ విషయంలో ఎంత సీరియస్‌గా వున్నామో మన మాటలకి ఎంత విలు వుందో... అన్నీ ఆమె అప్పటికే సేకరించి పెట్టుకుంది. ఇంక నా జోలికీ, ఆ చెత్త జోలికీ రాకండి అన్న హెచ్చరిక వుంది ఆ మాటల్లో''

"ఇంపాజిబుల్, ఇంపాజిబుల్" అన్నాడు శివయ్య బాలన్న మాటల్ని ఖండిస్తూ.

"మీరెందుకు సీరియస్ అవుతున్నారు బాల న్నగారూ? నా అభిప్రాయం ప్రకారం ఆమె చాలా సింపుల్ స్త్రీ. నిజం చెప్పాలంటే ఆమె మనిద్దరినీ చూసి బాగా బెదిరిపోయింది''

అతనితో మాట్లాడి లాభంలేదనుకున్న బా లన్న ఇంటికి వెళ్ళిపోదామనుకుంటున్నప్పుడు కొట్టు యజమాని వెంకటేశ్ "ఇటువైపు రానేరా రు కదా సార్? మేడం ఏమంది?" అని ఆహ్వానించాడు ఇద్దర్నీ.

బాలన్నకు ఇష్టంగా లేకున్నా శివయ్య బలవంతంమీద కొట్టుదాకా వచ్చి ఓ సిగరెట్టు పట్టాడు. శివయ్య మాలతి తమకు ఎంత గౌరవం ఇచ్చిందీ, ఎంత ప్రాధేయపడిందీ... అన్నీ రంగురంగుల్లో వెంకటేశ్ వివరించసాగా డు. బాలన్నకు ఇబ్బందిగావుంది. అక్కడ వుండలేక

"మీరు మాట్లాడుతూ వుండండి. నాకు పేటలో కాస్త పనుంది'' అంటూ ముందుకి కదిలాడు.

బాలన్న ఇంటికి వెళ్ళి కాఫీ తాగి లూనా ఎక్కి మళ్ళీ పేటవైపు బయలుదేరి వెంకటేశ్ కొట్టుముందరికి వెళ్ళేసరికి, శివయ్య వెంక టేష్ ఏదో చెబుతుంటే మహా ఆసక్తిగా వింటు న్నాడు. 'భోళాశంకరుడు ఈ శివయ్య' అని మనసులోనే అనుకుని నవ్వుకున్నాడు బాల న్న.

పని ముగించుకుని తిరిగొస్తూ ఎస్.ఐ. రామస్వామిని మాట్లాడించి వద్దామ న్పించింది బాలన్నకు. పోలీస్ స్టేషన్ ముందు లూనా ఆపి ఒక్కోమెట్టు ఎక్కుతుండగా రాఘ స్వామి పెద్దస్వరంతో ఎవరినో తిడుతున్నాడు. బాలన్నని చూడగానే రండని ఆహ్వానించి

...రు. మీకు ఓ పదినిముషా
...నుకుంటున్నాను. మీరే
...న్నాడు.

...తున్న ఆ మనిషివైపు
...టి కంప్లయింట్ మళ్ళీ
...క్కలో తోస్తాను జాగ్రత్త' అని మంద
లించి ఆసక్తిగా తనను గమనిస్తోన్న బాల
న్నతో, "ఇదంతా మాకు మామూలేలెండి!"
అని "ఏం విశేషాలు, మీ వీధిలో?" అన్నాడు.

బాలన్న - రెండ్రోజులుగా చెత్తకుండీ లేక ఆడాళ్ళు పడ్డ కష్టాలు, పెట్టిన శాపాలు, దీని పరిష్కారంకోసం ఏంచేయాలా అని తను చేసిన ఆలోచనలు, మాలతి తమను పిలిచి చెప్పిన మాటలు, ఆలోపు మున్సిపాలిటీవాళ్ళు చెత్తకుండీని తెచ్చి శ్రీనివాసయ్య ఇంటి ముందు స్థాపించడం, ఆసాంతం వివరించి "రెండురోజులు గమ్మున ఊరుకుండిపోయిన చెంగల్రావు ఉన్నట్టుండి మళ్ళీ చెత్తకుండీని ఎలా పంపించాడన్నదే చిదంబర రహస్యం" అన్నాడు.

ఎస్.ఐ. రామస్వామి మాట్లాడక చిన్నగా నవ్వాడు.

"మీకు బాగా తెలుసుంటుంది. ఏం జరిగిందో చెప్పండి'' అన్నాడు బాలన్న రామస్వామి మౌనాన్ని భంగపరుస్తూ.

"నాకు ప్రత్యేకించి ఏమీ తెలీదు. కాని నా ఖాకి డ్రెస్సు ఈమాత్రం చెబుతోంది. చెత్తకుండీ మళ్ళీ అక్కడికే రావడానికి కారణం సి.ఎమ్." అని రామస్వామి గంభీరంగా అన్నాడు.

"అదెలా?" బాలన్న ఆత్రుతగా అడిగాడు.

"దాన్నే రాజకీయం అంటారు. అతను మాలతికి ఫోన్‌చేసి చెత్తకుండి ప్రహసనం వెనకాల మీరు, శివయ్యలు వున్నారని చెప్పి వుండాలి. ఈ వ్యవహారం తన చేతులు దాటిపోయిందని ఆమెకి వివరించి ఆమె మీ ఇద్దర్ని ప్లీజ్‌చేసి మాట్లాడితే అన్నీ సర్దుకుంటాయని చెప్పివుండొచ్చు. మీ ఇద్దరూ కలిసి చెంగల్రావుమీద ఒత్తిడి తెచ్చి మళ్ళీ చెత్తకుండీని తెప్పించాలని సి.ఎమ్. అనుకొని ఉండవచ్చు. కాని ఎందుకో మళ్ళీ చెత్తకుండీ వల్ల మీ ఇద్దరికి పేరు రావడం ఇష్టంలేని సి.ఎమ్. ఆ ప్రయత్నంలోనే..."

బాలన్న రామస్వామి వాదాన్ని తోసిరాజని లేకపోతున్నాడు. ఈ చెత్తకుండీ ఎక్కడుంటే అతనికేం? దీంతో అతను సాధించేదేమిటి? అనేది ఎంత ఆలోచించినా బాలన్నకు అంతుపట్టడంలేదు. "ఊఁ! మున్ముందు ఏమవుతుందంటారు?" అన్నాడు.

"అది చెప్పడం కష్టం. కాని ఈ చెత్తకుండీ వ్యవహారం ఇంతలోనే ముగిసేలా లేదు. దీన్ని రావణకాష్టంలా రగిలిస్తేకాని సి.ఎమ్. తనకు వీధిలో విలువుండదని అనుకున్నట్టున్నాడు. ఇలాంటి ఓ అవకాశంకోసం అతను ఎప్పట్నించో ఎదురుచూస్తూ వుండాలి. అవకాశాలే మనిషిని రాజకీయ నాయకుడిగా చేస్తున్నాయి. రాజకీయ నాయకుడయ్యాక అన్నింటినీ అతను తనకు అనుకూలంగా ఉపయోగించుకుంటాడు. అవునా?" అన్నాడు రామస్వామి! తర్వాత తన డ్రాయరులోంచి ఆరోజు వచ్చిన ఓ ఉత్తరం తీసి "మీరు చదవాల్సిన ఉత్తరం" అన్నాడు.

"మీకు వచ్చిన ఉత్తరం నేను చదవటమా?" బాలన్న నిరాకరించాడు.

"పేపర్‌వాళ్ళు ఎవరి ఉత్తరాలైనా చదవొచ్చు, ఇచ్చేవాళ్ళుంటే'' అని నవ్వుతూ రామస్వామి "ఇది మిమ్మల్ని, నన్నూ ఉద్దేశించి రాసిందే'' అని పక్కున నవ్వాడు.

బాలన్న కుతూహలంతో ఉత్తరాన్ని తీసుకుని విప్పాడు. సీతాపురం రాజాజీనగర్‌హౌస్ ఆఫీసర్‌గారి సమక్షమునకు! రంగయ్య వీధిలోని ఓ అనామక వ్యక్తి - కాని భారతదేశ లా అండ్ ఆర్డర్‌మీద అపారనమ్మకంగల పౌరుడు వ్రాసుకొను విన్నపము ఏమనగా!

అయ్యా! రంగయ్యవీధిలో మొన్న జరిగిన దుర్వాసన వ్యవహారంలో మీరు లా అండ్ ఆర్డర్‌ను పాటించే అధికారులై వుండీ కర్తవ్య




లోపం చేశారు. మొదటిది మీరు చెత్తకుండీలో దుర్వాసన వేసే కుళ్ళిపోయిన ప్రాణి ఏమిట నేది చట్టప్రకారం ఎంక్వయిరీ చెయ్యలేదు. మీరు స్వయంగా వుండి చెయ్యవలసిన ఎంక్వయిరీ మీ పక్షాన వచ్చిన పోలీసులు నాటకీయంగా పరీక్షించారు రంగయ్యవీధిలో. మొన్నటివరకూ చచ్చినట్టు పడున్న బాలన్న అనే అనామక వ్యక్తి సమక్షంలో ఎంక్వయిరీ జరిపారు. బాలన్న, పోలీసులు... చెత్తకుండీలో దుర్వాసనకు కారణమైనది చచ్చిన కుక్కపిల్ల అని తప్పుడు రిపోర్టు ఇచ్చారు. వాస్తవానికి అందులో వుంది కుక్కపిల్ల శవంకాదు. ఐదా రు నెలల మానవపిండం. రెండవది - చెత్త కుండీలో వున్న దుర్వాసన వేసే వస్తువుని లారీలో తరలించడానికి మున్సిపాలిటీవాళ్ళ లారీ వచ్చినప్పుడు లారీలో వున్న కూలీల్ని కాదని లారీలో చెత్తకుండీని ఎక్కించేలా జనా న్ని ఆజ్ఞాపించడం. ఇది చట్టవిరుద్ధం. మున్సి పాలిటీ చెత్తకుండీని ప్రజల డబ్బుతో నిర్మించ డమైంది. దాన్ని నదీతీరంలో పడవేసినప్పుడు పచ్చడి పచ్చడైవుంటుంది. నేను ఈ దేశంలో బాధ్యతగల పౌరుణ్ని! అందువల్ల నేను ఈ నష్టాన్ని వ్యతిరేకిస్తున్నాను.

మున్సిపాలిటీ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ పోలీస్ రక్షణ కావాలనగానే మీరు అనుమతి ఇచ్చారు కాని స్వయంగా మీరు లారీతో రాలా. ఇది, కర్తవ్యలోపం. చెంగల్రావుగారు మీమీద ఇప్పటికే మీ పై అధికారులకు ఫిర్యా దుచేసి వుండవచ్చు.

"ఇంతకన్నా ముఖ్య విషయం ఏమంటే - రంగయ్య వీధిలోని బ్యాంకర్ రాఘవేంద్రరావు కూతురు గీత చెత్తకుండీ వ్యవహారానికి ఓ రోజు ముందు ఇంట్లోంచి పారిపోయింది. నిజానికి ఆమె పారిపోలేదు. ఆమె ప్రాణంతో వుందో లేదో అన్న అనుమానం ఉంది. ఆమె గర్భవతి అని తెల్సుకొన్న రావు కోపంతో ఆమెని తన్ని తగలేయగానే ఆమెకు గర్భ స్రావం జరిగిపోయింది. ఆ పిండాన్ని ఓ ప్లాస్టిక్ డబ్బాలో వేసి రావు భార్య అర్ధరాత్రి ఆ చెత్తకుండీలో పారేయడమే ఈ వాసనకు మూ లకారణం అని నా సందేహం.

గీతను ఈ వ్యవహారం మొదలవటానికి ముందురోజు సాయంత్రం ఆస్పత్రికి రావుగారే తీసుకెళ్ళారు. అదేరోజు రాత్రి ఆమె తన ప్రియుడితో వెళ్ళిపోయిందనేది వట్టి కట్టుకథ.

మీరు ఈ విషయంలో ఓ నెలలోపు నిజానిజాల్ని బహిర్గతం చేయకపోతే... మీ గురించి మళ్ళీ ఏవిధంగా కంప్లయింటు చే యాలో ఆ తర్వాత నిర్ణయించుకుంటాను

ఇట్లు
భవదీయుడు
పట్టువదలని విక్రమార్కుడు

బాలన్న ఉత్తరాన్ని మడిచి రామస్వామి చేతికిస్తూ గంభీరముద్ర వహించాడు.

రామస్వామి బాలన్న మౌనంగా వుండిపో వడం చూసి చిన్నగా నవ్వాడు.

బాలన్న "ఇందులో కూడా సి.ఎమ్. హస్త ముందంటారా?" అన్నాడు.

"ఎందుకుండరాదు?" రామస్వామి ప్ర శ్నించాడు.

"మీకిదో ఎలర్జీలా వుంది. రాజకీయ నాయ కులు అంటే మీ శాఖకు ఎంతో సన్నిహితులు. మాకు చాలా దూరం. మీరు మావైపు రావాల్సి నవాళ్ళు! పొరపాటున పోలీసుశాఖలో వున్నా రు'' అన్నాడు ఆసక్తికరంగా.

రామస్వామి ఆ మాటలు ఖాతరు చేయక, "మాకిలాంటి ఆకాశరామన్న ఉత్తరాలు అనేకం వస్తుంటాయి. వీటిల్లో కొన్ని నిజాలు, మరికొన్ని అసత్యాలు. అఫ్‌కోర్స్... రావు కూతురు ఇప్పుడు వాళ్ళింట్లో లేదన్నది నిజమే నా?" అన్నాడు.

"ఎవరో ఓ అబ్బాయితో ఆ అమ్మాయి వెళ్ళిపోయిందని మా వీధిలో పుకారు. ఈ విచారంతోనే రావుకి గుండెపోటు వచ్చి ఆస్ప త్రిపాలయ్యారు''

బాలన్న తనకు తెలిసినదాన్ని చెప్పాడు.

రామస్వామి అన్నీ విన్నాక నిదానంగా "మీ వీధి దుర్వాసన వ్యవహారంలో ఈ విక్రమార్కుడి హస్తం కూడా వుంది. గీతకు గర్భస్రావమై ఆ పిండంతో ఇంత వాసన వస్తుందంటే నేనూ నమ్మలేను'' అన్నాడు.

"ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ నానదంటారు. ఒకవేళ ఆ అమ్మాయి తాలూకు పిండమే అయితే అది మా ఆవిడకి తెలిసివుండాలి. మా ఆవిడ నాకు చెప్పలేదంటే అది పుకారనే అనుకోవాలి''

"ఈ విషయం మనమధ్యే వుండనీయండి. ఇన్వెస్టిగేషన్ చేయకపోయినా నిజం నిలకడ మీద తేలుతుంది'' అన్నాడు రామస్వామి ఈ వ్యవహారాన్ని ఆపుదామన్నట్టుగా.

బాలన్నకూ ఉత్తరం చదివి బుర్ర చెడిపోయింది. "సరే! వస్తాను'' అంటూ లేచాడు.

"ఓ.కే." అని రామస్వామి కుర్చీలోంచి లేచి సాగనంపాడు.

బాలన్న తన ఇంటికి వచ్చేటప్పటికి లక్ష్మి ఇంట్లోలేదు. పక్కింటికి తీరికవేళల్లో కబుర్లకు వెళ్ళడం ఆమెకి అలవాటని బాలన్నకు తెలుసు.

లక్ష్మి చీకటి పడుతుండగా మెల్లగా లోనికొచ్చి పత్రికల్లో తలదూర్చివున్న బాలన్నపక్కన కూచుంటూ అతని చేతుల్లోంచి పత్రికల్ని లాగేసింది.

చాన్నాళ్ళుగా ఇలా తన దగ్గర కూచోని లక్ష్మి ఇప్పటి విచిత్ర ప్రవర్తన చూసి కనుబొమలు ఎగరేస్తూ కుతూహలంతో చూశాడు.

ఆ చూపులో ప్రశ్నార్థకాలు ఎన్నో వున్నాయి.

"గీత విషయం విన్నారా మీరు?" అంది ఏదో చాటభారతం విప్పబోతున్నట్టు.

"పారిపోయిందనేగా నువ్వు చెప్పబోయేది?" నిర్లిప్తంగా అన్నాడు.

"అదికాదు మళ్లీ..." అని ఆగిపోయింది.





"రావుగారెలా వున్నారో చెప్పు లక్ష్మీ! పారిపోయినావిడని పోనీ! ఆమె తనకిష్టమైన అబ్బాయితోనేకదా పోయింది. అందులో విశేషమేముంది''

"అది కాదండీ!" అంటూ రాగాలు తీసింది లక్ష్మి.

"అదీ నాకు తెలుసు. ఆమె పారిపోవడానికి ముందు గర్భవతి అనేకదా నువ్వు చెప్పేది!"

"అబ్బా మీ పేపర్‌వాళ్ళకు అన్నీ తెల్సిపోతాయనేది అబద్ధం కాదు. నాకు ఈరోజు తెలిస్తే మీకు నాకన్నా ముందే తెలుసంటే ఆశ్చర్యమేమరి!"

"తెల్సినా నీలా నేనెవరికీ చెప్పలేదు'' బాలన్న కావాలనే అన్నాడు.

"నేను మీకు తప్ప ఎవరికీ చెప్పలేదు. అన్నట్టు... మీకెలా తెలిసింది?"

"నీకెవరు చెప్పారో మొదట చెప్పు. తర్వాత నేను చెబుతాను''

కొడుకు, కోడలు ఇద్దరూ సరససల్లాపాల్లో మునిగిపోవడం చూసిన ముసలితల్లి, "బాలూ! మీ చర్చ ఏమిటి?" అంది ఆనందంగా.

"ఏమీ లేదమ్మా! మీ కోడలు రోజురోజుకీ చిన్నపిల్ల అవుతోంది చూడు'' అన్నాడు బాలన్న. అలాగే తల్లి దగ్గరికొచ్చి ఆమె పక్కన కూచుని "ఈ రెండుమూడ్రోజులు నువ్వు ఎలా వున్నావో తెల్సుకోలేదు. చెత్తకుండీ... చెత్తకుండీ అంటూ చచ్చినంత పనైందమ్మా!" అన్నాడు ఏదో తప్పుచేసినట్టు.

"కొంచెం కోలుకున్నట్టుగా వున్నాను'' అంది భాగీరథమ్మ ఉత్సాహంగా కొడుకు ముఖంలోకి చూసి.

"మొన్న నాలుగురోజులకిందట చచ్చిపోతానేమో అన్పించింది. కాని ఈ రెండుమూడ్రోజులనుంచి అలాంటి భయమేలేదు'' అంది.

"నువ్వు బతికితే నాకు సంతోషం కదమ్మా! అలాగే కానీ'' అన్నాడు బాలన్న. తన తల్లి వ్యాధిగ్రస్తురాలై ఎంతో యాతన అనుభవిస్తూ బతకాల్సి వస్తోందికదా అన్న బాధ అతని

హృదయమంతా ఆవరించింది.

భాగీరథమ్మ కొడుకుని తనివితీరా చూస్తూ, నేను బతికివుండి ఏం చేయగలను బాలూ? )కు ఖర్చు. నాకు యాతన. నా ఆశ ఒకటే... ?ేను బతికుండగా నువ్వు తండ్రివి కావడం ?ూడాలని. అది పూర్తయిందంటే చావడానికి )ప్పుడైనా సిద్ధమే!" అంది.

భాగీరథమ్మగారి ఈ మాట లక్ష్మిని మళ్ళీ కెలికినట్లయింది. తల్లీకొడుకుల సంభాషణ వింటూ ద్వారానికి ఒరిగి నించున్న లక్ష్మికి అత్తగారి ఆ మాట తనని గొడ్రాలు అన్నట్టు ధ్వనించి ఇంక అక్కడ వుండలేకపోయింది.

వంటింట్లోకి వెళ్ళి ఆమె పాత్రల్ని ఎత్తెత్తి పడేయడం గమనించిన బాలన్న తన భార్య మనసు గాయపడిందని తెల్సుకుని మౌనంగా తల్లిదగ్గర్నుంచి లేచి వంటింట్లో దూరాడు. లక్ష్మి బాలన్న వచ్చినట్టు తెలుసుకొని గమనించనట్టుగానే తన పనిలో నిమగ్నురాలయింది.

బాలన్న ఆమెని ఓదార్చేందుకు "గీత విషయం అప్పుడేదో చెప్పినట్టున్నావుకదూ!" అంటూ మాటల్లోకి దించి ఆమెకోపం ఉపశమింపచేయ ప్రయత్నించాడు.

లక్ష్మి "నాకు తెలీదు'' అంది ముక్తసరిగా.

రాత్రి పక్కన పడుకున్న లక్ష్మి తలని నిమురుతూ బాలన్న "రాఘవేంద్రరావు ఎలా వున్నాట్ట? తెల్సిందా?" ప్రశ్నించాడు.

"నాకెలా తెలుసు?" లక్ష్మి కోపంగానే జవాబిచ్చింది. బాలన్న తగ్గలేదు. భార్యని బాహులతల్లో చుట్టేస్తూ, "నేను పేటకు సంబంధించిన వార్తలన్నింటినీ పేపరుకు రాసేవాణ్నయితే, నువ్వు ఈ వీధిలోని కబుర్లన్నీ నాకు అందించేదానివికదా?" అన్నాడు.

ఆమె కరిగిపోయింది. "రావుగారు కోలుకున్నారట. ప్రాణాపాయం తప్పిందట. వెంకటమ్మ పగలు కలిసింది'' అంది.

"బతకనీ! పాపం ఆ కూతురి ప్రవర్తనతో ఎంత నొచ్చుకున్నారో!" అన్నాడు.

లక్ష్మి చీకట్లో మగని ముఖం తరచి చూడలేక కళ్ళు మూసుకునే 'కులం, దేవుడు, మతం... ఇవేవీ లేవనే మీరు... గీత చేసింది తప్పు అంటున్నారా?" అంది.

"ఎవరి వ్యక్తిత్వం వారిది. కాని గీత ఇంత సెన్సిటివ్‌గా పోవడం..."

ఓ నిముషంసేపు ఎవరూ మాట్లాడలేదు. తర్వాత లక్ష్మి "గీత పారిపోవడం గురించి ఈ వీధిలో ఎవ్వరూ సీరియస్‌గా తీసుకోలేదు. కాని చెత్తకుండిలో వాసన పుట్టించింది ఆమె పిండమే అని ఇప్పుడంతా పుకారు'' అంది క్షీణస్వరంతో.

"అదంతా అబద్ధం. రావు అంటే గిట్టనివాళ్ళెవరో పుట్టించిన పుకారు. ఎస్.ఐ. రామస్వామికి నీవన్నట్లుగానే ఓ ఉత్తరం వచ్చింది. నేనూ చదివాను''

"శివయ్యగారికి వెంకటేశ్ చెప్పాడట. అతనికెవరు చెప్పారని శివయ్య అడిగినా అతను చెప్పలేదట. కళ్ళారా చూసినవాళ్ళే చెప్పారని అన్నాడట వెంకటేశ్.

బాలన్న తను పేటకు వెళ్ళేటప్పుడు శివయ్య, వెంకటేశ్‌లు చర్చించుకోవడం గుర్తుకు తెచ్చుకున్నాడు. ఉత్తరంలో వున్న విషయంతో లక్ష్మి చెప్పిన అంశాల్ని బేరీజు వేశాడు. వెంకటేశ్ ఆ ఉత్తరం ఎందుకు రాసివుండకూడదు అనుకున్నాడు. అతని వెనుక ఇంకా ఎవరైనా ఉన్నారా? అతన్ని స్టేషన్‌కి పిలిపించి హడలగొడితే విషయాలన్నీ తెలిసిపోవచ్చు. రామస్వామికి ఈ విషయం చెప్పాలనుకున్నాడు. దాంతోపాటు వెంకటేశ్‌కన్న ముందే ఈ వీధిలో అగరొత్తుల బేరం చేసిన మనిషి ఎవరైందీ కనుక్కుంటే... అతనికి ఈ వీధి దుర్వాసన వార్త చేరవేసింది ఎవరో తేలిపోతుంది. అతనే ఈ దుర్వాసనకు ఎందుకు కారకుడు కారాదు? ఇలా బాలన్న మనస్సు పరిపరివిధాల ఆలోచిస్తోంది.

లక్ష్మి భర్త ఆలోచనలకు కళ్ళెం వేస్తూ, "వీధంతటికీ మళ్ళీ చెత్తకుండి వచ్చేసిన

సంతోషంతోపాటు చెవులు కొరుక్కునే ముచ్చట. అంటే గీత విషయం... కూడా దొరికింది. రావు ఆస్పత్రినుంచి వచ్చాక తలెత్తుకు తిరగలేకపోతున్నాడు. వెంకటమ్మకి విషయం ఇలా ప్రచారమవుతోందని తెలిసిపోయిందో, ఆమె ఉరేసుకుకోవడం ఖాయం" అంది.

లక్ష్మి కనబరుస్తోన్న కంగారుకి బాలన్న దగ్గర బదులులేదు. "మనిషి ఎవరికోసమో బతకడు, చావడు. ప్రతివాడూ స్వార్థపరుడే! గీత గురించి వాళ్ళమ్మ ఎందుకు చస్తుంది?" అన్నాడు మెల్లిగా.

"మగవాళ్ళంతా ఇలాగే! ఆడాళ్ళ మనసు మీకెలా తెలుస్తుంది?"

ఆ వెటకారంలో లక్ష్మికి తనవల్ల పిల్లలు కలగలేదన్న బాధ వుండివుండొచ్చా అని బాలన్న అంచనావేయసాగాడు.

"సరే, ఇహ పడుకొందాం" అంటూ దుప్పటి కప్పుకున్నాడు.

"ఇంత ఉక్కపోతలోనూ దుప్పటా?" అంటూ బాలన్నను బయటికి లాగిందామె.

బాలన్న మనస్సులో ఇంకా ఈ వీధిలో ఈ చెత్తకుండీ వ్యవహారం ఇలా ఎందుకు జరిగింది? ఈ దుర్వాసనకు మూలమేమిటి? రాఘవేంద్రరావుకీ, వెంకటేశ్‌కీ శతృత్వం వుందా? సి.ఎమ్. పాత్ర ఇందులో ఎందుకుండాలి? చెత్తకుండీ అకస్మాత్తుగా మళ్ళీ ఎలా వచ్చింది...? అని ఆలోచిస్తూ నిద్రకు దూరమయ్యాడు. పొద్దుట లేస్తూనే ఎస్.ఐ.గారిని కలవాలనుకున్నాడు.

రాత్రి చాలా పొద్దుపోయేంతదాకా నిద్ర రాలేదు. పక్కన పడుకున్న భార్య క్షణాల్లో గురకపెట్టడం చూసి అతనికి అసూయతోపాటు బాధసైతం ఏర్పడింది.

'ఓ బిడ్డ పుట్టివుంటే ఆమె ఎంత ఆనందంగా వుండేదో!' అనుకున్నాడు మనసులోనే!





రంగయ్య వీధిలో ఓ అద్దె ఇంట్లో నివసిస్తోన్న రిటైర్డు టీచర్ శ్రీనివాసయ్య వారంకిందటే అస్వస్థుడుగా వున్న కొడుకుని చూసిరావాలని బెంగుళూరు వెళ్లివున్నాడు.

"మీరింకా ఆ సీతాపురంలో ఎందుకుంటారు నాన్నా? రెండు ఇళ్ళకు అద్దె చెల్లించడంకన్న మా దగ్గరే వుంటే మీకూ సుఖం మాకూ నెమ్మది'' అన్నాడు శ్రీనివాసయ్యగారి కొడుకు రఘు.

కొడుకు మాటను కాదనకపోయినా "ఇప్పుడంత తొందర దేనికి? నాకేం ఇబ్బంది లేదుకదా? పాతికేళ్ళకు పైగా ఆ వీధిలో వున్నాను. స్వంతవూరు కాకున్నా ఆ వీధిమీది ప్రేమ ఈ పట్టణంమీద ఎలా వుంటుంది? ఇప్పుడు నీకది అర్థంకాదు. ఇంకో నాలుగేళ్ళు అక్కడే వుంటాం. ఆ తర్వాత చూద్దాంలే' అని కోలుకుంటోన్న కొడుక్కి ఊరటనిచ్చి శ్రీనివాసయ్య భార్యా సమేతంగా మళ్ళీ సీతాపురం వచ్చేశారు.

బెంగుళూరునుంచి బయలుదేరిన శ్రీనివాసయ్య, భార్యతో రంగయ్య వీధికి వచ్చేసరికి మధ్యాహ్నం ఒంటిగంట అయ్యింది.

"ఇవాళ తిండి గిండి వండేకన్నా హోటల్‌లో తినివెళ్దాం" భార్యాభర్తలిద్దరూ బస్టాండు పక్కన వున్న వసంతమహల్‌లో భోజనాలు చేసి వచ్చి ఇంటి తలుపులు తీశారు.

భార్య ఇల్లంతా శుభ్రం చేస్తుంటే ప్రయాణ బడలికతో శ్రీనివాసయ్య వరండాలో కాళ్లు చాచిపడుకున్నారు. కాసేపట్లోనే అతనికి నిద్రపట్టేసింది.

అంతలో వాళ్ళ ఇంటిముందు ఓ లారీ వచ్చి ఆగిన శబ్దం, మరుక్షణం దేన్నో లారీలోంచి దించిన చప్పుడు.

అతను గాభరాగా నిద్రలేచాడు. తమ ఇంటికైతే లారీలో తెప్పించే వస్తువేదీ లేదు. పక్కింటివాళ్ళెవరైనా తెప్పించుకువుండాలి. మరి పక్కింటివాళ్ళ గొంతు అసలే వినపట్టంలేదు. మరి ఏమైవుంటుంది అనుకుంటూ లేచి కూచున్నాడు శ్రీనివాసయ్య. నెమ్మదిగా

నడిచొచ్చి తలుపులు తీసేసరికి మున్సిపాల్టీ లారీ ఓ చెత్తకుండీని తమ ఇంటివాకిట ప్రతిష్ఠాపన చేసి వెళ్ళిపోతోంది.

ఈ పాతికేళ్ళలో తమ ఇంటిముందు ఎన్నడూ లేని ఈ చెత్తకుండీ ఇప్పుడెందుకొచ్చిందీ అని విస్తుపోయిన శ్రీనివాసయ్య పెద్దగా చప్పట్లు చరుస్తూ లారీవాళ్లని పిలవసాగాడు. కానీ లారీ ఆగలా. వాళ్లు విన్పించుకున్నారో, లేదో కూడా తెలీదు.

శ్రీనివాసయ్య మరో మార్గంలేక లోనికొచ్చి హాయిగా నిద్రపోతోన్న గౌరిని లేపుతూ "గౌరీ! గౌరీ!!" అన్నాడు, తన ఆదుర్దానీ, ఆసక్తినీ పంచుకోటానికి మరోవ్యక్తి అవసరమన్నట్టు.

"ఊఁ" అంటూ కళ్లు తెరిచిన గౌరి "కాఫీ టైమయిందా?" అంది హడావుడిగా లేచి.

"లేదుగానీ మనింటి ముందర ఏముందో చూడు'' అన్నాడు ఆదుర్దాగా.

ఏమిటని గౌరి కంగారుపడిపోతూ ప్రశ్నించింది.

"చూడు, చెత్తకుండీ'' అన్నాడు శ్రీనివాసయ్య.

"మనం లేని ఈ వారంరోజుల్లో ఈ వీధిలో ఏదో జరిగినట్టుంది. ఏమైందని? ఎవరిని అడగటం? పక్కింటివాళ్ళని అడిగొస్తానుండు'' అంటూనే తమకు ఎడమవైపున్న ఇంటికి వెళ్ళి మెల్లగా తలుపులు తట్టాడు.

తలుపులు తీసిన స్వర్ణగౌరి "ఓ మీరా? రండి! ఎప్పుడొచ్చారు బెంగుళూర్నించి?" అంటూ ఆహ్వానించింది. "ఇందాకే వచ్చాం. మీవారు లేనట్టుంది. మా గౌరిని పంపిస్తాను'' అని వెనుదిరగబోయారు.

స్వర్ణగౌరి "రండి! ఫర్వాలేదు'' అన్నా ఇష్టపడక "మా ఇంటిముందు చెత్తకుండీ దింపేసి వెళ్ళారు మున్సిపాల్టీవాళ్లు. ఎందుకో అర్థంకాలేదు. మీవారికి ఏమైనా తెలుసేమో అని అడగడానికొచ్చాను''

"ఓ, అదా? నేనే మీ దగ్గరికొస్తాను'' అంటూ స్వర్ణగౌరి తమ ఇంటి తలుపులు వేసి శ్రీనివాసయ్యతో అతనింటికి బయల్దేరింది.

శ్రీనివాసయ్యగారికి మరోపక్కన వున్న ఇంటావిడ విమలమ్మ కూడా స్వర్ణగౌరిని చూసి తనూ వచ్చింది.

ఇద్దరాడవాళ్లూ ముందు వంటింట్లోకి వెళ్లి స్టౌ ముట్టిస్తోన్న గౌరమ్మని కుశలప్రశ్నలు వేసి "మాకు కాఫీ గీఫీ ఏదీవద్దు. ఇందాకే తాగొచ్చాం" అని శ్రీనివాసయ్య వున్నచోటికొచ్చి కుర్చీలు లాక్కొని కూర్చున్నారు.

"ఆ చెత్తకుండీ విషయమా? అదో పెద్ద రామాయణమై కూచుంది'' అంటూ ప్రారంభించారు.

ఆ విషయాన్ని విశదంగా ఎవరు చెబితే బావుంటుందని స్వర్ణగౌరి, విమలమ్మ ఇద్దరూ ఆలోచించి, చివరికి విమలమ్మ చెప్పేందుకు సిద్ధమైంది. అయితే విమలమ్మ చెప్పేటప్పుడు ఏదైనా తప్పిపోతే సూచించే బాధ్యత స్వర్ణగౌరిది. అలా ముందే అనుకున్నారిద్దరూ.

ఆ స్త్రీలిద్దరూ ఇలా చనువుగా తనముందు ఈ చెత్తకుండి వ్యవహారం చెప్పేందుకు ముందుకురావడం శ్రీనివాసయ్యకు ఆశ్చర్యంగానూ, ఆత్రుతగానూ వుంది. తన కోడలి వయస్సులో వున్న ఈ ఇద్దర్నీ చూస్తే అతనికి మమకారం. వాళ్ళకి అతను చక్కని రిటైర్డు మాస్టారనే గౌరవం. ఎన్నడూ వాళ్లు ఇంత ప్రత్యేకమైన ఆసక్తిని ఏ విషయంలోనూ ప్రదర్శించకపోవటంచేత గౌరమ్మ కూడా కాఫీకి నీరుపెట్టి విమలమ్మ చెప్పేదాన్ని వింటానికి వచ్చింది.

విమలమ్మ తనకు తెలిసిన విషయాలన్నీ వివరంగా చెప్పసాగింది. స్వర్ణగౌరి మధ్య మధ్య తన అనుభవాల్ని చేరుస్తోంది. వింటూ కూచున్న శ్రీనివాసయ్యగారి ముక్కుకి ఆ దుర్వాసన ఘాటుగా కొట్టినట్లయింది.

"అయితే మేం బెంగుళూర్‌లో వుండడమే మంచిదైంది'' అంది గౌరమ్మ.

"మేం అనుభవించింది చాలండీ!" అంది స్వర్ణగౌరి.

"ఛ, ఛా! అలాంటి బాధ పగవాడికూడా రాకూడదు'' విమలమ్మ. అంతలో శ్రీనివాసయ్య "అది సరే! కాని చెత్తకుండిలో అంత వాసన వచ్చే ప్రాణిని ఎవరు తెచ్చివేశారో ఇప్పటికైనా తెల్సిందా?" అన్నాడు ఆసక్తిగా.

"లేదు. ఇప్పటికైతే ఈ పీడ విరగడైపోయిందికదా'' అని అంతా ఎవరిమానాన వాళ్లున్నారు. కాని బాలన్న అని మన ఎదురింటి జర్నలిస్టు, వారి పక్కింటి శివయ్య వీరిద్దరూ మాత్రం దీన్ని గురించి ఇంకా తలబద్దలు చేసుకుంటున్నారని మావారు చెప్పగా విన్నాను. అయితే ఇప్పుడో పుకారు పుట్టింది'' అని విమలమ్మ తన మాటల్ని సగంలోనే ఆపింది.

"ఏమిటంట?" అన్నాడు శ్రీనివాసయ్య.

"మీలాంటి పెద్దలముందు చెప్పలేను'' అంటూ విమలమ్మ లేచి గౌరమ్మ దగ్గరికి వెళ్లింది. ఇద్దరూ వంటింట్లోకి వెళ్ళిపోయారు. గౌరమ్మ కాఫీ చేసింది. ఆమె "ఏమిటది? నాకు చెప్పకూడదా?" అంది గుసగుసగా.

"మీకు చెప్పొచ్చు. కాని నేనెలా చెప్పను?" అంటూ విమలమ్మ అప్పుడే వంటింట్లోకి వచ్చిన స్వర్ణగౌరిని పట్టుకుని "ఈ విషయం నువ్వే చెప్పు'' అంది.

"నా వల్లకాదు. మీరే చెప్పండి'' అంటూ ఆమె వెళ్లిపోడానికి సిద్ధమైంది.

"ఆగండి, కాఫీ తయారైంది. తాగి వెళ్లండి'' అన్నాడు శ్రీనివాసయ్య.

"వద్దు, వద్దు'' అంటూనే స్వర్ణగౌరి "సగం కప్పు చాలు'' అని ఓ గుక్క కాఫీ తాగి ఆ పుకారు గురించి... "మరేంలేదు. రాఘవేంద్రరావు కూతురు గీత చేసిన నిర్వాకం అంటున్నారు'' అంది మెల్లగా. గౌరమ్మలో కుతూహలం పెరిగింది.

"ఏమిటి ఆమె చేసిన పని?" గౌరమ్మ ప్రశ్నించింది.

"పెళ్లికానివాళ్లు గర్భవతులైతే ఏం చేస్తారో, అదే!" అని విమలమ్మ ఇంక అక్కడ వుండకుండా "వస్తాను'' అంటూ నిష్క్రమించింది.

శ్రీనివాసయ్య వేడివేడి కాఫీ తాగుతూ చెత్తకుండీలో అలా వాసన వచ్చేలా ఉద్దేశపూర్వకంగా ఎవరైనా చేశారా లేక యాదృచ్ఛికమేనా?" అని ఆలోచించాడు. ఉద్దేశపూర్వకమయివుంటే మళ్ళీ ఈ రాత్రే అలాంటిదేదైనా జరగొచ్చు. జాగ్రత్తగా వుండాలి'' అనుకున్నాడు.

ఆలోపు స్వర్ణగౌరిని గుమ్మందాకా సాగనంపి వచ్చిన గౌరమ్మ భర్త పక్కన కూచుని "రాఘవేంద్రరావు కూతురు గీత పారిపోయిందట" అంది.

"నిజంగానా?" అంటూ అతను నోరు వెళ్ళబెట్టాడు.

"ఎవరితో?" అని ప్రశ్నించాడు.

స్వర్ణగౌరి చెప్పినదంతా గౌరమ్మ వివరించింది. "కాకపోవచ్చు, కాకపోవచ్చు'' అన్నాడు శ్రీనివాసయ్య తనలోతనే చెప్పుకుంటున్నట్లు.

"ఏం కాకపోవచ్చు?" గౌరమ్మ అడిగింది.

"అదే ఆ చెత్తకుండిలో వుంది గీత పిండం కాకపోవచ్చు. ఆమె గర్భవతే అనుకుందాం. ఇప్పటి ఆడాళ్లు మన తల్లిదండ్రులనాటి కాలంవాళ్లు కారుకదా! కావాల్సినన్ని ఆసుపత్రులున్నాయి. నర్సింగ్‌హోములున్నాయి. అక్కడికి వెళ్లి తీసేయించుకుంటారు. కాని ఇలా చేస్తారా? ఈ పుకారులో వున్న ఆంతర్యం ఆలోచిస్తే 'చెత్తకుండీకి స్థానచలనం కారాదు. మొదట ఎక్కడుందో అక్కడే వుండాలి' అనే ఈ వీధి వ్యక్తి ఎవరిదోగానీ రహస్యహస్తం దీని వెనకాల వుండొచ్చుననిపిస్తోంది''

"ఏమిటోనండీ! నాకైతే ఏదీ అర్థం గావడంలేదు. మళ్లీ వాసన రాకుండావుంటే చాలు, మీరిప్పటికిప్పుడే మున్సిపాల్టీకి వెళ్లి ఓ అప్లికేషన్ పెట్టిరండి''

గౌరమ్మ సలహావిని శ్రీనివాసయ్య తలాడించాడు. నిజమే. "కాని నాలాంటి రిటైరైన మనిషి చెబితే ఏమవుతుంది. మన వీధికి కొత్తగా వచ్చిన సైంటిస్టుకోసం ఈ చెత్తకుండిని




ఇక్కడికి తరలించారంటే, మళ్ళీ మన అప్లికేషన్‌తో ఏం ఒరుగుతుందని ఆలోచించడం మంచిది''

గౌరమ్మకు ఏం చెప్పాలో అర్థంకాలా.

"మళ్ళీ ఓసారి చెత్తకుండిలోంచి దుర్వాసన వస్తే మాత్రం నేను చక్కా బెంగుళూర్ వెళ్లిపోతాను. మీరేమైనా చేసుకోండి'' అని భర్తని హెచ్చరించింది.

శ్రీనివాసయ్య నవ్వుతూ, "ఈ వయస్సులో నన్ను బెదిరిస్తున్నావా? నాకు ఇంకేం కావాలి చెప్పు'' అని. "నువ్వు బుర్ర పాడుచేసుకోకు. నేను చెయ్యగల్గినంతా చేస్తాను'' అన్నాడు.

వెంటనే వీధిలోకి వెళ్లి నెమ్మదిగా అడుగులేస్తూ సి.ఎమ్.గారి ఇంటిముందరికి వచ్చాడు. ఇతణ్ణి కలవడమా? లేక బాలన్ననా? అని ఆలోచించి బాలన్నతో పరిచయం తక్కువగదా. సి.ఎమ్.నే కలుద్దాం అని నిర్ణయించుకుని, మెట్లు ఎక్కి కాలింగ్‌బెల్లు నొక్కాడు.

బయటకు వెళ్ళేందుకు డ్రెస్ మార్చుకుంటున్న సి.యమ్. "ఎవరొచ్చారో చూడవోయ్'' అన్నాడు భార్యతో. ఆమె తలుపులు తెరిచేసరికి "సార్ వున్నారా?" అన్నాడు శ్రీనివాసయ్య. ఉన్నారన్న జవాబుతో సంతృప్తి చెందిన శ్రీనివాసయ్య పేంకుర్చీలో కూలబడి సి.ఎమ్.కోసం ఎదురుచూడసాగారు.

"నమస్తే మాస్టారూ! బెంగుళూర్‌నించి ఎప్పుడొచ్చారు?" అడిగాడు సి.ఎమ్. శ్రీనివాసయ్య అదీ, ఇదీ మాట్లాడి "మన వీధి చెత్తకుండీ విషయంలో ఏదో భాగోతం జరిగిందటకదా! ఈరోజు మా ఇంటిముందుకే ఆ చెత్తకుండీ వచ్చిపడింది'' అన్నాడు.

"అలాగా?" అన్నాడు సి.ఎమ్. కనుబొమలెగరేస్తూ.

"ఏది ఏమైనప్పటికీ చెత్తకుండీ మా ఇంటి ముందు వుండకుండా చూడండి''

"మొన్న నేనే దాన్ని మీ ఇంటి దగ్గర్నించి ఎత్తేయించాను. ఇప్పుడు మళ్ళీ మీకు సాయం చేసేందుకు నేను ముందరికొస్తే బాగోదు''

"మీరే ఇలా అంటే మావల్ల ఏమవుతుంది చెప్పండి'' శ్రీనివాసయ్య అసహాయంగా అన్నాడు.

"చూడండి మేస్టారూ! దీని గురించి బుర్ర పాడుచేసుకునేపాటి తీరిక లేదు నాకు. నా పనులు సవాలక్ష మిగిలిపోయాయి. అయితే నా మద్దతు మీకే! అఫ్‌కోర్స్! ఈ వీధిలో బాలన్న అనే జర్నలిస్టు ఉన్నారుకదా. మీరతణ్ణి కలవండి. కాదంటే మీరే స్వయంగా వెళ్ళి మున్సిపాల్టీ చెంగల్రావుగారిని కలవండి. నేను చెప్పి పంపానని విసిగించకండీ. మీరు రిటైర్డైనవారు. ఇలాంటివన్నీ ఓపిగ్గా మీరే చేయించుకోవాలి. తప్పుగా భావించకండి. మీవల్ల ఈ పనికాకుంటే ఎలాగూ మేం ఉన్నాంగా''

శ్రీనివాసయ్య నిరాశచెందాడు. "వస్తాను మరి'' అని లేచాడు.

"సరే' అని సి.ఎమ్. నిర్లిప్తంగా అతనికి బదులుచెప్పి లేచారు.

రాత్రి పడుకొన్న శ్రీనివాసయ్యకు నిద్రే రాలా. ఎవరైనా వచ్చి కుళ్ళిన వస్తువుల్ని ఆ చెత్తకుండిలో వేసినా వేస్తారనే అనుమానం అతనికి. పన్నెండుగంటలదాకా మెలుకువతో వుండి లైటు ఆర్పి పక్కమీద దొర్లుతూ ఏదైనా శబ్దం వస్తుందా అని చెవులు రిక్కించాడు. పైగా వాసనేదైనా వస్తుందా అని ముక్కుపుటాల్ని తెరిచిపెట్టుకున్నాడు. లేదు. ఏమీలేదు. లేచి కూచున్నాడు. లైటు వేశాడు. తలుపులు తీసి వరండాలోకి, తర్వాత వీధిలోకి వచ్చారు. వీధి ఆ చివర్నించి ఆ చివరివరకూ ఎవరైనా వస్తున్నారా అని గమనించారు. లేదు. ఎవ్వరూ రావడంలేదు. మళ్ళీ తలుపులు వేసి లైటుతీసే పడుకున్నారు. మరో అరగంటలో ఎవరైనా వస్తేనో అనుకున్నాడు. మళ్ళీ మెలుకువతో వుండిపోయాడు. ఎవరో వస్తున్నారు, వీధిలో అడుగుల చప్పుడవుతోంది, వాసన కూడా వస్తున్నట్టుంది. గభాల్న లేచి కూచుని లైటువేసి కిటికిలోంచి తొంగిచూశారు లేదు.

ఏమీలేదు.

ఇలాంటి పరిస్థితిలో రాత్రంతా గడిపిన శ్రీనివాసయ్యకు తెలతెలవారుతుండగా నిద్రపట్టింది. ఎప్పుడూ ఐదు ఐదున్నరకి లేచే భర్త ఏడుగంటలైనా నిద్ర లేవకపోయేసరికి గౌరమ్మ ఆత్రుతగా "లేవండి'' అంటూ శ్రీనివాసయ్యను తట్టగానే "ఊ... ఊ..." అని అతను రాత్రంతా తను నిద్రకి దూరమైన వైనం వర్ణించి "ఈ రాత్రి నువ్వే నిద్రపోకుండా జాగ్రత్తగా విషయాలు గమనించాలి'' అన్నాడు చిరుకోపంతో.

గౌరమ్మకి మగనిమీద జాలి కలిగింది. ఆమె "మీకు పిచ్చి. మనం జాగ్రత్తగా వుండి



ఏం చేయగలం? ఎవరైనా చెత్తకుండిలో కుళ్ళిన పదార్థాన్ని తెచ్చిపడెయ్యడం మనం చూశామనే అనుకోండి. మనం అతణ్ణి పట్టుకోగలమా? అతను మనం తలుపులు తీసేలోపు పారిపోతాడుకదా!" అంది సముదాయిస్తూ.

"అది నిజమే" అని నవ్వాడతను.

"చెత్తకుండిలో ఎవరు ఏం వేస్తారని జాగ్రత్తగా వుండడంకన్న దాన్ని ఇంతకుముందు ఎక్కడుందో అక్కడికి మార్పించడమే మంచిది" అనుకున్నాడు స్వగతంగా.





# ఏరిన ముత్యాలు

☆ ఆత్మ విశ్వాసమే నాయకత్వం అందుకోడానికి నిజమైన మూల ధనం.

-ఎమర్సన్

☆ మనస్సు ఎంత సంకుచితంగా ఉంటే మాటలు అంత విశాలంగా ఉంటాయి.

-టెడ్‌కుక్

☆ చట్టం మృత్యు సదృశమైనది. అది ఎవరినీ వదిలిపెట్టదు.

-మాంటెస్క్యూ

☆ సకల జీవులపట్ల ప్రేమ, కనికరం చూపే మతమే భగవంతునికి సంతోషాన్ని కలిగిస్తుంది.

-వల్లభాచార్య

☆ శాస్త్రజ్ఞానం స్వార్థపూరిత భోగం కారాదు.

-కారల్‌మార్క్స్

☆ నాగరికత అనేది సమాజం యొక్క అభివృద్ధి క్రమంలో ఒక దశ.

-ఎంగెల్స్

☆ రాజకీయాలు ఒక శాస్త్రం మరియు ఒక కళ.

-లెనిన్

☆ ఆత్మానుభవం గలవానివద్ద వాచాలత ఉండదు.

-గాంధీజీ

☆ నిర్భీతితో ఉన్నపుడే సత్యం వెలువడుతుంది.

-నెహ్రూ

☆ సత్ అంటే భూత, వర్తమాన భవిష్యత్ కాలాల్లో నిరంతరం సృష్టి, స్థితి, లయ క్రియలు జరగడం. ఈ మర్మాన్ని తెలుసుకోవడమే చిత్.

-రమణ మహర్షి

☆ మతం సేవా తత్పరత వల్లే నిలుస్తుంది కానీ శుష్క ఆచారాలవల్ల కాదు.

-ఫరీద్

☆ మంచిగా మాట్లాడితే సరిపోదు. మంచి పనులు కూడా చేయాలి.

-థోరో

☆ మరణించిన వారికంటే బతికున్న వారు ఎంత అధికులో, నిరక్షరాశ్యులకంటే విద్యావంతులు అంతగా అధికులు.

-అరిస్టాటిల్

☆ మానవుడు ఆనందంగా జీవించాలంటే అతనికి రెండు కావాలి, మొదటిది ప్రేమ, రెండవది జ్ఞానం.

-బెర్ట్రండ్ రస్సెల్

☆ మానవుని దయామయునిగా తీర్చి దిద్దేదే నిజమైన విద్య.

-భాభా

---

సేకరణ: **జి.పద్మ**



గౌరమ్మ "లేవండి! ముఖం కడుక్కోండి'' అంటూ భర్తని లేపింది. "సరే' అని శ్రీనివాసయ్య కాఫీ టిఫిన్ ముగించి దుస్తులు వేసుకుని భార్యతో "తిరిగి రావడం కాస్త ఆలస్యం కావొచ్చు. నల్గురైదుగురి దగ్గరికి వెళ్ళి ఈ చెత్తకుండికి ఓ పరిష్కారం కనుక్కోవాలని బయలుదేరుతున్నాను'' అన్నాడు.

"ఇదేం గ్రహచారం?" అని మౌనంగా భర్తని పంపించి మనసులో అనుకుంది. రిటైరైన బతుకు ప్రశాంతంగా గడవనీ అనుకుంటే ఈ చెత్తకుండీ ఓ తలనొప్పిగా తయారైంది. ఈయన పట్టుపడితే వూరుకుంటారా? దేన్నీ ఓ పట్టాన వదలరుగదా''

శ్రీనివాసయ్య నేరుగా బస్టాండుకొచ్చారు. అక్కడికొచ్చాకే తర్వాతే ఎక్కడికి వెళ్ళడమని నిదానంగా ఆలోచించారు.

నేరుగా మున్సిపాలిటీ ఆఫీస్‌కి వెళితేనో? ఛీ అక్కడ తన మాటకి విలువ లేకపోతే?

కౌన్సిలర్ కొండయ్యతో మాట్లాడితే? కాని అతనితో తనకు పరిచయంలేదు. అయితే అతను ఎన్నుకోబడింది తమ ప్రాంతంనించే కనుక అతనితో చెప్పుకునే హక్కుంది. కాని అతనికి తను చెప్పినదాన్ని వినేపాటి ఓపిక వుండాలికదా.

పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి కంప్లైంటు ఇస్తే ఎలా వుంటుంది? వాళ్లవల్ల కూడా పని జరుగుతుందనే నమ్మకంలేదు.

పేపర్‌వాళ్లని ఆశ్రయించడమే సరి. తను సి.ఎమ్.ని కలవడంకన్న ముందు బాలన్ననే కలవాల్సింది. తను తప్పు చేసిందిక్కడే. బాలన్న ఈ చెత్తకుండీని తరలించడానికి చాలా కష్టపడ్డాడట. తనకు పరిచయం లేదన్నది నిజమే. కాని తను ఇప్పుడేం చేస్తున్నాడో? ఆ పనిని అతను తను లేనప్పుడు చేశారు. అందుకని అతణ్ణి ముందు కలిసి ఆ తర్వాత ఏం చేయాలో ఆలోచిస్తే బాగుంటుంది.

శ్రీనివాసయ్య బస్టాండునించి మళ్ళీ రంగయ్య వీధికి తిరిగారు. వీధిలో కనిపించిన పరిచితుల్ని చిరునవ్వుతో పలుకరిస్తూ బాలన్న ఇంటిముందుకొచ్చి కాలింగ్‌బెల్లు నొక్కారు.

లక్ష్మి తలుపులు తీసి అపరిచితుణ్ణి చూసి "ఎవరు కావాలి?" అంది.

"బాలన్నగారున్నారా?"

"లేరు. బయటికి వెళ్ళిపోయారు''

"ఎప్పుడొస్తారు?"

"చెప్పలేం. రాత్రి ఎనిమిదింటికి వస్తారేమో'' శ్రీనివాసయ్య మంచిదని తిరుగు ముఖం పట్టాడు. ఇంత త్వరగా తిరిగొచ్చిన భర్తని చూసి గౌరమ్మ "ఏంటి? సూర్యుడు ఈరోజు పడమరన ఉదయించాడా? పట్టిన పని వదిలేరకం కాదు మీరు. ఈరోజు ఏమైంది?" అంది ఆసక్తిగా.

"నేను కలవాల్సిన వాళ్లు ఏ ఒక్కరూ దొరకలా'' అంటూ దుస్తులు తీసి హాల్లో కూచుని పత్రికలో తలదూర్చాడు.

మధ్యాహ్నం భోజనం ముగించి కాస్త విశ్రాంతి తీసుకొని కాఫీ తాగేసి ఎప్పటిలా లైబ్రరీకి బయల్దేరిన శ్రీనివాసయ్యతో గౌరమ్మ అంది. "ఈ చెత్తకుండీ వ్యవహారం అంతా జరిగిందే అసలా సైంటిస్టు శ్రీవాత్సవగారి వల్లకదా? అతణ్ణి కలిస్తే ఎలా వుంటుంది?"

....చెప్పుల్లో కాలు పెడుతోన్న శ్రీనివాసయ్య ఓ నిమిషంసేపు ఆలోచించి "విషయం బాగానే వుంది. కాని ఓ రిటైర్డు మాస్టారి మాటకు ఆ సైంటిస్టు విలువిస్తాడా?" అన్నాడు.

"మరైతే నేను వెళ్లిరానా?" గౌరి ఉత్సాహం చూపించింది.

"వెళ్ళొచ్చు. కాని అతని శ్రీమతి ఎలాంటిదో? తోడుగా విమలమ్మనీ, స్వర్ణగౌరినీ తీసికెళ్లు''

"మీరు ఇవాళ లైబ్రరీకి వెళ్ళకండి. ముందు విమలమ్మ ఏమంటుందో కనుక్కుంటాను. మీరు ఇంట్లోనే వుండండి''

"సరే! నీ ఇష్టం" అని శ్రీనివాసయ్య ఇంట్లో కొచ్చారు. గౌరి పక్కింటి విమలమ్మతో మాట్లా

డి, ఆమెతో కలిసి వచ్చేసింది. ఆ ఆడాళ్ళిద్దరూ మరో నిమిషంలో బయల్దేరారు. శ్రీనివాసయ్య ఏం జరగనుందో అనే కుతూహలంతో సోఫాలో వాలిపోయారు.

అర.ఁంట తర్వాత లోనికొచ్చిన గౌరమ్మ పడుకుని వున్న భర్త పక్కన కూచుని "ఇప్పుడు నిద్రపోతున్నారా?" అంది.

లేదు, లేదంటూ లేచి కూచున్న శ్రీనివాసయ్య "వెళ్ళిన పని ఏమైంది?" అన్నాడు భార్య ముఖంలోకి చూస్తూ,

"ఏమవుతుంది? ఆమె చెప్పాల్సిందేదో చెప్పింది. మేము విన్నాం. ఏ నిర్ణయానికో వచ్చినట్టు లేదావిడ. అయితే ఒకటి మాత్రం నిజం. చాలా నెమ్మదస్తురాలు ఆవిడ. కల్చరున్న మనిషి. ఆమె వాదం వింటే మీరూ ఊ అంటారు. అంత చక్కగా మాట్లాడుతుంది''

"అంటే నువ్వు ఏదో ఒప్పుకొనివచ్చావు. అంతేనా?" శ్రీనివాసయ్య నవ్వాడు.

గౌరమ్మ నవ్వలా. గంభీరంగానే, "చూడండి. ఆమె చెప్పేది ఇంతే! చెత్తకుండీ విషయంలో ఇప్పుడది ఎక్కడుందో అక్కడే వుండనీ అని వాదిస్తోంది. మొదటిచోటికి మార్చినా దాంట్లో మళ్ళీ ఎవరైనా వాసన వచ్చే పదార్థాలు వేశారనుకోండి. తిరిగి వీధంతా కంపుతో చస్తుంది. అంటే... ఈ చెత్తకుండీ ఎక్కడ వున్నా ఒక్కటే. మావారికి డస్ట్ ఎలర్జీ వుంది కాబట్టి మా ఇంటిముందు వద్దన్నాము అంటోంది. పైగా మొన్నటి దుర్వాసన వెనకాల ఎవరి హస్తమో వుండితీరుతుంది. అని వాదిస్తోంది. మావారికి గిట్టనివాళ్లు చేసినపని. రిటైరైన పిదప హాయిగా వుందామనుకుని ఈ సొంతింటికి వచ్చాం. ఇక్కడేమో ఇలాగుంది. ఏం చేయమంటారో మీరే చెప్పండి'' అంది.

శ్రీనివాసయ్య భార్య మాటలు విని నవ్వుతూ "అయితే ఆమె మాటలు విని ఒప్పుకొని వచ్చావు. మళ్ళీ వాసనగానీ గీసనగానీ వస్తే కొడుకు దగ్గరికి బెంగుళూర్ వెళతానని బెదిరించవుకదా?" అన్నాడు.

గౌరి మాట్లాడలా. ఓ క్షణం గడిచాక శ్రీనివాసయ్య "ఆ సైంటిస్టు ఇంట్లో వున్నారా?" అని ప్రశ్నించాడు.

"లేరు. అతనెప్పుడొచ్చేదీ ఖచ్చితంగా చెప్పలేం అంది. కాని అతనికి ఎలర్జీ ట్రబుల్ మాత్రం విపరీతంగా వుందిట. అందుకని అతగాడి హెల్త్ గురించి ఆమెకు ఎంతో బాధట. రిటైరైనా కేంద్రప్రభుత్వం అతణ్ణి ఆ కమీషన్‌లో ఈ కమీషన్‌లో అని నియమిస్తుంటుందట. ఇప్పుడు ప్రతిపక్షంలో వున్న అతని మిత్రుడు ఒకరు రేపు కేంద్రంలో మంత్రి అయితే శ్రీవాత్సవగారిని రక్షణశాఖకు సలహాదారుగా తీసుకునే అవకాశం వుందిట. ఇదంతా చూస్తే ఏదో రాజకీయం ఈ చెత్తకుండీ వాసన వెనకాల ఎందుకుండరాదు అన్పిస్తోంది''

శ్రీనివాసయ్య మాట్లాడలా, "సరే! రాత్రికి బాలన్నను కలిసివస్తాను'' అంటే "వద్దు. రెండ్రోజులు చూద్దాం" అంది గౌరమ్మ.

"నీ ఇష్టం" అని మౌనంగా వుండిపోయాడాయన. ఆ రాత్రి శ్రీనివాసయ్య చెత్తకుండీ కోసం నిద్రచెడగొట్టుకోలా. గౌరమ్మ మాట విన్నాక అతనికీ ఈ వాసన వెనకాల ఏదో రాజకీయం వుందనిపిస్తోంది. అలా అనుకోగానే అతనికి హాయిగా నిద్రపట్టింది.

ఇలా రెండు పగళ్లూ, రెండు రాత్రులూ గడిచాయి. మూడోరోజు పొద్దున్న శ్రీనివాసయ్య లేచి చూస్తే తమ ఇంటిముందు చెత్తకుండి లేదు. మళ్ళీ అది యథాస్థానానికి అంటే శ్రీవాత్సవగారింటి ముందుకు వెళ్ళింది. 'అరే! ఇదెలా జరిగింది' అని శ్రీనివాసయ్య నిర్ఘాంతపోయాడు.

లోనికొస్తూనే భార్యతో "చూశావా చెత్తకుండి ఏమయిందో?" అన్నాడు.

కాఫీ కాస్తున్న గౌరమ్మ "ఊ... ఏమిటి?" అంది.

"ఆ చెత్తకుండీ ఎక్కడుండేదో అక్కడికే వెళ్ళిపోయింది మళ్ళీ''




ఆ మాటలతో ఆమె అవాక్కయింది.

"అదెలా? ఇది ఎవరిపనై వుంటుంది?" అంది.

"నాకేం తెలుసు?" అని శ్రీనివాసయ్య ముఖం కడుక్కున్నాడు. ఆ తర్వాత ఆశ్చర్యంగా అతను కాఫీ తాగుతుండగా సి.ఎమ్. వచ్చాడు.

వస్తూనే "నమస్కారం మాస్టారూ! మంచి పని చేశారు. మీకింత ఇన్‌ఫ్లూయన్స్ వుందని నేననుకోలా. కంగ్రాట్స్'' అన్నాడు.

"రండి! కాస్త కాఫీ త్రాగండి'' అని సి.ఎమ్.ను ఆహ్వానించిన శ్రీనివాసయ్య "మీరు ఏ విషయం గురించి మాట్లాడుతున్నారు?" అన్నాడు సి.ఎమ్. మాటలు అర్ధంగాక.

"అదే! చెత్తకుండీని యధాస్థానానికి తరలింపచేశారుకదా మీరు. దాన్ని గురించే''

"నేనా?" శ్రీనివాసయ్య బిత్తరపోయి "లేదు స్వామీ! నాకా విషయమే తెలీదు. ఇదంతా ఎలా జరిగిందో కూడా తెలీదు'' అన్నాడు.

"నాకు తెలుసులెండి. మీరు ఎంతగా లేదన్నా ఇది మీరు చేసినపనే! ఏమైనా మంచిపని చేశారు. అభినందనలు'' అనేసి, కాఫీ తాగివెళ్లండి అని శ్రీనివాసయ్య అంటున్నా ఆలస్యమైంది అంటూ అంతర్ధానమయ్యాడు సి.ఎమ్.

శ్రీనివాసయ్య సి.ఎమ్. మాటల్ని గుర్తుచేసుకుంటూ "ప్రత్యక్షంగా చూసినట్టే చెబుతున్నాడే ఈ సి.ఎమ్." అని బేజారైపోయి కూలబడ్డాడు.

సి.ఎమ్. స్వయంగా వచ్చి చెప్పిన మాటల్ని విన్న గౌరమ్మ "మీరింత ఘటికులు అని నేనూ అనుకోలేదు. నాక్కూడా చెప్పాపెట్టకుండా ఈ పని క్షణాల్లో చేయించారే'' అంది.

శ్రీనివాసయ్యకి ఈ అనుభవం కొత్తగా వుంది. తను నిజం చెప్పినా భార్య నమ్మేలా లేదు. ఆమె మాటల వెటకారం చూసి అతను విచారించాడు. గౌరమ్మే తనను నమ్మకుంటే ఇంకెవరు నమ్మగలరు? కాని నిజం ఏనాటికైనా నిలకడగా తేలిపోతుంది అనుకుంటూ "చూడు గౌరీ! నేనెలాంటివాణ్ణో పెళ్ళై ఇన్నేళ్ళైనా నువ్వు తెల్సుకోలేదంటే ఆశ్చర్యంగా వుంది. నిజానికి ఈ తతంగంతో నాకు ఎలాంటి సంబంధమూ లేదు'' అన్నాడు.

గౌరమ్మ నవ్వుతూ "అబద్ధాలు చెప్పకండి. నాకంతా తెల్సు'' అంది.

శ్రీనివాసయ్య ఇంక మాట్లాడి లాభంలేదు. బయటికి వెళ్ళొద్దాం అనుకున్నాడు.

అంతలో తలుపు చప్పుడైంది. ఎవరొచ్చారో అనే ఆత్రుతతో తలుపులు తీస్తే బాలన్న. అతనెవరో శ్రీనివాసయ్యకు తెలుసు. కాని పరిచయం లేదు. అందుకని సంకోచిస్తూనే "రండి. రండి కూచోండి'' అని ఆదరంగా ఆహ్వానించాడు.

బాలన్న కుర్చీలో కూచుంటూ "మీ ఇంటి ముందరి చెత్తకుండీని మళ్ళీ శ్రీవాత్సవగారి ఇంటిముందే పెట్టించారు. ఔనా?" అని నేరుగా కదిపాడు.

శ్రీనివాసయ్య బాలన్న ముఖంలోకి చూస్తూ "తమరితో పరిచయం ఇదే మొదటిసారి. మీరు జర్నలిస్టు అని తెలుసు. తమరు రాజకీయనాయకుల్ని ఇంటర్వ్యూ చేసిన అనుభవశీలురు. నాలాంటి రిటైర్డ్ పేదపంతుల్ని హఠాత్తుగా వచ్చి ఇలా అడిగితే ఎలా?" అన్నాడు గంభీరంగా.

"అయితే ఈ పని చేసింది మీరు కాదా?"

"హుం... నేనెలా చేయించగలను సార్? అంతటి ఇన్‌ఫ్లూయన్సుందా నాకు? ఈ చెత్త కుండీని కేంద్రంగా పెట్టుకొని ఈ వీధిలో ఎవరో ఏదో సాధించడానికి నాటకమాడుతూ బయల్దేరినట్టున్నారు. మధ్యలో నాలాంటివాడు బలిపశువుగా మారుతున్నాడు అంతే''

"క్షమించండి. బాధపడకండి''

"మీ తప్పేమిటి సార్ ఇందులో? నా పెళ్ళామే నమ్మడంలేదు. మీకెవరో కావాలనే ఇలా చెప్పివుండాలి. లేదా మీరైనా అపార్ధం చేసుకునివుండాలి''

"ఈ విషయం వదిలేసెయ్యండి మేస్టారూ!



మొన్నంతా నేను ఈ చెత్తకుండీ కోసం పడరాని పాట్లు పడ్డాను. అనవసరంగా రిస్కు తీసుకున్నాను. చివరికి అది మరో మలుపు తీసుకుంది. మళ్ళీ ఇంకా ఎన్ని మలుపులో ఎన్ని తిరుగుళ్ళో''

శ్రీనివాసయ్య నిశ్శబ్దంగా వుండిపోయాడు. లోపల్నించి ఈ సంభాషణ విన్న గౌరమ్మ "అలాగవుతే మీరు మాలతి ఇంటికి వెళ్ళి ఈ పని నేను చేయలేదు అని చెప్పిరండి'' అంది.

శ్రీనివాసయ్య "నేనెందుకు పనిగట్టుకు వెళ్ళాలి?" అంటూ "చూడండి సార్! నేనిప్పుడు వెళ్ళి నేను కాదు అంటే మాలతి మేడం నమ్ముతుందా? దానికన్నా నిర్లిప్తంగా వుండిపోవడం మంచిదికాదూ'' అన్నాడు.

"అఫ్‌కోర్స్. చూడండి మాస్టారూ! ఇప్పుడో పని చేయవచ్చు. ఈ చెత్తకుండి ఎక్కడ వుండాలి అనే విషయం గురించి మనం ఈ వీధిలో వుండే అందర్నీ అడగడం. వాళ్ళందరి నిర్ణయం ప్రకారం దాన్ని తరలించడం. ఎలా వుంది ఐడియా?"

"మీ సలహా సరే! కాని ఇన్నేళ్లు అక్కడే వున్న చెత్తకుండిని మా ఇంటిముందు వుంచమని ఎవరు మాత్రం అంటారు? నేను అడగడానికి వెళితే 'మా ఇంటిముందరే వుండనివ్వండి' అన్నారు జనం. దానికన్న మీరూ, నేను వెళ్లి మున్సిపాల్టీని ఆశ్రయిస్తే...?

"ఓ... మున్సిపాలిటీ విషయమా? వాళ్ళవల్ల ఏమీ కాదు. వచ్చేందుకు నాకు అభ్యంతరం లేదు. చెప్పాల్సింది చెబుదాం"

శ్రీనివాసయ్య "వెళ్ళి రావడమే బావుంటుందేమో!" అన్నదానికి బాలన్న ఊకొట్టాడు. వీళ్ళిద్దరూ రంగయ్య వీధిలో వెళ్ళడం గమనించిన మంది ఎవరి ఇష్టానుసారం వారు మాట్లాడసాగారు. బాలన్న అదేం పట్టించుకోకుండా ముందుకు అడుగులేస్తోంటే, శ్రీనివాసయ్య అందరి దృష్టి తనమీదే వుందనీ, తనేదో తప్పుచేశానన్న భ్రమలో జనాలున్నారనీ అనుకున్నాడు.

ఇద్దరూ కలిసి చెంగల్రావును కలిశారు. "కూచోండి'' అంటూ బాలన్నకు కుర్చీ చూపించిన చెంగల్రావు "ఒక్క నిముషం" అని తను గమనిస్తోన్న ఫైళ్ళలో తలదూర్చి ఆ తర్వాత జవాన్‌ను పిలిచి "వాళ్ళని పిలువ్! వీళ్ళని పిలువ్' అని ఆజ్ఞాపించి వచ్చిన వాళ్ళతో అదీ ఇదీ మాట్లాడి ఫైళ్ళను పక్కకు జరుపుతూ "ఏం బాలన్నగారూ? మళ్ళీ ఇటొచ్చారు'' అన్నాడు, ఎట్టకేలకు అలా అనడంలో వ్యంగ్యం ధ్వనించింది.

బాలన్నకు చెంగల్రావు తనని వుద్దేశపూర్వకంగానే నిర్లక్ష్యం చేస్తున్నాడని కోపమొచ్చినా బయటికి కనిపించనివ్వకుండా "వీరు శ్రీనివాసయ్యగారు'' అని పరిచయం చేస్తూ, "మేం ఎందుకొచ్చామో మీకు తెలిసిపోయింది. అందుకే మీరు ఫైళ్ళ పరిశీలనలో బిజీగా వుండిపోయారు'' అన్నాడు.

బాలన్న మాటల్లోని వ్యంగ్యం చెంగల్రావుని నొప్పించింది. కాస్త మెత్తబడ్డట్టు నటిస్తూ "మళ్లీ ప్రాబ్లం ఏంటి? చెప్పండి'' అన్నాడు.

బాలన్న మళ్ళీ చెత్తకుండీ యథాస్థానానికి వెళ్ళిపోయిన విషయం చెప్పాడు. అది విన్న చెంగల్రావు, "మీకు మేలే జరిగింది కదా! మీరనుకున్నదీ కోరుకున్నదీ అదేగదా'' అన్నాడు బిగ్గరగా నవ్వుతూ.

"నిజమే! మేం అనుకున్నదీ అదే. కాని అది అక్కడే ఖచ్చితంగా వుంటుందన్న గ్యారంటీ ఎక్కడ? రేపు మరోచోటికి వెళ్ళొచ్చు. అందుకని మీరు ఓ స్థిరనిశ్చయానికి రావాలి'' అన్నాడు.

"మేం నిర్ణయానికి రావచ్చు. కాని మీరు ఒప్పుకోవాలి కదా. మీరు అంటే మీరే కాదు. జనాలూ, ప్రజా ప్రతినిధులూ, మీ ప్రతినిధులు ఎలా చెబితే అలా చేద్దాం. మీరేం చెప్పినా ఇప్పుడు నేను హెల్ప్‌లెస్''

బాలన్న కొంచెం విసుక్కున్నా "అలాగైతే మీరు ముందు చెత్తకుండీని ఎవరినడిగి ఈ శ్రీనివాసయ్యగారి ఇంటిదగ్గర వుంచారు?"




అన్నాడు.

"అదుగో! ఆ సమస్య వేరు. ఆమె మాకు అర్జీ పెట్టుకుంది. చేశాం. అలా చేయడమే తప్పంటున్నారు కదా మీరు. మళ్ళీ మళ్ళీ మేమెందుకు తప్పులు చేయాలి?"

"అంటే చెత్తకుండీని ప్రస్తుతం మళ్ళీ ఎత్తి మరోచోట పెడతారా?"

"ఖచ్చితంగా... అయితే శ్రీవాత్సవగారు లేదా అతని శ్రీమతిగారు... ఇద్దరిలో ఎవరైనా రిక్వెస్టు చేస్తే మార్చుతాం"

"అదెలా? అలా చేసేందుకు ప్రజాప్రతినిధుల అనుమతి వుందా?"

"చూడండి బాలన్నగారూ! మీరు ఓ జర్నలిస్టు. రంగయ్య వీధిలో చెత్తకుండీ ఎక్కుడుండాలో మున్సిపాల్టీలో నిర్ణయం కాలేదు. అది ఆ వీధిలో ఎక్కడో ఓ చోట వుంటే సరి, అలా అది మళ్ళీ శ్రీనివాసయ్యగారి ఇంటి ముందరికొస్తే తప్పా?"

బాలన్న శ్రీనివాసయ్య వంక చూశాడు.

శ్రీనివాసయ్య ముఖం పాలిపోయింది. "చూడండి పాతికేళ్ళనించి నేను ఆ ఇంట్లో వుంటున్నాను. ఎప్పుడూ ఆ యింటిముందు చెత్తకుండి లేదు. ఇప్పుడెందుకు వుండాలో నాకు అర్థంగావడంలేదు''

"ఎందుకుండరాదో చెప్పండి''

"ఎందుకుండాలన్నది నా ప్రశ్న''

చెంగల్రావు ముఖం జేవురించింది. "క్షమించండి. మీరేమైనా చేసుకొండి దయచేసి ఈ విషయం ఇంక చర్చించకండి."

"అయితే మళ్ళీ చెత్తకుండీ శ్రీనివాసయ్యగారింటిముందు పెడతారా?" బాలన్న డంగై అడిగాడు.

"ఔను, ఉంచడమే కాదు పోలీస్ ప్రొటక్షన్ కూడా కావాలంటే పెడతాము. ఎవరు దాన్ని అక్కణ్ణించి మళ్ళీ మార్చుతారో వాళ్ళమీద కేసు బనాయిస్తాము''

చెంగల్రావు ముఖం ఎర్రబారడం చూసి బాలన్న లేచాడు.

"ఇతనితో చర్చ వద్దు'' అన్నాడు శ్రీనివాసయ్యతో.

అతనూ లేచాడు.

ఇద్దరూ మెట్లు దిగడం చూసిన చెంగల్రావు వాళ్ళమీదికోపంతో బెల్లు జోరుగా ఒత్తాడు.

జవాను రాగానే "వాళ్ళెటు వెళ్తున్నారో చూసిరా!" అన్నాడు. "ఇదేం గ్రహచారంరా బాబూ!" అనుకుంటూ జవాను బయటికొచ్చి ఓ బీడీ అంటించుకుని తీరిగ్గా కాసేపాగి "వాళ్ళు కన్పించలేదు సార్!" అని చెప్పాలనుకున్నాడు. మరీ దరిద్రపు ఆఫీసర్ ఇతను. ఎప్పుడూ రుసరుసలాడుతూనే వుంటాడు. అదేం ముఖమో, ఏమో?" అని మనసులోనే అనుకున్నాడు.

నర్సింగ్‌హోమ్‌లో కోలుకొని డిస్చార్జి అయిన రాఘవేంద్రరావు ఇంటికి వస్తూనే మెల్లగా భార్యతో "పక్కింటి బాలన్నగారు ఉన్నారేమో కాస్త చూసిరా'' అన్నాడు.

ఆమె వెళ్ళి బాలన్న ఇంటి తలుపులు తట్టింది. బాలన్న తలుపులు తెరిచేసరికి, "మా వారు మిమ్మల్ని చూడాలనుకుంటున్నారు. తీరిక ఉంటే ఒక్షణం వస్తారా?" అంది చిన్నగా.

"తప్పకుండా వస్తాను. మీరెళ్ళండి'' అన్న బాలన్న... మళ్ళీ శ్రీనివాసయ్య ఇంటిముందు మున్సిపాల్టీ వాళ్ళు చెత్తకుండీని ప్రతిష్ఠాపన చేసిన వైనం గురించి ఏయే పనులు చేపట్టాలి అని ఆలోచిస్తూ... గబగబా లేచి బయల్దేరాడు.

"రండి బాలన్నగారూ!" రాఘవేంద్రరావు ఆహ్వానించాడు. "నమస్కారం" అని చేతులు జోడించిన బాలన్న రావు చూపించిన ఆసనంపై కూచుంటూ "బావున్నారు కదా?" అన్నాడు మర్యాదగా.

"హుం... రాఘవేంద్రస్వామి దయవల్ల బతికాను''

"మా అందరికీ సంతోషం"



"నిజంగా మీకు సంతోషం కావచ్చు. ఎందుకంటే మీరు నిజమైన మనుషులు. ఈ వీధికోసం, నాకోసం మీరు పడ్డ శ్రమంతా నేను ఆస్పత్రిలోనే విన్నాను. ఆరోజు మీరు మా ఇంటి తలుపు తట్టినప్పుడు తొందరపడి మిమ్మల్ని ఏవేవో అన్నాను. క్షమించండి!" అలా అని రావు రెండు చేతులెత్తి నమస్కరిస్తూ అపరాధభావం ప్రదర్శించాడు.

"ఛ, ఛా! అదంతా వదిలేసెయ్యండి. ఉన్నవీ లేనివీ పట్టించుకొని మళ్ళీ ఆరోగ్యం పాడుచేసుకోకండి''

"అలా కాదులెండి. ఈ రంగయ్య వీధి అంతా నా గురించి తలాతోకలేని ఆరోపణలు చేశారుట. మీరొక్కరే అవన్నీ అబద్ధాలని కొట్టిపారేశారట. వాళ్ళకెలా తెలిసిందో ఆ పరమాత్మకే ఎరుక. నిజంగా నేనలాంటి పనిచేయలేదు. నా కూతురు పారిపోయిందన్నది నిజం. అది తప్పు అనే భావన ఇప్పుడు నాలోలేదు. ఆమె చనిపోయిందనీ, ఆమెకు గర్భస్రావమైన బాపతు పిండమే ఈ వీధి దుర్వాసనకు కారణం... అనీ, ఇలా రకరకాల వదంతులు బయల్దేరాయని నాకు తెలుసు. ఎవరు ఈ పుకార్లు లేవదీశారో తెలీదు. పోలీస్‌లకూ అర్జీ పెట్టుకున్నారట. ఇవన్నీ అబద్ధాలంటూ మీరు కొట్టిపారేశారని నా భార్య రోజుకి పదిసార్లు గుర్తుచేస్తోంది. చూడండి! నేను అలాంటి పొరపాటు చేయలేదని మీకెలా తెలుసు?"

రావు మాటలు వింటున్న బాలన్న "ఎలాగంటే..." అని నసిగి ఆ తర్వాత "ఎందుకో నా అంతరాత్మ మీరు అలా చేయలేదని చెప్పింది'' అన్నాడు.

అరనిముషంపాటు రాఘవేంద్రరావు మౌనంగా వుండిపోయారు. ఆ తర్వాత "మీ హృదయం ఎంతో నిష్కల్మషమైందనేందుకి



దే సాక్ష్యం" అని ఓ కాయితం తీసిచ్చారు.

"చూడండి... ఇది నా కూతురు రాసిన ఉత్తరం. ఆమె బతికే వుందనీ, రిజిష్టర్డు పెళ్ళి చేసుకుందనీ ఈ ఉత్తరంలో దాఖలాలు ఉన్నాయి'' అన్నాడు రావు.

బాలన్న ఆ కాయితాన్ని విప్పలేదు. "మీరు చెప్పితే చాలు నేను నమ్ముతాను. ఉత్తరం చదవాల్సిన పనిలేదు'' అన్నాడు చిన్నగా.

"దీన్ని మీకు తప్ప మరెవరికి చూపించగలను. నా బంధువుల్లో మీరు ఒకరని నా అభిప్రాయం" అన్నాడు కంటికొసల్లో లీలగా మెరిసిన తడిని తుడుచుకుంటూ.

క్షణం తర్వాత "మీరు హాయిగా పడుకోండి. ఎక్కువగా మాట్లాడితే ఆయాసం వస్తుంది. నేనున్నాను కదా! తీరిక ఉన్నప్పుడల్లా వస్తాను'' అంటూ లేచి నించున్నాడు.

"కాస్త కాఫీ తాగి వెళ్ళండి'' అంటూ "ఏమోయ్'' అని కేకేశాడు భార్యని. ఆమె ఏమిటంటూ రాగానే "బాలన్నగారికి కాఫీ'' అన్నాడు రావు.

వద్దని బాలన్న బయల్దేరాడు. ఇంటికొస్తూనే... శ్రీనివాసయ్యని కలవడమా లేక ఎస్.ఐ గారిని కలవడమా అని ఆలోచించసాగాడు. చెత్తకుండీ ఇప్పుడు శ్రీనివాసయ్య ఇంటి



బాలన్న కళ్ళు కూడా చెమ్మగిల్లాయి. ఓ నిముషం మాటల్లేవు. ఆ తర్వాత రావు "నేనామెను ఎప్పుడో క్షమించాను. నేను మళ్ళీ బతికాను. నా గుండెపోటుకి ఆమె కారణం అన్నది నిజమే! కాని బతికి బట్టకట్టాను కదా! ఇప్పుడు నేనో కొత్త మనిషిననే భావం నాలో ఏర్పడింది'' అన్నాడు.

బాలన్న బదులు చెప్పలేదు!

ముందరికొచ్చింది. మున్సిపాల్టీ వాళ్ళే తెచ్చిపెట్టారు. పోలీసు కాపలా మాత్రం లేదు. చెంగ్రాలావు అన్నంత పనీ చేశాడు. ఎస్.ఐ రామస్వామి ఈ విషయంలో ఏమంటాడో చూద్దాం అనుకుంటూ బయల్దేరాడు.

స్టేషన్‌లో రామస్వామి ఏదో ఫైల్ విప్పి తీరికగా కూచుని వున్నాడు.

బాలన్న "హలో!" అనేసరికి రండని

ఆహ్వానించాడు ఎస్.ఐ.

బాలన్న ఎప్పటిలా కుర్చీలో కూలబడుతూ, "ఏమైంది మీకొచ్చిన ఆకాశరామన్న ఉత్తరం సంగతి?" అన్నాడు.

రామస్వామి ఫైల్ మూసేసి "ఏమీ కాలేదు. కాని నాకు బదిలీ అయ్యేట్టుంది'' అన్నాడు చిన్నగా.

"బదిలాయా? ఎందుకు?" ఆందోళనగా అడిగాడు బాలన్న, "అక్కడే వుంది అసలు విషయం. మీరూ, శ్రీనివాసయ్యగారూ చెంగల్రావుని కలిశారట కదా నిన్న! మిమ్మల్ని సాగనంపాక చెంగల్రావు ఫోన్‌చేసి "రేపు చెత్తకుండీని శ్రీనివాసయ్య ఇంటిముందు ఉంచుతున్నాం. మీ ప్రొటక్షన్ కావాలి'' అన్నాడు "అదెలా సాధ్యం? చెత్తకుండీ ఓ మనిషి కాదు కదా! మనుషులకు మాత్రమే మేం రక్షణ ఇస్తాం. చెత్త కుండీక్కాదు'' అన్నాను. అవతలి వైపు చెంగల్రావు ఫోన్ విసురుగా పెట్టేసిన శబ్దం వినిపించింది. రాత్రి పదింటికి ఎస్.పి.గారి ఫోన్ వచ్చింది. "రంగయ్యవీధిలో పబ్లిక్ ప్రోపర్టీకి స్థానచలనం జరుగుతోందట. మీరేమో రక్షణ ఇవ్వనన్నారట. నిజమేనా?" అన్నాడు.

నేను విషయం వివరించాను.

ఎస్.పి.గారు "చూడండి రామస్వామీ! ఆ శ్రీవాత్సవగారి భార్య వుందే... ఆమె మన హోంమినిస్టర్ భార్యకి దగ్గరిబంధువు. మీవల్ల కాదని మీరు అంటే మిమ్మల్ని బదిలీ ఎందుకు చెయ్యరాదని నోట్ పెట్టాలి. సో, డోంట్ ఇంటర్‌ఫియర్ ఇన్ దిస్ పాలిటిక్స్. డూ యువర్ డ్యూటీ'' అన్నారు. నేనూ ఓ.కే. అన్నాను'' అన్నాడు ఎస్.ఐ.రామస్వామి.

బాలన్న విస్తుపోలా. ఈ రాజకీయం ఎలా ఇన్ని మలుపులు తిరుగుతుందో అని ఆలోచించసాగాడు.

ఎస్.ఐ.అంటే మంచి మనిషనీ, సమర్థుడనీ పేరుంది. కాని ఇతగాడి మంచితనానికీ, సామర్థ్యానికీ దక్కిన గౌరవం బదిలీ. ఇతను తనని అప్పుడప్పుడు అది రాజకీయం ఇది రాజకీయం అంటూ ఎద్దేవా చేసేవాడు. కాని ఆ రాజకీయానికి ఇప్పుడితనే బలిపశువుగా మారబోతున్నాడు అనుకుంటూ, "మరి మీరు ఈరోజు చెత్తకుండీ కాపలాకై పోలీసుల్ని ఎందుకు పంపలేదు?" అన్నాడు.

"పైనుండి రాతపూర్వకంగా రానివ్వండి. ఆ తర్వాతే పంపిస్తాను'' నిర్లిప్తంగా అన్నాడు. బాలన్న మళ్ళీ మౌనంగా వుండిపోయాడు. రామస్వామి సిగరెట్టు అంటించుకుంటూ... "నేను బదిలీ అని బెదరడంలేదు బాలన్నగారూ! ఈ దేశంలోని ఏ మారుమూలకైనా నన్ను బదిలీ చెయ్యనివ్వండి. లా అండ్ ఆర్డర్ గురించి ఎక్కడికైనా రెడీయే! కాని క్షుద్ర కారణం కోసం రాజకీయంగా బదిలీ కావడం నేను సహించలేను... రాజీనామా అయినా చేస్తాను కాని..."

"నిజంగానా?" బాలన్న నివ్వెరపోతూ అడిగాడు.

"ఊ" అన్నాడు రామస్వామి. బాలన్న లేచాడు.

రామస్వామి... "ఉన్నపళంగా లేచారు. నా మాటలవల్ల మీరు బాధపడ్డారా?" అని ప్రశ్నించాడు.

"లేదు... లేదు... చాన్నాళ్ళుగా ఈ చెత్తకుండీ గురించి ఓ సుదీర్ఘమైన వార్త రాసి 'దినసుద్ది'కి పంపించాలని అనుకుంటున్నాను. ఇప్పుడది పండి పాకాన పడింది. ఇక ఇప్పటికిప్పుడే రాసి పంపించాలి''

"అందులో నా విషయం కూడా రాస్తారా?" నవ్వుతూ అడిగాడు ఎస్.ఐ.

"రాకూడదంటారా? మీకెలా బదిలీ అవుతుందో చూస్తాను. మీరు రిజైన్ చేయాలని రాజకీయనాయకులా నిర్ణయించేది? జనం నిర్ణయించాలిగాని''

"ప్రజలు నిర్ణయిస్తారా? అంత ధైర్యం వాళ్ళకెక్కడిది?" అని ఎస్.ఐ.ని అడగాలనిపించి నా మాట్లాడకుండా వుండిపోయాడు. బాలన్న




"ఓ.కే." అంటూ ఏదో జయించినట్టుగా ఫీలవుతూ ఇంటికి వెళ్ళిపోయాడు.

దార్లో సి.ఎమ్. తారసిల్లాడు. బాలన్న లూనాని చూడగానే రక్కున కారు ఆపి తల బయటికి పెట్టి "బాలన్నగారూ నమస్కారం" అన్నాడు.

విధిలేక లూనా ఆపిన బాలన్న "ఎన్నాళ్ళకెన్నాళ్ళకండీ! ఒకే వీధివాళ్ళం. ఎవరి పనులు వారివే గదా! అందుకే ఈమధ్య కల్సుకోలేకపోయాం. పైగా సందర్భమూ రాలేదు'' అన్నాడు.

కారులోంచి కిందికి దిగిన సి.ఎమ్. "రండి! ఇక్కడో హెూటల్ వుంది. మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి'' అంటూ బాలన్నను పిలిచాడు.

అయిష్టంగా వున్నా బాలన్న "మీ ఇంట్లోనో, మా ఇంట్లోనో మాట్లాడుకుందాం. నేనిందాకే కాఫీ తాగి వచ్చాను'' అంటూనే సి.ఎమ్. వెంట వెళ్ళాడు.

హెూటల్లో ఓ మూల ఎవ్వరూ లేని టేబుల్ ముందు కూచున్నారు. సి.ఎమ్ "మరోమారు కాఫీ తాగడంతో మీ ఆరోగ్యం చెడదు లెండి'' అని నవ్వుతూ "ఏం తిందాం చెప్పండి?" అన్నాడు.

"ఏదీ వద్దు. మీకేం కావాలో తీసుకోండి!"

"నాక్కూడా ఆకలి లేదు. కాని హెూటల్కొచ్చాక ఏదైనా తినాలి కదా'' అని సి.ఎమ్. రెండు ప్లేట్లు బోండాకి ఆర్డరిచ్చి సిగరెట్టు ముట్టించి బాలన్నకూ ఇచ్చాడు.

బాలన్న పొగ వదుల్తూ సి.ఎమ్. ముఖంలోకి గుచ్చిగుచ్చి చూశాడు.

సి.ఎమ్ "మన జనాలకి ఉపకారం చెయ్యాలన్న బుద్ధి చాలా తక్కువ. కృతజ్ఞత సైతం తక్కువే! వెంటనే మరిచిపోతారు. ఆ రోజు చూడండి ఆ దుర్వాసన వున్న చెత్తకుండీని తరలించడానికి ఎంతో కష్టపడింది మీరు, కాని జనం మిమ్మల్ని మరిచేపోయారు. నాకిది చాలా బాధగా వుంది. దయచేసి నన్ను అపార్థంచేసుకోకండి. ఎన్నాళ్ళనించో మీతో ఫోన్లో మాట్లాడాలని అనుకుంటున్నాను. ఇవాళ ఇలా కలుసుకున్నాం. ఇట్ ఈజ్ టూ లేట్, బట్ అఫ్కోర్స్..." అన్నాడు.

బాలన్నకు మొదట సి.ఎమ్. ఏం చెబుతున్నదీ అర్థంకాలా. జనం "సి.ఎమ్. వర్ధిల్లాలి!" అంటూ నినాదాలు ఇవ్వడం గుర్తుకొచ్చి, నిజంగా ఇతను హృదయం విప్పి మాట్లాడుతున్నాడా లేక నాటకీయంగానా? అని తెలీక "ఓ అదా... అదంతా పట్టించుకునేందుకు మాకెక్కడిదండీ తీరిక. ఇంతకూ మేం పొలిటీషియన్లం కాము కదా! జనానికి నా గురించి ఎలాంటి అభిప్రాయం వుందో అని నేనెప్పుడూ ఆలోచించనే లేదు. ఆనాటి సంఘటనతో నేను మిమ్మల్ని గురించి మరోలా అనుకోనూలేదు'' అన్నాడు బాలన్న.

"సరే! మీరు సీనియర్ జర్నలిస్టు. మీ రచనలకు ఎంత విలువుందో, మీకు 'దినసుద్ది'లో ఎంత గొప్పస్థానం వుందో నాకు తెలుసు. జనం కూడా మీ రాతలకు ఎలా స్పందిస్తున్నారో తెలుసు. నేను మాత్రం ఇప్పుడిప్పుడే రాజకీయాల్లోకి దిగినవాణ్ణి! నాలాంటి యువకుణ్ణి మీరు తప్పుగా అర్థంచేసుకుంటే మా భవిష్యత్తుకి అది గొడ్డలిపెట్టు అవుతుంది. ఏ ఒక్క రాజకీయనాయకుడూ పేపర్వాళ్ళని ఎదిరించి నిలిచింది లేదు. నేనూ అంతే! మీలాంటి పెద్దల ప్రోత్సాహం కావాలని కోరుకుంటున్నాను''

ఈ మాటలన్నపుడు సి.ఎమ్.లో వినయం ఉట్టిపడింది.

అంతలో వచ్చిన బోండాని బాలన్నవైపు జరుపుతూ రెండు కాఫీలు ఆర్డరిచ్చాడు. మళ్ళీ అతనే "ఈ చెత్తకుండీ రాజకీయం ఇంకా ముగిసిపోలేదు కదా! దీన్ని చూస్తుంటే... ఇది ఇప్పట్లో ముగిసేలా లేదనే అనిపిస్తోంది. ఇన్నేళ్ళూ చెత్తకుండీ ఎక్కడుందో ఎవరూ ఆలోచించలేదు. అది తరలించబడి అందులోంచి దుర్వాసన వచ్చేసరికి అందరికీ తమ యిళ్ళ

ముందు చెత్తకుండీ వుండరాదనే అభిప్రాయం కల్గింది. అలాగంటే ఎలా? మన వీధికి చెత్త కుండీ వద్దా? మరి కావాలనుకుంటే ఎక్కడ వుంచాలి? ఈ సమస్యకి ఏది పరిష్కారం? నాకైతే అయోమయంగా వుంది. మొన్న నా దగ్గరికి శ్రీనివాసయ్య వచ్చాడు. నేను ఈ విషయంలో జోక్యం చేసుకోలేనన్నాను. పాపం! అతను నన్ను తప్పుగా అర్థంచేసుకుని వుండాలి. మిమ్మల్ని కలవమన్నాను. మరి మీరతనితో ఏం చెప్పారో నాకు తెలీదు. బట్, ఇప్పుడు నాకేమనిపిస్తోందంటే... ఈ చెత్త కుండీని రోజూ ఒక్కొక్కరి ఇంటిముందు వుంచేస్తే ఎలా వుంటుంది అని. ఇంతకన్నా మంచి సొల్యూషన్ నాకు తోచడంలేదు'' అన్నాడు.

అందాకా సీరియస్‌గా సి.ఎమ్‌గారి మాటల్ని వింటోన్న బాలన్న చిరునవ్వుతో "మీరు జన్మతః రాజకీయనాయకులు అని ఇప్పుడర్థమైంది. నిజంగా మీకు రాజకీయాల్లో మంచి భవిష్యత్తుంది'' అన్నాడు.

సి.ఎమ్.కి ఆశ్చర్యమూ, ఆసక్తీ కలిగాయి. బాలన్న మాటల్లోని వ్యంగ్యం తెలీక కళ్ళు పెద్దవి చేసుకుంటూ "ఎలా?" అని ప్రశ్నించాడు.

బాలన్న నవ్వుతూ కొనసాగించాడు. "మన దేశంలో సమస్యల్ని ఉత్పన్నంచేసేదే రాజకీయనాయకులు. వాటికి పరిష్కారం వెదికేది వాళ్ళే! ఆ పరిష్కారం తాత్కాలికంగా వుండాలి. శాశ్వతం కారాదని కోరేది వాళ్ళే. ఎందుకంటే సమస్యలే లేకుండాపోతే రాజకీయనాయకులు పనీపాటూ లేనివాళ్ళవుతారు. మీరిందాకే అన్నారు, చెత్తకుండీని రోజుకో యింటిముందు ఉంచడమే మంచిదని. నిజంగా ఇది రాజకీయ పరిష్కారం. అందుకే మీరు జన్మతః రాజకీయనాయకులు అన్నాను''

సి.ఎమ్.కీ నవ్వొచ్చింది. "పాలిటిక్స్ ఈజ్ ఏన్ ఆర్ట్ అని ఎక్కడో చదివినట్టు గుర్తు సార్. పుట్టుకతో రాజకీయవాది అయినా అందులో షైన్ కావాలంటే ప్రతిభ కూడా కావాలి. ఇప్పుడు మీరు నాకది వుందన్నారు. థాంక్స్''

బాలన్నకి అది వ్యంగ్యమో, సూటిపోటి మాటో తెలియలా. ఊరికే తలాడిస్తూ నవ్వాడు.

అంతలో కాఫీ వచ్చింది. కాఫీ తాగుతూ సి.ఎమ్. "మిమ్మల్ని మిసెస్ శ్రీవాత్సవ ఇన్వైట్ చేశారట కదా లోగడ'' అన్నాడు.

"ఔను... మేము ఈ చెత్తకుండీ విషయంలో ఆమెకి వ్యతిరేకం కారాదట. సరే, చూద్దాం అన్నాను. కాని ఆమె మాటల్లోనూ వాస్తవముందనిపించింది. ఆమె మంచి మనిషే. కాని ఈ మున్సిపాల్టీ చెంగల్రావుగారి వాలకమే నాకు అర్థంకావడంలేదు, అదే ముఖ్యమైన సమస్య'' అన్నాడు బాలన్న.

"చెంగల్రావుగారి విషయమా? అతనో హొప్‌లెస్‌ఫెలో! పైగా చాలా కరప్టు. అతణ్ణి కావాలంటే నేను నెలలోపునే బదిలీ చేయించగలను. కాని మున్సిపాలిటీకి ఇలాంటి వ్యవహారాల్లో ఓ పాలిసీ అని లేదుకదా?"

"ఇంతకుముందు లేకపోవచ్చు. కాని మీలాంటివాళ్ళు ఇప్పుడు కౌన్సిలర్లని సమీకరించి ఓ నిర్ణయానికి రావాల్సి ఉంది''

"ఔను... మనం మన ప్రతినిధులైన కౌన్సిలర్లకు చెప్పకోవచ్చు. కాని వాళ్ళంతా ఒప్పుకోవాలి కదా?"

"మన కౌన్సిలర్ కొండయ్యగారు చాలా ఇన్‌ఫ్లూయన్సు కలవాడు. మొన్న మున్సిపాలిటీ ప్రెసిడెంటు అయ్యే అవకాశాన్ని అనారోగ్యకారణంచేత కోల్పోయాట్ట! అలాంటి వాళ్ళు చెబితే కాకుండా వుంటుందా?"

"చూద్దాం, చూద్దాం!" అన్నాడు సి.ఎమ్.

బాలన్నకి ఉన్నట్టుండి సి.ఎమ్.తో తను చెత్తకుండీ వ్యవహారంలో దినసుద్దికి రాయబోయే వార్త గురించి చెప్పాలనిపించింది. మళ్ళీ అతనికి చెప్పకుండా వుండడం మంచిదనిపించి వూరుకుండిపోయాడు.




సి.ఎమ్. బిల్లు చెల్లించి మళ్ళీ ఓ సిగరెట్టు బాలన్నకిచ్చి, తనూ ఒకటి అంటించుకుంటూ "నాకు శ్రీవాత్సవగారిని కలవాలని ఎంతో ఆసక్తిగా వుంది. కాని అతను ఎప్పుడూ ఔట్ ఆఫ్ స్టేషన్‌అట" అన్నాడు.

"ఈ ఔట్ ఆఫ్ స్టేషన్ మనిషికోసమేనా ఇప్పుడీ చెత్తకుండీ కేసు అంతా'' అనుకుని బాలన్న హుందాగా నవ్వుతూ మళ్ళీ "ప్రజా స్వామ్యంలో బ్యూరోక్రసి ఎంత బలంగా వుందో ఈ చెత్తకుండీ కేసు ఓ ఉదాహరణ. అలాగే మనదేశంలో వున్నది నిజమైన ప్రజా స్వామ్యం కాదనీ, చెత్తన్నర చెత్తప్రజాస్వామ్య మనీ అనడానికి కూడా ఈ చెత్తకుండీ వ్యవ హారం ఓ బలమైన సాక్ష్యం" అన్నాడు.

సి.ఎమ్. మారుమాట్లాడలా! డూడూ బస వన్నలా తలాడించాడు. అంతే!

★ ★ ★

సీతాపురం బస్టాండులో పేపర్లు అమ్మే పిల్లలు "రంగయ్య వీధిలో రాక్షస కృత్యాలు, రంగయ్య వీధిలో రాక్షస కృత్యాలు'' అని 'దినసుద్ది'లో వచ్చిన ప్రత్యేక వార్తని గట్టిగా చదువుతూ "కావాలా సార్ దినసుద్ది?" అంటు న్నారు.

కొంతమంది వేరే దినపత్రికల్ని తీసుకోవాల నుకుంటున్నా పిల్లల మాటలతో దినసుద్దినే కొన్నారు. మరి కొందరు "ఏ రంగయ్య వీధి?" అని ప్రశ్నించి "ఓ మన పట్టణంలోనిదేనా? ఏంటట? ఓ కాపీ యివ్వు'' అంటూ దినసుద్దిని కొంటున్నారు.

మిగిలిన వాళ్ళు "ఇదంతా ఎప్పుడూ వున్నదే'' అన్నట్టూ, తాము ఈ లోకంలోనే లేనట్టూ నిర్లిప్తంగా వుండిపోయారు.

పొద్దుట ఐదున్నరకే 'దినసుద్ది', 'ప్రజావా ణి', 'కన్నడప్రభ' అంటూ అరిచే పేపర్ పిల్లలు ఆరోజు 'దినసుద్ది' అమ్మకాలను పొద్దుటే ముగించేసి చేతులు దులుపుకున్నారు.

ఆసక్తికల్గిన జనాలు ఎదురుపడ్డవాళ్ళని "మీ దగ్గర దినసుద్ది వుందా?" అనడిగితే 'ఊ' అని కొందరు పత్రికయిస్తే మరికొందరు పత్రిక ఇవ్వకుండా వెళ్ళిపోతున్నారు. సీతాపురం బస్టాండు మాత్రం ఎలాంటి మార్పూ లేక ఎప్పటిలా జనాన్ని బస్సుల్లో నింపుతూ ఎక్కించుకుంటూ కిటకిటలాడిపోతోంది.

రోజూ ఇంటింటికీ పేపర్ వేస్తూ వెళ్ళే వాసన్న ఆరోజు ప్రతి ఇంటితలుపూ తడుతూ "దినసుద్ది కావాలా సార్. మీ వీధి ముచ్చట వచ్చింది'' అంటున్నాడు.

వాసన్న 'ప్రజావాణి' పత్రికని ఆ వీధిలోనే కాకుండా చుట్టుముట్టూవున్న మిగిలిన కాలనీ ల్లోనూ వేస్తాడు. అతను ఈరోజు పత్రికల్ని ఏజంటునించి తీసుకురావడానికి వెళ్ళగానే "కా వాలంటే 'దినసుద్ది' పత్రికనీ తీసుకువెళ్ళవ య్యా'' అన్నారు. సరే! అని వాసన్న కొన్ని దినసుద్ది కాపీల్ని పట్టుకొని బయల్దేరాడు. కాని అందులో ఏముందో చదవలా. అతనికి చది వేంత ఓపికగానీ, ఆసక్తిగానీ లేవు.

అయితే అతను తలుపులు తట్టిన వెంటనే ఇళ్లవాళ్ళంతా రంగయ్యవీధి విషయం పత్రి కలో వచ్చిందని చెప్పడం తరువాయి పత్రిక కొనేశారు. క్షణాల్లో 'దినసుద్ది' కాపీలు అమ్ము డుపోవడం చూసి అందులో ఏముందో అని వాసన్నకీ ఆసక్తి కల్గింది. చూద్దాం అనుకుంటే ఇప్పుడు అతని దగ్గర ఒక్క కాపీ కూడా లేదు. ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు పరిచయస్థుల యింటి ముందు సైకిల్ ఆపి తలుపులు తట్టి "సార్! ఇవాల్టి 'దినసుద్ది' వుందా?" అన్నాడు.

"ఎందుకయ్యా? నువ్వే అమ్మావుకదా!" అన్నాడు ఆ ఇంటాయన.

"ఔను సార్... కాని అందులో వున్న వార్త చదవాలన్న ఆసక్తితో..." నసిగాడు.

"ఓ, అదా? చదువు, రేపు కూడా వస్తుందట ఆ వార్త, రేపటి పత్రిక కూడా వెయ్యవయ్యా'' అన్నాడు. వాసన్న పత్రికని సైకిల్ బాక్సులో పెట్టుకుని 'రేపు ఇంకా యాభై ప్రతులు ఎక్స్ ట్రా యివ్వమనాలి ఏజంటుని' అనుకున్నాడు మనసులో

రంగయ్యవీధి... రోజూ ఆరు... ఆరున్నరకి

నిద్రలేచేదల్లా ఈరోజూ... మునుపటికన్నా ముందుగానే లేచింది. అంతా దినసుద్దిని చదివేవాళ్ళే! కాఫీకోసం నీళ్ళు మరగ బెడుతోన్న స్త్రీలు "ఏముంది పేపర్లో విశేషం? ఇటు ఇవ్వండి!" అంటూ కాఫీ విషయమే విస్మరిస్తే భర్తలు "ఆగవోయ్! వేడివేడి కాఫీలాగే వార్త వచ్చింది. అన్నట్టు... కాఫీ పట్రా'' అంటూ పత్రిక యివ్వక భార్యలమీద చిరుకోపం ప్రదర్శించసాగారు.

శివయ్య మాత్రం తన పేరు కూడా ఈ కథన ప్రహసనంలో వుందేమో, ఉంటే ఎలా గుందీ అనే తొందరతో పత్రిక చదవడం మొదలెడితే, ఇటు కొట్టు యజమాని వెంకటేశ్ తన అగరొత్తుల బేరపు వార్త వుందేమో అని కళ్ళు సారిస్తున్నాడు. సి.ఎమ్, రాఘవేంద్రరావు, స్వర్ణగౌరి, విమలమ్మ, శ్రీనివాసయ్య, మిసెస్ శ్రీవాత్సవ... అందరూ 'దినసుద్ది' వార్తని ఆసక్తిగా, ఆదుర్దాగా చదివి, మర్నాటి పత్రికలో ఇంకా ఏముంటుందో, ఒకేరోజు మొత్తం ప్రింటు చేస్తే బావుండేది గురూ'' అనుకున్నారు!

బాలన్న మాత్రం... తన భార్య లక్ష్మి "లేవండి! ఏంటీ రోజు ఇంత మొద్దునిద్ర?" అని లేపితే ఆవులిస్తూ ఒళ్ళు విరుచుకుని "ఈరోజు పేపర్ చూశావా?" అన్నాడు.

"ఊ! పేపర్ అబ్బాయి చెబుతూ వెళ్లాడు. మీరేం రాస్తారో నాకు తెలీదా?" అంది.

ఢిల్లీకి రాజయినా తల్లికి కొడుకే కదా! అన్నట్లు బాలన్న మీసాల్లేకున్నా దిద్దుకుంటూ లక్ష్మిని ప్రేమగా చూశాడు. "పేపర్‌వాళ్ళు అంటే మంత్రులు కూడా బెదురుతారోయ్! నీకు నేను ఉత్త భర్తనే కావొచ్చు. కాని నాతో అసెంబ్లీకి రా ఓ సారి. ముఖ్యమంత్రిగారే ఎలా ఆహ్వానిస్తారో చూడొచ్చు'' అన్నాడు.

లక్ష్మి పడిపడి నవ్వింది. "ఔనౌను. ఓ చెత్తకుండీని క్లీన్ చేయించేందుకు మీకు ఓ రోజు పట్టింది. అందుకు ముఖ్యమంత్రిగారు మీతో కరచాలనం చేస్తారు లెండి! సరేగానీ ఇహ లేచి కాఫీ తాగండి!" అంది.

బాలన్నకు నవ్వాలో, ఏడ్వాలో అర్థంకాలా. లక్ష్మి తనను ఏనాడూ ఎద్దేవా చేసింది లేదు. కాని ఇవాళ ఈమెసైతం వెటకారంగా మాట్లాడుతోందే అనుకున్నాడు.

ఇంతలో ఫోన్ చప్పుడు.

బాలన్న ఫోన్ ఎత్తి "హలో" అన్నాడు.

అవతలివైపునుంచి సి.ఎమ్. "నమస్కారం బాలన్నగారూ! చాలా చక్కగా రాశారు వార్త. రేపు ఏమిటా అన్న ఆసక్తి ఏర్పడింది. ఇంకా ఎన్నిరోజులు వస్తుంది?" అన్నాడు.

"మరో రెండురోజులపాటు రావచ్చు'' అన్నాడు నిర్లిప్తంగా బాలన్న.

"ఔనా? చాలా చక్కగా వివరించారు. భేష్! మీ వార్త మన సిటీని అల్లకల్లోలం చేస్తోంది''

బాలన్న "ఊ" అన్నాడు.

"అఫ్‌కోర్స్! నాక్కూడా బాగా నచ్చింది. అంతా చదివాక మళ్ళీ మాట్లాడతాను. అని సి.ఎమ్. ఫోన్ పెట్టేశాడు.

బాలన్న ఏమీ జరగనట్టుగానే లేచి కాఫీ, టిఫిన్ ముగించాడు. అంతలో మళ్ళీ ఫోన్ మోగింది. మున్సిపాలిటీలో ప్రతిపక్ష నాయకుడు మాధవయ్యగారు.

"హలో! సార్, మంచి విషయం రాశారు. మీరింత ఇబ్బందికి లోనయ్యారని నాకు ఏమాత్రం తెలీదు. నాదగ్గరకి మీరు వచ్చివున్నట్లయితే అన్నీ నిముషాల్లో ముగించేవాణ్ని! అంతా మనమంచికేలెండి! ఈ అధికార పార్టీ దొంగనా కొడుకుల్ని ఇప్పటికైనా గద్దె దించకపోతే... ఈ సిటీలో ప్రజాస్వామ్యమే వుండదు. ఎంత గొప్ప శాస్త్రవేత్త అయినా కానీండి, అతను ముఖ్యమంత్రి తమ్ముడో, అల్లుడో, కొడుకో కానీండి అతనికోసం ఓ వీధిలోని ప్రజలందరికీ అన్యాయం జరగడమంటే ఇదేం డెమాక్రసీ? నేను గవర్నర్‌గారిని ఇవాళే కలుస్తాను. అసంబ్లీలో ఈ సమస్య లేవదీస్తాను. చూడండి! ఇది సాంఘిక న్యాయానికి




సంబంధించిన సమస్య. రాజ్యాంగం మనకిచ్చిన హక్కుల సమస్య. దీన్నిలా వదలలేం. మీకు మా పార్టీపక్షాన కృతజ్ఞతలు'' అంటూ ఫోన్‌లో మాట్లాడారు.

బాలన్న ప్రతిపక్ష నాయకుడు మాధవయ్య మాటలకి యాంత్రికంగా ఊకొట్టడం వినా ఏమీ చేయలేకపోయాడు. ఆయనకు ఇది నచ్చలేదు. "మీరు ఇదేదో రాజకీయమని అపార్థం చేసుకోవద్దు. ఇది మానవతా సమస్య. మీ వార్తలోనే ఉందికదా ఆ సంగతి. రాజకీయం వద్దు, న్యాయం కావాలన్నారుకదా వార్తలో! అదే నేను చెబుతున్నది కూడా'' అన్నాడు.

ఫోన్‌పెట్టేయగానే మరో ఫోన్.

"హలో! నేను శ్రీవాత్సవగారి భార్యని మాట్లాడుతున్నాను. క్షమించండి! మీకు చెప్పేటంత గొప్పదాన్ని కాదు. మీరప్పుడు దీన్ని ఓ ఇష్యూ చేశారు. నేను ఇది ఇలా అవుతుందనుకుంటే మీ ఇంటిముందున్న చెత్తకుండీని ఎత్తేయండి అని చెప్పేదాన్నే కాదు. నిజానికి మావారికి ఇలాంటివాటిల్లో పెద్దగా ఆసక్తి ఉండదు. ఎంత కష్టమైనా సహించగలరు. ఆయన అలర్జీ, ఆస్తమాలతో బాధపడడం చూసి బేజారైపోయిన నేను శేషజీవితమైనా ఈ సిటీలో హాయిగా వెళ్ళదీయవచ్చుననుకున్నాను. ఆ అభిప్రాయంతోనే చెంగల్రావుగారికి ఓసారి విషయమంతా చెప్పాను. 'వారు ఓ అప్లికేషన్ ఇవ్వండి. చెత్తకుండీని అక్కణ్నించి తరలించవచ్చు. కాని పగటిపూట అయితే జనం వ్యతిరేకిస్తారు' అన్నారు. ఇది ఇల్లీగల్ అని వారిక్కానీ, నాకుగానీ అన్పించలేదు. కేవలం సింపుల్ విషయం అనే నేను అందుకు ఒప్పుకున్నాను. ఈలోగా ఏదో కుట్ర జరిగింది. ఎవరో కావాలనే అందులో ఆ కుళ్ళిపోయిన వస్తువు వేసినట్టున్నారు. ఇదంతా ఆరోజు మిమ్మల్ని మా ఇంటికి పిలిచి చెప్పేశాను. మీరూ చూద్దాంలెండి అన్నారు. ఇప్పుడేమో పత్రికలో రాసిపారేశారు. ఇదంతా మావారికి తెలిస్తే ఎంతో నొచ్చుకుంటారు. ఈ ఊరే వద్దు వెళ్ళిపోదామంటారేమో! వాస్తవంగా నేను చెంగల్రావుకి ఏమీ ముట్టచెప్పలేదు. అతను సమర్థుడో, అసమర్థుడో నాకు తెలీదు. మీ వార్త చదువుతుంటేమాత్రం అతను అసమర్థుడేకాక నీచుడనీ తెలుస్తోంది. అలాగని మేమూ నీచులమైపోయామా? అఫ్‌కోర్స్, ఐ డోంట్‌వాంట్ టూ ఇంటర్‌ఫియర్ ఇన్ దిస్ న్యూసెన్స్''

బాలన్న జవాబు చెప్పాలనుకునేంతలోనే ఆమె గబుక్కున ఫోన్ పెట్టేసింది. బాలన్నకు ఆమెతో చర్చించాల్సిన అవసరం వుందనిపించింది.

అంతలో శివయ్య వస్తూ, "మీ వార్త అద్భుతంగా వుందండీ!" అన్నాడు నోరు పెద్దది చేస్తూ. "బాలన్నగారూ! నాకు ఈ పేపర్‌వాళ్ళంటే ఓరకమైన భయం. కాని మీదగ్గర జస్టిస్ వుందని తెలిసి ఎంతో సంతోషం కలిగింది. ఏం భాష, ఏం శైలి? వండర్‌ఫుల్, వండర్‌ఫుల్!" అని బాలన్నకు ఎదురుగా కుర్చీలో కూచున్నాడు.

బాలన్న శివయ్య అమాయకత్వానికి నవ్వాడు. ఆ నవ్వు తన మాటకి మద్దతు అనుకొన్న శివయ్య మళ్ళీ, "ఇది సీరియల్‌గా వస్తుందనిపిస్తోంది. మంచి నవలే అయింది లెండి!" అన్నాడు.

బాలన్న దానికి బదులు మాట్లాడలేక నవ్వాడు. శివయ్యకు తన మాటల్ని బాలన్న తేలిగ్గా తీసేస్తున్నాడా అన్న అనుమానం కలిగి "ఎందుకు బాలన్నగారూ? మీరు నా మాటలకు చలించరేం?" అన్నాడు.

బాలన్న మళ్ళీ నవ్వుతూ "మీ మాటకు తిరుగుందా? ఎస్, నో అని ఏదో ఒకటి అనడానికి వీల్లేని మాటలు మీవి. అందుకని కేవలం నవ్వడమే మంచిదన్పించింది''

శివయ్యకు ఇప్పుడర్థమైంది. "మాలాంటి వాళ్ళు ఆఫీసుల్లో లెక్కలు చూడ్డానికే సరిపోతారేమో! అందుకే పత్రికలవాళ్ళంటే నాకు చెడ్డభయం అని ముందే చెప్పాను''

బాలన్నకు ఇతనితో చర్చించి లాభంలేదని

పించింది. ఇంతలో మళ్ళీ ఫోన్ వచ్చింది. బాలన్న ఫోన్ అందుకుని మాట్లాడుతూనే ఓ అయిదు నిముషాలపాటు గడిపాడు. గమ్మున కూచోవడం శివయ్యకు చేతకాదు. చేత్తో సైగ చేసి "వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు.

బాలన్నకు ఆరోజంతా చాలామందినుండి వచ్చిన ఫోన్‌లతోనే సరిపోయింది. మర్నాడు కూడా ఆ వార్త వేసి మళ్ళీ 'ఇంకావుంది' అని ఆపేసి సంపాదకుడుగా పాఠకుల్లో ఆసక్తిని రేకెత్తింపచేశాడు.



కాని ఆ మర్నాడు బాలన్నకు ఎక్కువగా ఫోన్లు రాలేదు. వార్త తర్వాతిభాగం ఎలా వుంటుందో అని అందరూ కుతూహలంగా ఎదురుచూస్తున్నట్టుగానే బాలన్న కూడా ఆరోజుకోసం ఎదురుచూడసాగాడు.

మరుసటిరోజు ఎప్పుడు తెల్లవారుతుందా అనుకుంటూ పడుకున్న బాలన్నకు వేకువజామున గాఢనిద్ర పట్టింది. రాత్రంతా పక్కమీద అటూ ఇటూ దొర్లిన మగణ్ని గమనించిన లక్ష్మి, "లేని తంటాలు తలకు పట్టించుకుని నిద్ర ఎందుకు చెడగొట్టుకుంటున్నారు? ఇదంతా మీకెందుకు?" అంది.

"ఊరుకో! పత్రికలు ఎందుకున్నాయి? సాంఘిక న్యాయంకోసమేకదా! ఇది తంటా అనుకుంటే ఎలా?" అన్నాడు.

"మీ సాంఘికన్యాయం ఎలాంటిదో నాక యితే అర్థంకావడంలేదు'' అంది లక్ష్మి. ఆ తర్వాత చిరుకోపంతో ముసుగుతన్ని పడు కుంది. కానీ ఆమెకి నిద్ర రాలేదు. మగని మనసులో ఏదో ఆందోళన వున్నట్టుంది. ఈ వార్త రావడంతో ఏదైనా జరగొచ్చు అని ఆమెకు కూడా లోపల్లోపల భయంగావుంది. కాని నోరువిప్పి ఈ విషయాన్ని అతనితో ప్రస్తావిస్తే మళ్ళీ ఎక్కడ హడలగొడతాడో అని కిమ్మనకుండా వుండిపోయింది.

బాలన్న ఫోన్ చప్పుడుతో నిద్రలోంచి లేచా డు. లేచి కూచుంటూనే ఫోన్ ఎత్తి కళ్ళు నులుముకున్నాడు. తర్వాత "హలో!" అన్నా డు. అవతలివైపునుంచి ఆడగొంతు విన్పించింది.

"ఈనాటి పత్రికలో బాగా రాశారు. కాని మీరు రాసేది వేరు. చేసేది వేరు. మాకు ఈ రాతలు, కోతలు తెలియవన్నట్టు మిడిసిపడు తున్నారు. మా నోళ్ళు మూయించే ప్రయత్నం చేస్తున్నారు. కానీ ఇది మీకు మంచిదికాదు''

మాటలు దూకుడుగా వస్తున్నాయి. ఎక్క డో విన్నస్వరం. ఎవరీవడ అనేది బాలన్నకు స్ఫురించలేదు.

ఆమె వాగ్ధాటికి ఆనకట్ట వేస్తూ, "హలో మీరెవరో ముందు చెప్పండి. ఆ తర్వాత మీ ఆరోపణకు సాక్ష్యాలు చూపండి'' అన్నాడు.

"నన్ను గుర్తుపట్టలేదా? శ్రీవాత్సవగారి భా ర్యని. అంటే మాలతిని. మీరు చేసిన ఘన కార్యానికి నేను సాక్ష్యం చూపించాల్సిన పనిలే దు. మీరే వచ్చి స్వయంగా చూడొచ్చు. చూడండి! మళ్ళీ ఈరోజు మా ఇంటిముందే చెత్తకుండీ పడివుంది''

"ఆ... ఏమన్నారు?" బాలన్న దిగ్భ్రమ చెందాడు.





"ఎందుకిలా నటిస్తున్నారు బాలన్నగా రూ?"

"లేదుమేడం. నేను ఈ పని చెయ్యలేదు''

"నో... నేనొప్పుకోను. మీరే ఇది చేయించా రు. ఈ వీధిలో ఎవరికీ మీలా మామీద కోపతాపాల్లేవు''

"కాని నాకూ ఈ చెత్తకుండి చలనానికి ఎలాంటి సబంధమూ లేదు''

ఆమె ఠక్కున ఫోన్ పెట్టేసినట్టుంది. బాల న్న ఆశ్చర్యంలోంచి తేరుకోక, 'ఇది ఎవరిపనై వుంటుంది?' అని ఆలోచిస్తూ బాత్రూంకు వెళ్ళా డు. ముఖం కడుక్కుని కాఫీ తాగుతూనే బల్లమీది 'దినసుద్ది' పత్రిక తీసుకుని వార్త చివరిభాగం చదివాడు. వార్త ప్రకటించబడు తున్నకొద్దీ ఈ రాక్షసకృత్యం ఆగిపోవడానికి బదులు మరింత ఎక్కువగా తనే ఈ పనికి కారకుణ్ని అనే ఆరోపణకి గురయ్యానే అని కలవరపడ్డాడు. ఈరోజే మరో రిపోర్టు రాసి శ్రీమతి శ్రీవాత్సవగారు చేసిన ఆరోపణను ఉటంకించి, తనకీ, దీనికి సంబంధంలేదని పత్రికకి పంపిస్తే ఎలా వుంటుందని ఆలోచించ సాగాడు. అంతలో ఫోన్ పిలుపు.

"నేను నర్సయ్యని. తెలుసుకదా? అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుణ్ణి. మీ సీతా పురం మున్సిపాలిటీ మాధవయ్యగారు మొ న్ననే ఫోన్‌చేసి మీ వార్త చూడమని చెప్పారు. ఆరోజే చదివాను. ఫాలో అయ్యాను. మొ త్తంమీద కొన్ని గంభీరమైన ప్రశ్నల్ని లేవనెత్తా రు. 'ఈ ప్రభుత్వం చూడండి! కొంతమంది వైట్‌కాలర్లకోసం ప్రజలక్షేమం గురించి పట్టించుకోవడమేలేదు. ప్రజలకోసం ప్రభుత్వ మా? లేక చెంగల్రావువంటి వైట్ ఎలిఫెంట్సుకో సమా? ఇలాగైతే మన ప్రజాస్వామ్యానికి పర మార్థం ఎక్కడిది? దీన్ని ఇలా వదిలేస్తే లాభంలేదు. అసెంబ్లీలో ఈ విషయాన్ని ప్రస్తా వించాలని నిర్ణయించుకున్నాను. ఇందుకోసం నేను రాబోయే అసెంబ్లీ సమావేశాలకన్న ముందు మీదగ్గరికి వస్తాను. మీ సహకారం అవసరం"

బాలన్న "ఓహ్! ష్యూర్" అని ఆపాడు. నర్సయ్య కొనసాగించాడు. "మీరిది పెద్ద ఇష్యూ అవుతుందని హడలిపోకండి. ఇది కేవలం చెత్తకుండీ సమస్యకాదు. ప్రభుత్వపు చిత్తశుద్ధి ప్రశ్న. దీన్ని ఎంత పెద్దగా చేయాలో నాకు బాగా తెలుసు. మీక్కూడా ప్రఖ్యాతి వస్తుంది. మీ పత్రికాధిపతి నా ఫ్రెండు. మీరైనా, ఎస్.ఐ.గారైనా అధికారపార్టీనుంచి ఎలాంటి బెదిరింపులు ఎదురైనా భయపడ కండి. నాకు చెప్పండి. వీళ్ళని ఎలా వంచాలో నాకు బాగా తెలుసు. చూడండి! నా ఫోన్ నంబర్ తీసుకోండి. రాసుకోండి'' అని నంబర్ చెప్పాడు.

బాలన్న 'ఊ' అంటూ ఫోన్ పెట్టేశాడు. అంతలో మాధవయ్యగారి ఫోన్. మళ్ళీ అదే! బాలన్నని ఆకాశానికి ఎత్తటం. అతనికి తన మద్దతుందని తెలపడం. రంగయ్య వీధిని ఈరోజే సందర్శించి ప్రత్యక్షంగా పరిశీలిస్తానని భరోసా ఇవ్వడం.

బాలన్నకు చికాగ్గా వుంది. ఈ ఫోన్‌కాల్స్ తప్పించుకునే ఉపాయం... బయటికి వెళ్ళ డమో, లేక రిసీవర్ తీసి కింద పెట్టేసెయ్య డమో! అయితే అలా అయినా ఇబ్బంది తప్పదనుకొని బయటికి వెళ్ళడమే మంచిదని భావించి డ్రెస్సు మార్చుకోసాగాడు. ఇంతలో మళ్ళీ ఫోన్.

"హలో! బాలన్నా?"

"ఊ! ఎవరు మాట్లాడేది?"

"నేను చెంగల్రావుని. ఏం స్వామీ? పెన్ను ఉందని ఇష్టమొచ్చినట్టు రాసిపారేస్తారా? నేను నీచుణ్ని అన్నట్టు రాశారే? దానికి ప్రూఫ్ ఎక్కడండీ? ఇంతకీ ఈ దేశంలో నీచత్వం లేనిదెవరిలోనో చెప్పండి. మీరొక్కరే ధర్మరాజు వంశానికి చెందినవాళ్ళేమో! కాని ఈరోజుల్లో ధర్మరాజు బతికివుంటే అతనూ అలా వుండకపోయేవాడు. ఉత్తిత్తినే మీకు లేని అధికారాలు నాకున్నాయని చూసి ఉడుక్కుని చేతికొచ్చినట్టు రాస్తారా? సాంఘిక న్యాయం, సమర్థత... ఇలాంటి బరువైన పదాలు రా యడం, మాట్లాడ్డం సులభమే! కాని అలా రాసేవాళ్ళూ, కూసేవాళ్ళూ ఎలాంటివాళ్ళో నా పాతికేళ్ళ సర్వీసులో చూశానండీ! మీకన్న ముందు ఓ పాత్రికేయుడు మీలానే పెద్దపెద్ద మాటలు దొర్లించేవాడు. హౌస్‌సైట్ ఇచ్చిన వెంటనే చచ్చిన పీనుగులా నోర్మూసుకుని వుండిపోయాడు. మీరిప్పుడు చేసేది రాజకీయ మే! నేనంటున్నాను ఈ రాక్షసత్వం చేసింది మీరేనని. మీ నిర్వాకం కాకపోతే మరేమిటి? లేకపోతే నిన్నటిదాకా శ్రీనివాసయ్యగారి ఇంటిముందున్న చెత్తకుండి మళ్లీ శ్రీవాత్సవ గారి ఇంటిముందుకు ఎలా వెళ్తుంది? అదీ నాకు తెలీకుండా. ఇది మీపనే! ఓ అయ్యకు పుట్టినోడు ఎవ్వడూ యిలాంటి పని చెయ్య డు''

బాలన్న ఫోన్ పెట్టేసి ఎస్.ఐ. రామస్వామి కి రింగ్ చేశాడు. అవతలివైపునుంచి "బాలన్న గారేనా? నమస్కారం?" అన్న జవాబు వచ్చింది.

"ఎలా వున్నారు సార్? మా వార్త చూ శారా?"

"హుం... అంతా చదివాక మీతో మాట్లాడా లనుకున్నాను. బాగా రాశారు. కాని నా విషయం రాయకుండా వుంటే బావుండేది!"

"అంటే రాజీనామా ఇచ్చేందుకు మీరు సిద్ధంగా లేరు అనండి''

"నో, నో! అలాంటి సమస్య ఎదురైతే ఖచ్చితంగా ఇస్తాను. ఇప్పుడది రాజకీయ నాయకులకు ఓ అవకాశం అవుతుందని''

"గొప్ప బుద్ధిమంతులు మీరు. ఇప్పటికే ఈ వార్త రాజకీయ నాయకులకు ఆయుధంగా మారిపోయింది. నాకు మున్సిపాలిటీలోని ప్ర తిపక్ష నాయకుడు మాధవయ్యగారూ, వాళ్ళ పార్టీ రాష్ట్ర నాయకుడు నర్సయ్యగారూ ఫోన్‌చే శారు''

"అదే నేనంటోంది. అందువల్లే నేను ఈ విషయంలో ఎవరిముందూ మాట్లాడలేకపోతు న్నాను. అన్నట్టు... నిన్నటిరాత్రి మా వీధిలో ఓ

రాక్షసకృత్యం జరిగిపోయింది చూడండి! ఇవాళ మీకు రాతపూర్వకంగా చెత్తకుండీ రక్షణ కోసం ఆదేశాలు రావచ్చు''

రామస్వామి నవ్వుతూ "రానీండి! వస్తే తప్పుతుందా? గాడిదల్ని కాయడానిక్కూడా తయారవ్వాల్సిన శాఖ మాది. అలాంటప్పుడు చెత్తకుండి ఓ లెఖ్ఖా?" అన్నాడు.

బాలన్న అన్యమనస్కంగా నవ్వాడు.

రామస్వామి, "చూడండి బాలన్నగారూ! మీరు ఈ చెత్తకుండికి సంబంధించి రాక్షసత్వం అంటూ ఏదేదో రాసేశారు. అందుకు కారకులు ఎవరనే ప్రశ్న లేపి కొన్ని ఆధారాలతో మరికొన్ని ఊహలతో మా బుర్రలు ఖరాబుచేశారు. ఈ నేపథ్యంలో మీ వార్త ప్రకటించిన మొదటిరోజునుండే ప్రారంభించి ఇప్పటివరకూ నేను కొంత సీరియస్‌గానే సమాచారం సేకరించాను. దీని వెనుక ఉన్నది ఎవరైవుంటారో తెలుసా?" అన్నాడు.

బాలన్న ఊపిరి బిగపట్టుకుని మెల్లిగా అడిగాడు, "ఎవరు?"

"చూడండి.. మన మున్సిపాలిటీ అధికార పార్టీలో రెండు ముఠాలున్నాయి. ఇప్పుడు అధికారంలో వున్న అధ్యక్షుణ్ని ఎలాగైనా గద్దె దింపాలన్నది అసమ్మతివర్గీయుల ఆకాంక్ష"

"మీరు చెప్పేదానికి ఆధారాలున్నాయా?"

"లేవు... అండర్ ఇన్వెస్టిగేషన్ అన్నమాట. కాని మా డిపార్టుమెంటుకి అలా వాసన చూసి ఇలా నేరస్థుల్ని పట్టగలిగే సామర్థ్యం ఉంది. అందుకే చెబుతున్నాను ఇది అసమ్మతీయుల పని అని''

"కావచ్చు... ఎండ్రకాయల కథ తెలుసా మీకు?"

"లేదే?"

బాలన్న నవ్వుతూ, "ఈమధ్య విదేశాల్లో ఓచోట... ఇంగ్లండ్ అనుకోండి... ప్రపంచంలో వున్న అన్నిరకాల ఎండ్రకాయల ప్రదర్శన జరిగిందట! అన్నిదేశాల ఎండ్రకాయల్ని వాటి జాతిని ఆధారంగా విభజించి వాటిని గ్లాసుల్లో వేసి మూశారట. కాని ఇండియా ఎండ్రకాయల్ని గ్లాసులో వేసి అలాగే వదిలేశారట. అంటే మూతపెట్టలేదు. నాలాంటి ఓ పెద్ద జర్నలిస్టు... ఇదేమిటి ఇండియన్ ఎండ్రకాయలున్న గ్లాసుని మూయలేదే? అని అడిగాట్ట. ఆ ప్రదర్శనా నిర్వాహకులు ఇలా చెప్పారట. 'ఇండియన్ ఎండ్రకాయలు... ఒకటి మరోదాన్ని బయటకు వెళ్ళనివ్వకుండా పట్టేస్తాయి. చచ్చిచెడీ ఒకటి పైకి వెళ్ళగానే మిగతావి దాని కాళ్ళు పట్టి లాగేస్తాయి. అందుకని ఆ గ్లాసు మీద మూత అక్కర్లేదు. కాని ఇతరదేశాల ఎండ్రకాయలు అలాకాదు. తమకు ఛాన్స్ లేకపోతే ఒకటి మరోదానికి అవకాశమిచ్చి గ్లాసునుంచి బయటికి ఎలాగైనా పంపించగలుగుతాయి. అందుకనే వాటిని మూసివుంచాం' అన్నాడుట!"

రామస్వామి బాలన్న మాటలు విని పొట్టచెక్కలయ్యేలా నవ్వి, "మీ వీధిలోనే ఓ పీత వుంది. ఆరోజే చెప్పాను. మీరు గమనించడమేలేదు'' అన్నాడు.

"ఎవరా ఎండ్రకాయ?"

"ఎవరో కాదండీ! సి.ఎమ్."

"ఇంపాజిబుల్... అలాంటి వ్యక్తి కాదతను''

"సరే! మీ ఇష్టం"

"బాలన్న ఫోన్ పెట్టేసి భార్యతో, "పేట వైపు వెళ్ళివస్తాను. నా భోజనంకోసం ఎదురు చూడకు'' అన్నాడు.

ఇంటినుంచి బయల్దేరిన బాలన్నకు ఎక్కడికి వెళ్ళాలో తోచలేదు. ఎన్నడూ ఇలా లక్ష్యంలేకుండా ఇంటినుంచి బయటపడింది లేదు. ఇది మొదటి అనుభవం. జీవితం కూడా ఇలాంటిదే! పుట్టేటప్పుడు దానికి ఓ లక్ష్యమంటూ వుండదు. ఎవరికివారే తమతమ ఉద్దేశ్యాలకు అనుగుణంగా జీవితాల్ని తీర్చిదిద్దుకోవాల్సి వుంటుంది'' అన్న సార్త్రే మాటలు గుర్తుకొచ్చాయి. ఎందుకిలా జరుగుతోందో బాలన్నకు అయోమయంగా వుంది.




ఎక్కడికి వెళ్ళాలో తెలీకుండానే బాలన్న లూనా నడుపుతున్నాడు. అంతలో ఓ హెూటల్‌ముందు బండిని ఆపి లోపలికి వెళ్ళాడు. ఎవరూ లేనిచోట ఓ టేబుల్‌ముందు కూలబడి సప్లయర్‌తో 'కాఫీ' అన్నాడు. అంతలో ఎదురుగా వున్న మరో టేబుల్‌దగ్గరి కుర్చీలో వున్న వ్యక్తి కాఫీ చప్పరిస్తూనే తనవంక తదేకంగా చూడటం బాలన్న గమనించాడు. ఆ మనిషి మళ్ళీ మళ్ళీ బాలన్నని చూస్తూ నిదానంగా లేచి బాలన్న దగ్గరికొచ్చాడు.

"క్షమించండి! జర్నలిస్టు బాలన్న అంటే తమరేకదా?" అని ప్రశ్నించాడు.

బాలన్న "ఊఁ" అన్నాడు. మర్యాదకోసం కూడా బాలన్న అతన్ని ఎవరని ప్రశ్నించలేదు. మనశ్శాంతికోసం వచ్చిన తనకు మళ్ళీ ఇక్కడా డిస్టర్బెన్స్ తప్పటంలేదనుకున్నాడు.

ఆ కొత్తవ్యక్తి కుర్చీ లాక్కుని అక్కడే కూచుంటూ, "మీ అభిమానిని సార్ నేను. మీ వార్తల్ని ఎన్నింటినో చదివాను. గత మూడురోజుల్లో 'రంగయ్యవీధిలో రాక్షసకృత్యం' వచ్చిందికదా! అది అద్భుతంసార్! ఫెంటాస్టిక్!" అన్నాడు.

బాలన్న చిన్నగా నవ్వి వూరుకున్నాడు.

ఆ మనిషి మరింత ఉత్సాహంతో తనతోపాటు అంతసేపూ అక్కడ కాఫీ తాగుతోన్న మరో ఇద్దర్ని పిలిచి, "రండి! వీరే బాలన్నగారు'' అని పరిచయం చేశాడు.

"ఏ బాలన్న?" అంటూ కుతూహలంతో ప్రశ్నించి నమస్కరించారు వాళ్ళు.

బాలన్నకు ఇదంతా అనీజీగా వుంది. వెళ్ళిపోవాలనిపిస్తోంది. "ఓ పేపర్‌వాళ్లా?" అంటూ ఆ ఇద్దరూ కుర్చీలు లాక్కుని అతుక్కుపోయారు. అంతలో కాఫీ వచ్చింది. కాఫీ తాగే హడావుడిలో బాలన్నవుండగా వచ్చినవాళ్ళ లోంచి ఒకరు "టిఫిన్ వద్దా సార్?" అన్నాడు.

సప్లయిర్ "ఏం కావాలి?" అని అడిగాడు.

బాలన్న "క్షమించండి! ఎందుకో తలనొప్పిగా వుంది'' అంటూ కౌంటర్‌దగ్గరికి వచ్చాడు. అతన్ని అనుసరించిన ఆ ముగ్గురూ బాలన్న వద్దంటున్నా వినక కాఫీ బిల్లు చెల్లించి హెూటల్ మేనేజర్‌కి బాలన్నను పరిచయంచేశారు.

అతను నమస్కరిస్తూ... "వద్దు... వారి బిల్లు వద్దు'' అంటూ డబ్బులు వాపస్ యిచ్చేశాడు. తర్వాత మళ్ళీ "బావుంది సార్ మీ వార్త ఇలాగే రాస్తూవుండండి సార్' అన్నాడు.

బాలన్నకు నవ్వొచ్చింది. తల కూడా నెప్పిగా వుంది. చకచకా లూనాదగ్గరికొచ్చి స్టార్టుచేశాడుగానీ ఎక్కడికి వెళ్ళాలో తోచలేదు. ఊరికినే పేట పొడుగూతా తిరిగాడు. ఎందుకిలా జరిగిందో తనకే తెలియటంలేదు. మధ్యాహ్నమైంది. ఆకలి దంచేస్తోంది. భోజనానికి ఎదురుచూడొద్దు అని భార్యతో చెప్పినప్పటికీ ఇంటికి వెళ్ళి భోజనం చేయడమే మంచిదనిపించి బయలుదేరాడు.

బాలన్న రంగయ్య వీధికి వచ్చేసరికి చెత్తకుండీ మళ్ళీ శ్రీనివాసయ్యగారి ఇంటిముందు ప్రత్యక్షమైంది. దాని దగ్గర్లోవున్న చెట్టునీడలో ఓ పోలీస్ లారీతో నించునివున్నాడు. బాలన్నకు నవ్వాలో ఏడ్వాలో అర్థంకాలేదు. నేరుగా ఇంటికి వెళ్ళాడు.

లక్ష్మి భోజనం చేసి కూచున్నట్లుంది. "వెంటనే రానంటూ వెళ్ళి ఇట్టే వచ్చేశారేం?" అంది విస్తుపోతూ.

"ఆకలిగా వుంది. అన్నం పెట్టు'' అన్నాడు బాలన్న. లక్ష్మి వడ్డించింది. తింటూ "మళ్ళీ ఫోన్ వచ్చిందా?" అన్నాడు.

"వస్తూనేవుంది. ఎత్తి ఎత్తి ఓపిక తగ్గింది''

"ఎప్పుడూ మీకిలా ఫోన్లు రాలేదు. ఏంటి విశేషాలు?" అంది అమాయకంగా.

"నీకు అంతా తెలుసుగా?"

"ఎందుకివాళ అదోలా వున్నారు? మీకు ఏమైంది?"

"నాకేమైంది?" అంటూ బాలన్న తిండి

ముగించి లేచాడు.

అంతలో శివయ్య వచ్చాడు. అతని వెనకాలే శ్రీనివాసయ్య.

ఇద్దర్నీ కూచోమని చెప్పి బాలన్న మిన్నకుండిపోయాడు. శివయ్య ఎన్నో విషయాలు బాలన్నని అడిగాడుగానీ బాలన్నమాత్రం నిరుత్సాహంగా బదులిచ్చాడు.

శ్రీనివాసయ్య "నేను ఈ వూర్నించి వెళ్ళిపోవడమే మంచిదని నిర్ణయించుకున్నాను'' అన్నాడు.

"చెత్తకుండి వుంటే వుండనీండి! కంపు వాసన వస్తేకదా మీకు ఇబ్బంది? దీనికి భయపడి వెళ్ళిపోతారా మాస్టారూ?" అన్నాడు శివయ్య. బాలన్న ఏమీ అనలేదు.

"ఒంట్లో నలతగా వుందా? మీరివాళ మూడ్‌లో లేరు'' అన్నాడు శివయ్య

బాలన్న 'ఊ...' అని ఊరుకున్నాడు.

"అయితే రేపు వస్తాను'' అన్నాడు శ్రీనివాసయ్య. మంచిది అన్నట్లుగా బాలన్న తలూపాడు. శివయ్య కూడా వస్తానంటూ వెళ్ళిపోయాడు.

అంతలో తల్లి భాగీరథమ్మ మూలిగినట్టు అనిపించింది. బాలన్న "లక్ష్మీ!" అని పిలిచాడు.

ఆమె వంటింట్లోంచి వస్తూ "ఏంటి?" అంది.

"అమ్మకు ఎలా వుంది?"

"బాగానేవుంది. కాని ఎప్పటిలా భోంచేయలేదు''

"మూలుగుతున్నట్టుందికదా?"

"ఔను బాలూ!" అంది భాగీరథమ్మ క్షీణ స్వరంతో.

బాలన్న లేచి తల్లిదగ్గరికి వెళ్ళాడు. భాగీరథమ్మ చిన్నగా మూల్గుతూ, "పొద్దుట్నించీ నాకెందుకో బాగోలేదు. ఇంక బతకనని పిస్తోంది. ఏమవుతుందోమరి!" అంది కొడుకుతో.

"అయితే డాక్టర్ దగ్గరికి వెళతాను''

"డాక్టర్లుమాత్రం ఏంచేస్తారు? చెయ్యాల్సిన ప్రయత్నాలన్నీ చేశావు నువ్వు. చావుగురించి నాకు భయంలేదు. కాని నా ఆశ... మన వంశాంకురాన్ని చూసి కళ్ళుమూయాలనుంది'' అంది మరింత క్షీణించిన స్వరంతో.

బాలన్నకు ఏం మాట్లాడాలో తోచలేదు.

"ఇలాంటి విషయాలతో నీ ఆరోగ్యం పాడు చేసుకోవద్దమ్మా!" అన్నాడు మెల్లిగా బాలన్న. తర్వాత బయటకొచ్చాడు.

ఇంట్లో చావుకోసం ఎదురుచూస్తోన్న తల్లి...

తను రాసిన వార్తకు సంబంధించి పదేపదే ఫోన్లు...

శ్రీనివాసయ్య ఈ ఊరొదిలి వెళ్ళిపోతాను అన్నప్పుడు అతని ముఖంలో గూడుకట్టుకున్న నిస్సహాయత...

తను కలంతో సాధించినదాన్ని క్షణంలో నాశనంచేసిన చెంగల్రావుగారి ఘనకార్యం...

చెత్తకుండీ కాపలాకోసం వచ్చిన పోలీసు...

ఇవన్నీ బాలన్నను బతుక్కి అర్థం ఏమిటో చెప్పమన్నట్టు నలువైపులనుంచీ నిలదీస్తున్నట్టున్నాయి.

ఇంట్లో వుంటే పదేపదే ఎదురయ్యే ఈ సమస్యల్నుంచి తప్పించుకుందామని బయటికి వెళితే అక్కడ కూడా ఏదో ఓ ప్రశ్న, వీటితోపాటు ఎక్కడికీ వెళ్ళనీయని తల్లి అనారోగ్య పరిస్థితి...

బాలన్న సిగరెట్టు ముట్టించాడు.

ఒకటి, రెండు, మూడు... ఇలా తగలేయసాగాడు.

"భోజనానికి రండి'' అంది శ్రీమతి.

"అమ్మ భోంచేసిందా?"

"ఆమెకు ఏమీ అక్కర్లేదుట!"

"పాలు అయినా ఇవ్వు''

"వద్దు అంటోంది. మీరే ఇవ్వండి!"

"సరే!" అంటూ బాలన్న తల్లిదగ్గరికి వెళ్ళి, "ఎన్నడూ నువ్వు పరగడుపుతో వుండలేద




మ్మా! కాసిన్ని పాలు తాగు'' అన్నాడు.

అయితే ఇవ్వమంటూ అందుకు ఒప్పుకుంది తల్లి. బాలన్న భార్యని పిలిచి పాలు తెప్పించాడు. తల్లిని నెమ్మదిగా లేపి తన గుండెలమీద ఆమె తలని పెట్టుకుని పాలగ్లాసు అందించాడు. భాగీరథమ్మ అతి కష్టంమీద పాలు తాగుతూ, "ఇదే నా చివరి ఆహారం కావచ్చు'' అంది మెల్లిగా.

"అలా అనొద్దమ్మా!" అని బాలన్న తల్లిని ప్రేమగా మందలించి మళ్ళీ పడుకోబెట్టి భోజనానికి లేచాడు.

సీరియస్‌గా భోంచేస్తోన్న భర్తతో లక్ష్మి "నిన్నా మొన్నా బాగానే వున్నారు. ఉన్నట్టుండి ఏమైందో తెలియదు. ఆమె వద్దన్నా మీరు డాక్టర్ని పిలవడం బావుంటుంది'' అంది ఆందోళనగా.

బాలన్న మాట్లాడకుండానే ఆమె ముఖంలోకి చూశాడు. అతని చూపుల్లోని దీనత్వం ఆమెలో భయాందోళనల్ని మరింత ఎక్కువ చేసింది. "ఎందుకలా చూస్తున్నారు నన్ను?" అంది కంగారుగా లక్ష్మి.

బాలన్న మాట్లాడలేదు. అతని కళ్ళముందే తన తల్లి చిన్నతనంలో తనని సాకిన విషయాలు, లక్ష్మిని తన కూతురిలా ఆమె చూసుకొన్న వైనం, తల్లి ఆఖరికోరికైన వంశోద్ధారకుడికి జన్మనివ్వలేని తన బలహీనత... అన్నీ కళ్ళ ముందు కదలాడుతున్నాయి. తిండి సయించక అలాగే లేచి వెళ్ళి పక్కమీద బోర్లా పడుకున్నాడు.

వంటింటి పని ముగించుకుని వచ్చిన లక్ష్మి అలా పడుకున్న భర్త దగ్గరికొచ్చి అతని తలని ప్రేమగా నిమురుతూ, "ఎందుకో ఈరోజు మీరు విచిత్రంగా ప్రవర్తిస్తున్నారు. మిమ్మల్నీ, అత్తగారినీ చూస్తుంటే నాకు భయంగా వుంది'' అంది.

బాలన్న ఆమెని దగ్గరికి లాక్కుంటూ "ఎంత పిచ్చిదానివి లక్ష్మి! నేను ఆరేళ్ళప్రాయంలో వున్నప్పుడే మా నాన్నగారు పోయారు. అప్పట్నించీ మా అమ్మే చచ్చీచెడి నన్ను ఇంతవాణ్ణి చేసింది. నేనేమీ భయపడడంలేదు. భయపడి సాధించేదీ లేదు'' అన్నాడు పొంతన లేకుండా మాట్లాడుతూ.

రాత్రి పడుకునేటప్పుడు లక్ష్మి "నేను ఈరోజు అత్తగారిదగ్గరే పడుకుంటాను. రాత్రి ఆమె మూల్గుతూ మంచినీళ్ళు అడిగితే నాకు విన్పించదు. మీరొక్కరే ఇక్కడ పడుకోండి!" అంది.

బాలన్న మంచిదన్నాడు. లక్ష్మి అత్తగారి పక్కన పక్క వేసుకుంది.

బాలన్న కళ్ళు మూసుకున్నాడు, గానీ నిద్ర రావడంలేదు. తలనిండా ఏవేవో ఆలోచనలు.

లేచాడు... పడుకున్నాడు, మళ్ళీ లేచాడు.

సిగరెట్టు కాల్చాడు. మళ్ళీ పడుకున్నాడు.

లేచి తల్లినీ, భార్యనీ చూశాడు. మళ్ళీ వెళ్ళి పడుకున్నాడు.

నిద్రరాక అతని కళ్ళముందు వేకువజామున నాల్గుగంటల సమయంలో ఓ స్వప్నం పరదావెనుకలా లీలగా కదలసాగింది.



శివయ్య మెల్లగా వచ్చి బాలన్న ఇంటి తలుపులు తట్టాడు.

పేపర్ చదువుతోన్న బాలన్న "ఓ మీరా రండి?" అంటూ ఆహ్వానించి "లక్ష్మి!" అన్నాడు.

"వద్దు... కాఫీ తాగే వచ్చాను. లక్ష్మి అక్కగారికి అనవసరంగా ఇబ్బంది వద్దు. పైగా నేను రోజూ వచ్చేవాణ్ణే కదా? అన్నట్టు... మీకు ఈ విషయం తెలుసా?" అన్నాడు.

"ఏ విషయం?" బాలన్నలో కుతూహలం హద్దులు మీరింది.

"మన రాఘవేంద్రరావు శ్రీవాత్సవగారి ఇంటిముందున్న తన సైట్ శ్రీవాత్సవగారికి అమ్మేశారట కదా?"

"అలాగా! అమ్ముకోనివ్వండి! మన దగ్గర డబ్బుల్లేవు. డబ్బులున్నవాళ్ళు కొనుక్కున్నారన్నమాట"

"అది సరే బాలన్నగారూ! ఇక్కడ వున్నది డబ్బుల సమస్య కాదు చెత్తకుండీ సమస్యే!"

చెత్తకుండీకి, ఆ స్థలానికీ ఏంటండీ సంబంధం?" కాస్త గట్టిగానే అన్నాడు బాలన్న చేతిలో వున్న పత్రికని మడిచిపెడుతూ.

శివయ్య "పేపర్స్‌వాళ్ళు ఎంతో తెలివిగలవాళ్ళనుకున్నాను. కాని మీరు..." అంటూ బాలన్నను రెచ్చగొట్టాడు.

బాలన్న "వివరంగా చెప్పు స్వామీ!" అన్నాడు తన ఓటమిని ఒప్పుకుంటూ.



శివయ్య మరింత చొరవతీసుకుని, "తమా షాకోసం అంటే మీరు సీరియస్ అవుతున్నారు. రాఘవేంద్రరావు దగ్గర ఆ శాస్త్రవేత్త హౌస్‌సైటు ఎందుకు తీసుకున్నారంటే... అక్కడ ఓ గుడిని కట్టిస్తారట! ఆ తర్వాత గుడి ముందర చెత్తకుండి వుంచండి అని ఎవరూ పట్టుపట్టరు కదా! అదీ వాళ్ళ ఐడియా''

"హు... ఎవరు చెప్పారు మీకు ఈ విషయం?"

"ఇంకెవరు సార్? స్వయంగా రాఘవేంద్రరావే చెప్పాడు. కావాలంటే మీరూ అడగండి!"

బాలన్నకు పాతాళంలోకి జారిపోతున్నట్టుగా వుంది. అతని వార్త సీతాపురం మున్సిపాల్టీ నెలవారీ సమావేశంలో అల్లకల్లోలాన్ని రేపింది. అధ్యక్షుడు రాజీనామా ఇవ్వాలి లేదా చెంగల్రావు బదిలీ కావాలి అన్న సమస్య వుత్పన్నమైంది. అధికార పక్షంలోని అసమ్మతీయులు ప్రతిపక్షం వాళ్ళతో కలిసిపోయి మున్సిపాలిటీ అధ్యక్షుణ్ణి, చెంగల్రావును ఇరకాటంలో పెట్టేశారు. అధ్యక్షుడు ముఖ్యమంత్రి గారి ఇంటికీ, పార్టీ అధ్యక్షుడి ఇంటికి కాళ్ళరిగేలా తిరిగి అసమ్మతివాదులమీద క్రమశిక్షణ చర్యలు తీసుకోవలిసిందిగా పట్టుపడుతూ అధికారపీఠానికి అంటిపెట్టుకునేందుకు ఏయే దారులున్నాయో తన ఆప్తులతో చర్చిస్తూ బెంగుళూరులోనే మకాం పెట్టారన్న వార్త బాలన్నదాకా చేరింది. అదే సమయంలో చెంగల్రావు ఎట్టి పరిస్థితుల్లోనూ తనకు బదిలీ కారాదనీ, అయినట్లయితే తను స్వచ్ఛంద పదవీ విరమణ తీసుకోగలననీ తనకు మద్దతుగా యితర మున్సిపాలిటీ మెంబర్లున్నారనీ బెదిరిస్తూ అటు ముఖ్యమంత్రిగారి దగ్గర పడిగాపులు పడుతున్నాడు. సెక్రటరిని కలిసి చట్టప్రకారం నడుచుకున్నందుకు బదిలీ రూపంలో శిక్ష వేయడం తగునా అంటూ అంగలార్చాడు. బెంగుళూరుకు వారానికి రెండుసార్లు పరుగులుతీస్తూ తన సి.ఎల్స్. అన్నీ వాడేసుకున్నాడన్న వార్త కూడా వ్యాపించింది.

బాలన్న ఓ క్షణం వూరుకుండి శివయ్యతో, "అలాగైతే ఈ విషయాన్ని ఇలా వదిలేస్తే బాగోదు శివయ్యగారూ! మరోవార్త రాస్తాను అప్పుడు ఏమౌవుతుందో చూద్దాం ఈ వ్యవహారం" అన్నాడు.

శివయ్య నవ్వాడు. "మీరు ఏ వార్త రాసినప్పటికీ అది మన రాజకీయ నాయకులకుగానీ, బ్యూరోక్రట్లకుగానీ తగలదు బాలన్నగారూ! 'తంతే లేవనివాడు గోకితే లేస్తాడా?' అన్నట్టు వాళ్ళది మానవ చర్మం కాదు, పందుల..."

బాలన్న రాఘవేంద్రరావుని ఈ విషయం అడగాలనుకున్నాడు. ఆ విషయమే శివయ్యతో ప్రస్తావిస్తే అతను "మీరు అడక్కండి. అతను మాట ఇచ్చాడని నాకు ఖచ్చితంగా తెలుసు. దేవుడు దిగివచ్చినా అతను, మాట తప్పడు. మీకు ఇటీవలే కదా అతనితో పరిచయం! నాకు నాలుగేళ్ళనించీ తెలుసతను'' అన్నాడు.

బాలన్న "అది సరే! కాని శ్రీవాత్సవగారికి ఈ గుడి ఐడియా ఇచ్చిందెవరు?" అని ప్రశ్నించాడు

"మన కొట్టు యజమాని వెంకటేష్ ఉవాచ ప్రకారం ఈ ఐడియా సి.ఎమ్.గారిది''

"సి.ఎమ్'', బాలన్న నిర్ఘాంతపోయాడు.

"ఎందుకు కారాదు బాలన్నగారూ? వారు నాకు చాలా క్లోజ్ అన్నది నిజమే! కాని రాజకీయం అంటే రాజకీయమే కదా! తమరి చెత్తకుండీ వాసన గురించి ఓ చిదంబర రహస్యం ఇప్పుడు బద్దలైంది, మీకు తెలుసా?"

"ఏంటి?"

"నిజమో, అబద్ధమో చెప్పలేను. నిజమే కావచ్చును అనిపిస్తోంది!"

"చెప్పండి అదేమిటో?" శివయ్య కొత్తగా పరిశోధించినట్టు చెప్పసాగాడు, "శ్రీమతి శ్రీవాత్సవగారు మున్సిపాల్టీకి తమ ఇంటిముందర చెత్తకుండిని మార్చాలని పెట్టుకున్న అర్జీ విషయాన్ని మున్సిపాల్టీలో పనిచేస్తున్న సి.ఎం.గా




రికి చాలా దగ్గరివాడైన... ఓ గుమాస్తా... సి.ఎమ్.గారికి చేరవేశాట్ట. చెత్తకుండీ స్థానచలనం సి.ఎమ్.గారికి ఇష్టంలేదుట. ఏం చెయ్యడమా అని తల పట్టుకున్నారట. ఏదో ఐడియా హఠాత్తుగా స్ఫురించిందట. స్థానచలనం కాగానే కుళ్ళిపోయిన ఏదేనా జంతువు కళేబరాన్ని చెత్తకుండీలో వేయమన్నారట. ఆ జంతువు ఓ పందిపిల్ల. పంది పిండానికీ, మనిషి పిండానికీ పోలికలున్న విషయం ఎవరో సి.ఎమ్.గారికి చెవిన వేశారట. ఈ పని చాలా పకడ్బందీగా ఎవరికీ తెలీకుండా చేయించారుట!"

శివయ్య మాటలకి బాలన్న అద్భుతగులుతూ, "దీంతో సి.ఎమ్.గారికి వచ్చే లాభమేంటి?" అన్నాడు.

"రాజకీయనాయకులు ఎప్పుడూ తాము వార్తల్లోకి రావాలనుకుంటారు కదా? అలా ఈ చెత్తకుండీ వ్యవహారంతో మన వీధిలో సి.ఎమ్.గారు ఎంత ముఖ్యమైన వ్యక్తో ఇప్పుడు మనకు తెలిసిపోలేదూ? అదే వారిక్కావాల్సింది కూడా''

"అది సరే! మరిప్పుడు శ్రీవాత్సవగారి ఇంటిముందు గుడి కడితే వారికి కలిగే లాభమేంటి?" బాలన్న ప్రశ్నించాడు.

"నేనెలా చెప్పాలి మీకు? చెత్తకుండీనించే ఇన్ని ప్రయోజనాలు పొందిన వ్యక్తి గుడివల్ల మరెన్ని లాభాలు పొందగలడో ఆలోచించండి!"

ఆరోజు బాలన్న ఎస్.ఐ.రామస్వామిని కలిశాడు. శివయ్య చెప్పిన చెత్తకుండీ విషయాలన్నీ ఎస్.ఐ.కి వివరించాడు.

"చూడండి! నా అంచనా నిజమైంది కదా! ఆరోజు వీటివెనక సి.ఎమ్.గారు వున్నారంటే మీరు ఒప్పుకోలేదు''

బాలన్న "అదలా వుంచండి. ఇప్పుడు శ్రీవాత్సవగారి ఇంటిముందు గుడికట్టే సన్నాహాల్లో వున్నారట సి.ఎమ్.గారు'' అన్నాడు.

"నిజంగానా?" విస్తుపోయి అడిగాడు రామస్వామి.

"ఔను... రాఘవేంద్రరావు తన స్థలం శ్రీవాత్సవగారికి అమ్ముతున్నారని ఓ వార్త అందులో శ్రీవాత్సవగారు గుడి కట్టిస్తారుట!" బాలన్న వివరించాడు.

రామస్వామి ఓ నిముషం మౌనంగా వుండి "అలాగైతే ఈ సి.ఎమ్.గారికి వచ్చేసారి ఎం.ఎల్.ఏ. సీటు గ్యారంటీ. మన మున్సిపాలిటీ అధ్యక్షుడు తన ప్రెసిడెంట్‌గిరీ కోల్పోవడం కూడా ఖాయం" అన్నాడు.

బాలన్నకు అంతా అయోమయంగా వుంది. అతను మరింత ఆశ్చర్యంతో, "మీరు ఇతరుల భవిష్యత్తు చెప్పడం ఎప్పట్నించి మొదలెట్టారు?" అని ధ్వనిగర్భితంగా ఎగతాళి చేశాడు.

"భవిష్యత్తు చెప్పడం కాదు బాలన్నగారూ!" అంటూ రామస్వామి కొనసాగించాడు. "ఇది ఓరకం లాజిక్. కేవలం అంచనా. సి.ఎమ్.గారు శ్రీవాత్సవగారికి అక్కడ గుడిని కట్టమనే ఐడియా ఇవ్వడం నిజమైనట్లయితే నా ఊహాగానం నిజమవుతుంది'' శ్రీవాత్సవగారు సి.ఎమ్.గారి సలహానను సరించి గుడిని నిర్మించినట్లయితే అది పూర్తిగా నిజమవుతుంది''

"ఎలా?"

"శ్రీమతి శ్రీవాత్సవగారు ముఖ్యమంత్రికో, హోమ్‌మినిస్టర్‌కో దగ్గరి బంధువులు. అది తెలిసే సి.ఎమ్.గారు శ్రీవాత్సవగారికి ఈ ఐడియా ఇచ్చి వుండాలి. ప్రతిఫలంగా సి.ఎమ్.గారు మొదట మన మున్సిపాలిటీ అధ్యక్షుణ్ణి అధికారంనించి కిందికి దింపుతారు. రాబోయే ఎన్నికల్లో ఎం.ఎల్.ఏ.సీటు కైవశం చేసుకుంటారు''

"ముందు ముందు మంత్రిగారు కూడా అవుతారని చెప్పండి''

"తప్పక అయి తీరుతారు''

బాలన్న ఇంక మాట్లాడలేదు. ఉక్కపోస్తున్నట్లు అనిపించింది.

"చూడండి రామస్వామీ! నా బొందిలో

ప్రాణం వుండగా అక్కడ గుడి కట్టనివ్వను''

"అంటే మీరు నాస్తికులా?"

"నాస్తికుణ్ణో, ఆస్తికుణ్ణో... అది వేరే ప్రశ్న. కనిపించని వస్తువుల్ని నేను నమ్మనుగాక నమ్మను. నమ్మేవాళ్ళని ప్రశ్నించను కూడాను. నా ఫిలాసఫీలో మతం, దైవం... ఇవన్నీ బొత్తిగా వ్యక్తిగత విషయాలు. వాటిని రాజకీయాల్లోకి లాక్కురావడంగానీ, ఆ వ్యక్తిగత అభిమతాల్ని సంఘపరంచేసి దోపిడీ చేయడంగానీ నాకు సరిపడవు. ఈ చెత్తకుండీ వ్యవహారం కన్న ముందు అక్కడ గుడి కట్టుకోవడం అంటే నేను ప్రశ్నించి వుండేవాణ్ణి కాదు. ఇప్పుడు అక్కడ చెత్తకుండీ వుండడానికి వీల్లేదు అనే ఒకే ఒక్క కారణం కోసం దేవుణ్ణి స్థాపించడం అంటే మాలాంటివాళ్ళు ప్రతిఘటించక తప్పదు''

రామస్వామి కాసేపు మాట్లాడలేదు. ఆ తర్వాత "మీకు ఉన్న స్వేచ్ఛ మాకు లేదు బాలన్నగారూ! నేను మీ వాదాన్ని, అభిప్రాయాన్ని పూర్తిగా ఒప్పుకుంటాను. కాని నా భార్య దీనికి బొత్తిగా వ్యతిరేకం. నేను చెత్తకుండీ వ్యవహారంలో ఎంత ఆసక్తి కనబరిచానో మీకు తెలుసు. ఆ రోజు మీరు మా స్టేషన్‌కు వచ్చారు చూడండి. రాజీనామా అయినా యిస్తాను అని సందర్భవశాత్తు చెప్పాను చూడండి. ఆ మాటల్ని ఎవడో ఓ కానిస్టేబుల్ ఉన్నవి వున్నట్టు మా ఆవిడకి చేరవేశాడు. ఇంకేం? నేను మా ఇంటికి వెళ్ళేసరికి స్టేషన్‌లో జరిగిన రామాయణం చెప్పమని శోకాలు తీసింది. 'ఇలాగని తెలిస్తే నేను మిమ్మల్ని పెళ్ళాడేదాన్ని కాదు. మా నాన్నగారు నన్ను మీకు కట్టబెట్టేవారుకాదు' అని ఏవేవో అంది. మా రెండేళ్ళ అబ్బాయి తలమీద నా చెయ్యి వుంచి ఒట్టు వేయించుకుంది. అదీ చాలదన్నట్టు మా మామగారికి ఉత్తరం రాసి పిలిపించి బుద్ధులు చెప్పించింది.

'సిద్ధాంతం గిద్ధాంతం అని కానూనుకు, రాజకీయ నాయకులకు విరుద్ధంగా నడిచి ఉద్యోగం ఊడగొట్టుకోకు' అని మామగారు హితబోధ చేశాడు. బీజాపూర్, గుల్బర్గా... మొదలైన ప్రాంతాలకు బదిలీ అయినట్లయితే నా కూతురు బతకలేదని మొత్తుకున్నారు.

ఎవరికోసం ఈ వ్యవస్థకి వ్యతిరేకంగా మనం పోరాడాలో, వాళ్ళే మనకి ఎదురయితే మన ఈ నిజాయితీకి అర్థం పరమార్థం ఏమిటని మౌనంగా వుండిపోయాను. నేనిప్పుడు ఇలాంటి విషయాల్లో న్యూట్రల్‌గా మసలుకుంటున్నాను. ఇది నా మనస్సుకు సరిపడని విషయం అన్నది నిజమే!కాని పొట్టతిప్పల కోసం పాముల్ని ఆడించక తప్పదు కదా!"

బాలన్న "ఛీ... ఛీ'' అంటూ సిగరెట్టు ముట్టించుకుని రామస్వామికీ ఒకటి ఇచ్చాడు.

"గుడి అక్కడ కట్టడానికి వీల్లేదు అంటే మా ఇంట్లోనూ ఇదే సమస్య ఎదురు కావచ్చును. మా ఆవిడనించే కాదు మా అమ్మగారినించీ కూడా. అయినప్పటికీ వాళ్ళని ఎలాగైనా ఒప్పించగలను అనే ధైర్యం వుంది నాకు. వాళ్ళు ఒప్పుకోకున్నా నేను నా మార్గంనించి తప్పుకోను. ఖచ్చితంగా దేవాలయనిర్మాణాన్ని ప్రతిఘటిస్తాను''

"నా నైతికమద్దతు మీకే సార్! నేను కన్న కల మీ వల్లనైనా నిజంగా మారనీ!" అంటూ రామస్వామి శుభాకాంక్షలు తెలిపాడు.

ఆరోజు రాత్రి భోజనాలవద్ద బాలన్న తల్లితో, "పూర్వం చెత్తకుండీ వుండేది కదా అమ్మా! దాని ముందర గుడి కడతారట తెలుసా?" అన్నాడు.

లక్ష్మి "ఔను, వీధి వాళ్ళంతా అనుకుంటున్నారు'' అంది.

"అది రాఘవేంద్రరావు స్థలమట! కూతురు ఎవరినో కట్టుకుని పారిపోయింతర్వాత తను ఆ ఇంటిస్థలాన్ని అట్టిపెట్టుకుని ఏం చేయడం అనుకుని దాన్ని ఆ శాస్త్రవేత్తగారి భార్యకి అప్పనంగా అప్పగించారట. మాలతి భర్త శాస్త్రవేత్త అయినప్పటికి దైవభక్తుడట. "కట్టనివ్వండి! గుడి కట్టనివ్వండి. అది పూర్తయి




బ్రహ్మకలశం అయ్యేదాకా నేను బతికితే చాలు... అంతవరకు ఆయుస్సు వుంచమని నేను దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను''

అమ్మ మాటలకు ఎలా జవాబు చెప్పాలో బాలన్నకు అర్థంగాలా.

ఆ రాత్రి భార్యతో "నేను గుడి కట్టడాన్ని వ్యతిరేకిస్తున్నాను. నువ్వు ఏమంటావ్?" అన్నాడు.

లక్ష్మి భయంతో కళ్ళు పెద్దవి చేస్తూ, "ఇది ఎక్కడైనా వుందా? మీ బుర్ర సరిగా వుందా, లేదా?" అంది.

బాలన్నకు కోపం వచ్చింది. "ఈ గుడి ఎందుకోసం కడుతున్నారో తెల్సా? భక్తితో కాదు, స్వార్థంకోసం నిర్మిస్తున్నారు. అంతేకాదు రాజకీయ ప్రయోజనం కోసం నిర్మిస్తున్నారు'' అంటూ దేవాలయ నిర్మాణం వెనుక వున్న పరిస్థితుల్ని వివరించాడు.

అన్నీ విన్న లక్ష్మి "అది ఏమైనా కావచ్చు. కాని దేవాలయం అంటే మంచిపనే కదా? పూర్వజన్మలో ఏం పాపం చేశామోగానీ ఈ జన్మలో ఎలాగూ మనకు పిల్లల్ని ఇవ్వలేదు ఆ భగవంతుడు. వచ్చే జన్మలో కూడా పిల్లలు వద్దనే అంటారా మీరు?" అంది.

బాలన్నకు నిరాశ ఎదురైంది. ఆ రాత్రి ఆలుమగల్లో ఎవరికీ నిద్రపట్టలా.

చాలా సేపటికి ఆమె భర్తని దగ్గరికి లాక్కుంటూ "నిద్రవచ్చిందా?" అంది.

బాలన్న ముక్తసరిగా "లేదు'' అన్నాడు. అలా అనడంలో కోపమూ వుంది.

"మిమ్మల్ని నొప్పించకుండా వుండాల్సింది. క్షమించండి! గుడి కట్టకుండా ఆపడం మహాపాపం కాదూ?" అంది.

బాలన్న ఓ క్షణం ఏమీ మాట్లాడలా. తర్వాత ఆమెను తన పరిష్వంగంలోకి తీసుకుంటూ "నువ్వు దేవుణ్ణి నమ్మకూడదనడం లేదు, నేను! కాని నమ్మని నా మీద నీ యిష్టాయిష్టాల్ని రుద్దరాదు అని మాత్రం చెబుతున్నాను. అంతే!" అన్నాడు.

లక్ష్మి మౌనంగా వుండిపోయింది. బాలన్న కూడా మిన్నకుండిపోయాడు. ఇద్దరికీ ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు. పొద్దుట లేస్తూనే బాలన్న దేవాలయ నిర్మాణానికి సంబంధించిన ఓ సుదీర్ఘవ్యాసం రాసి 'దినసుద్ధి' పత్రికకి పంపించాడు. వ్యాసం చివర "సైద్ధాంతికంగా దేవాలయ నిర్మాణాన్ని వ్యతిరేకించేవాళ్ళు సీతాపురంలో అనేక మంది ఉండవచ్చుననీ, వాళ్ళంతా సంఘటితులై పోరాడాల్సిన అవసరం వుందనీ'' తన అభిప్రాయం కుండ బద్దలుకొట్టినట్టు స్పష్టం చేశాడు.

రెండ్రోజుల్లో వ్యాసం ప్రకటించబడింది.

దాన్ని చదివిన శ్రీనివాసయ్య శ్రీవాత్సవ గారి ఇంటికి ఉరుకులు పరుగులతో వెళ్ళాడు.

మాలతి స్వాగతం చెప్పింది శ్రీనివాసయ్యకు.

ఆమెతో వ్యాసం గురించి ప్రస్తావించాడు శ్రీనివాసయ్య!

"ఔను, నేనూ చదివాను. బాలన్నగారు ఇంతగా పతనం అవుతారని నేను ఊహించలేదు. ఏమైనా మావారు వచ్చాక ఓ నిర్ణయానికి రావాలి'' అంది.

శ్రీనివాసయ్య "చెత్తకుండీ మీ ఇంటి ముందే ఉండాలి అనే ఒకే ఒక్క కారణంతో దేవాలయం వద్దంటున్నారు బాలన్న. మా ఇంటిముందు చెత్తకుండీ వద్దు అన్నది నేను. కాని ఈ చెత్తకుండి వ్యవహారంవల్ల మంచి ఉద్దేశంతో మీరు దేవాలయం నిర్మించడాన్ని ఎవరు వ్యతిరేకించినప్పటికీ నేను ఒప్పుకోను. నా ఇంటిముందే చెత్తకుండీ వుంచేయండి అని మున్సిపాలిటీకి రాసిస్తాను. కాని మీరు దేవాలయం నిర్మించే నిర్ణయాన్ని మాత్రం దయ చేసి వెనక్కి తీసుకోకండి!" అన్నాడు.

"సరే! మీలాంటివాళ్ళకైనా మా ఉద్దేశం అర్థమైంది కదా'' అని ఉబ్బిపోతూ మాలతి అతణ్ణి సాగనంపింది.

శ్రీనివాసయ్య అక్కణ్ణించి రాఘవేంద్రరావు ఇంటికి పరుగెత్తాడు. రావు "ఇన్ని సంవత్సరాలుగా నేను ఇందుకే బాలన్నతో స్నేహం పెంచుకోకుండా ఉన్నా. ఈ పత్రికలవాళ్ళు చాలా ప్రమాదకరమైన మనుషులయ్యా! నా స్థలాన్ని నేను ఎవరికైనా అమ్ముతాను లేక దానమిస్తాను అతనికేంటట? అక్కడ దేవాలయం లేవనీ, వల్లకాడు అవనీ, అతగాడికేం? 'మాకన్న గొప్పోళ్ళు లేరు. మేమే ఈ ప్రపంచానికి వార్తల వంతెనలు కడుతున్నాం' అని వుబ్బిపోవడమే ఈ పాత్రికేయుల పని'' అన్నాడు.

"మీరు దీన్ని వ్యతిరేకిస్తూ ఊరికే ఇంట్లో కూచుంటే సరిపోదు. మన వీధిలో ఉన్న వాళ్ళందరినీ సంప్రదించి దేవాలయ నిర్మాణానికి అనుకూలంగా సంతకాలు సేకరించి 'గుణవాణి' పత్రికకి పంపిస్తే ఎలా వుంటుంది?" శ్రీనివాసయ్యలో నిద్రాణంగా, నిస్తాణగా వున్న మతవాది నిద్ర లేచాడు.

"ఓహ్! మంచి ఐడియా. కాని మనకు పత్రికకి పంపించేలా రాయడం రాదుగా. మన సి.ఎమ్.గారిని కలిసి ఈ విషయం చర్చిస్తే వారేమైనా మంచి ఐడియా ఇవ్వగలరు. వారికే కదా మొదట ఈ గుడి కట్టాలన్న ఆలోచన కల్గింది. మంచి మనిషి. దైవభక్తుడు. ముమ్ముందు మంత్రి అవుతే ఈ దేశానికి ఎంతో మేలు''

ఈ గుడి ఐడియా ఇచ్చింది సి.ఎమ్.గారే ఇప్పుడిలా అని తెలిసేసరికి శ్రీనివాసయ్య తెల్లమొహం వేశాడు. "మంచిది, మంచిది'' అంటూ రావు అభిప్రాయానికి మద్దతు తెలిపి రావుతోపాటు అతనూ సి.ఎమ్.గారింటికి బయల్దేరాడు.

ఇద్దరినీ సాదరంగా ఆహ్వానిస్తూ సి.ఎమ్.గారు "పేపర్ చూసివచ్చారనిపిస్తోంది. మన వీధిలో ఇలాంటి రాక్షసుడు వుంటున్నాడు అని ఇన్నాళ్ళూ నేను అనుకోలేదు. మంచి మనిషి అనుకున్నాను. మన వీధికి ఎంత చెడ్డపేరు తెచ్చాడో చూశారా?" అన్నాడు ఆ యిద్దరూ నోరు విప్పి మాట్లాడకముందే.

"ఔను'' అని తలలూపిన ఆ యిద్దరూ తమ అభిప్రాయాల్ని చెప్పారు.

అన్నీ విన్న సి.ఎమ్.గారు "గుడ్ ఐడియా! నాకు ఓ జర్నలిస్టు మిత్రుడున్నాడు. అతనితో దీనికి ఎలా జవాబు చెప్పాలో చర్చించి రాయించి మరీ వస్తాను. సాయంత్రం ఈ వీధివాళ్ళందరిచేత సంతకాలు చేయించండి. అన్నట్టు... మరో రహస్యం. నేను ఇవాళే బెంగుళూరు వెళ్తున్నాను. వెళుతూ వెళుతూ మాలతిగారితో మన ముఖ్యమంత్రిగారికి ఓ కాయితం రాయించుకుని వెళతాను. ఈ బాలన్న రంగయ్య వీధిలో శాంతిభద్రతలకి భంగకరంగా ప్రవర్తిస్తున్నందువల్ల అతనికి ఇక్కణ్ణించి తక్షణం బదిలీ అయ్యేలా చూస్తాను. ముఖ్యమంత్రిగారు ఒక్క మాట చెబితే చాలు 'దినసుద్ది' మేనేజిమెంటు బాలన్నని బదిలీ చేయటం కాదు ఏకంగా ఉద్యోగంలోంచే పీకి పారేస్తుంది'' అన్నారు.

శ్రీనివాసయ్యకి, రాఘవేంద్రరావుకీ గుండెలమీది బరువు దిగినంత హాయిగా వుందిప్పుడు. "దేవుని కార్యం కదా! విజయం తప్పక మనదే!" అనుకుంటూ ఒకరి భుజాన్ని మరొకరు... పరస్పరం తట్టుకుంటూ ఇళ్ళవైపు వెళ్ళిపోయారు.

ఆ ఇద్దరూ అలా తమతమ ఇళ్లకేసి వెళ్లబోతుండగా దారిలో బాలన్న ఫోనులోఎవరితోనో పెద్దగా మాట్లాడ్డం విన్పించింది.

పగటి భోజనాల తర్వాత బాలన్న ఇంటికి వచ్చిన వెంకటమ్మ "మీవారికి ఇదంతా ఎందుకు?" అంది లక్ష్మితో.

లక్ష్మి "వద్దన్నా వారు వినేరకం కాదు. ఈరోజు అతనికి ఫోన్ల మీద ఫోన్లు వస్తున్నాయి. మరో వారంలో దేవాలయం కట్టకూడదని మావారిలాగే ఆలోచించే వేలకొద్ది మంది శ్రీవాత్సవగారి ఇంటిముందు సత్యాగ్రహం, ఆందోళన చేపడతారట! నేనేమో వద్దని మొత్తుకుంటున్నాను. అయినా వినడంలేదు. మా అత్తగారు సైతం ఇలాగైతే ఈ వారం రోజుల్లో




గా నేను చచ్చిపోతా(నా అని బెదిరిస్తోంది. ఇంక ఎవరు చెబుతారు?" అంటూ తన ఇబ్బంది తెలియజేసింది.

భార్యద్వారా ఈ విషయాలు సేకరించిన రాఘవేంద్రరావు నిర్ఘాంతపోయాడు. "భగవాన్! బాలన్నలో హృదయపరివర్తన కలితగించు తండ్రీ'' అని ప్రార్ధన చేశాడు.

సాయంకాలం శ్రీనివాసయ్య, రాఘవేంద్రరావు... ఇద్దరూ రంగయ్యవీధిలోని ఇంటింటికీ వెళ్ళి 'దినసుద్ది' పత్రికకు బాలన్నకు వ్యతిరేకంగా రాసిన ఉత్తరమ్మీద సంతకాలు సేకరించారు. దాంతోపాటు ప్రతి ఇంటి యజమాని 'తన ఇంటిముందర చెత్తకుండీ ఉంచేందుకు అభ్యంతరంలేదని మున్సిపాలిటీ అధికార్లకు సామూహికంగా చేసే విన్నపాన్ని కూడా సిద్ధంచేశారు. ఆ వీధిలోని ఇళ్ళవాళ్ళంతా ఉత్సాహంగా సంతకాలు చేశారు.

శివయ్య మాత్రం ఏం చెయడమా అని ఓ నిముషంపాటు ఆలోచించి "రేపు చెబుతాను. అయినా నా ఒక్కని సంతకం లేకున్నా నడుస్తుంది లెండి!" అన్నాడు.

శ్రీనివాసయ్య చిందులేశాడు. "బాలన్న మీ బుర్ర నాశనం చేశాడు'' అన్నాడు.

"బుర్ర చెడింది నాక్కాదు, మీకు. మా ఇంటిముందు చెత్తకుండీ వద్దు బాబో అని మొరపెట్టుకున్న మీరే మా ఇంటిముందు చెత్తకుండీ వుంచినా ఫరవాలేదని సంతకాలు చేయిస్తున్నారు'' అని అడగాలనిపించింది శివయ్యకు. కాని, ఆ మాటలు అతని గొంతుదాటి రాలేకపోయాయి.

ఆ సాయంకాలం బాలన్న ఇంటిముందు నాలుగైదు వాహనాలు వచ్చి ఆగాయి. వాటిల్లోంచి ఉడుకు రక్తం ఉరకలేస్తోన్న, యువకులు దిగారు. "జర్నలిస్టు బాలన్నగారు వర్ధిల్లాల్లి!" అని ఎవరో గట్టిగా అరిచారు.

మిగిలినవాళ్ళు శృతికలిపారు.

అంతలో మరో నినాదం.

"మతాన్ని రాజకీయాలతో చేర్చరాదు''

దాంతోపాటు ఇంకోస్వరం "దేవుడికన్న మనిషి మిన్న. మనిషే దేవుణ్ణి సృష్టించాడు''

ఇలా... ఎన్నో... మరెన్నో... నినాదాలు.

ఈ నినాదాలు, ఈ జయజయధ్వానాలు రంగయ్యవీధిలో ఎగిరెగిరి నింగిని చుంబిస్తున్నాయి.

బాలన్న ఇంట్లోంచి బయటికొచ్చి రాగానే "దయచేసి నినాదాలు ఇవ్వకండి!" అని యువకుల్ని బతిమాలాడు.

ఈ మొత్తం నాటకీయ దృశాన్ని వీధిలో వున్న కిటికీలన్నీ తెరుచుకుని చూశాయి.

లక్ష్మికి అంతరాంతరాల్లో ఎక్కడో సంతోషం ఉప్పొంగింది. తన భర్త వాస్తవంగానే గొప్పవాడు అన్న ఆనందం హద్దుల్నిదాటింది. అయితే ఆమెకు భయంగానూ వుంది. ధనికులూ, రాజకీయనాయకులూ ఏమైనా చేస్తారేమో అన్న ఆలోచనతో విహ్వలురాలైంది, భాగీరధమ్మగారికేమో 'ఏది సత్యం, ఏదసత్యం' అన్న మీమాంస.

అయితే, ఆ మర్నాడే రంగయ్య వీధిలో సనాతన మత సంరక్షణా సమితివారి వూరేగింపూ మొదలైంది.

"ఎలాంటి త్యాగాలకైనా వెనుదీయం. దేవాలయాన్ని నిర్మించడం ఖాయం" అనే నినాదాలతో వీధి మారుమోగింది.

మరో రెండ్రోజులుపోయాక... 'దినసుద్ది' పత్రికలో రంగయ్యవీధి వాస్తవ్యుల ఉత్తరం కూడా అచ్చయ్యింది. ఆ వెంటనే బాలన్నకు 'దినసుద్ది' మేనేజింగ్ డైరెక్టర్ నుండి టెలిగ్రాం వచ్చింది. అందులో ఇలా వుంది! "మిమ్మల్ని 'దినసుద్ది' కార్యాలయంలో సీనియర్ సబెడిటర్గా, నియమించాం. వివరంగా ఉత్తరం రాస్తున్నాం"

బాలన్న టెలిగ్రాం చదివాడు. ముఖమ్మీద పొటమరించిన చెమట బిందువుల్ని తుడుచుకుని నిట్టూరిస్తూ భార్యని కేకేశాడు.

"ఏమోయ్! ఓ గ్లాసుడు మంచినీళ్ళు పట్రా'' అని.



# చతుర ప్రపంచం

## పిడుగును తట్టుకున్న పిల్ల

'అమ్మో! అది పిల్లకాదురోయ్! పిడుగు!' అంటూ వుంటారు కొంతమంది తెలివైన, చురుకైన అమ్మాయిలను చూసి. నిజంగానే పిడుగు కూడా ఏం చేయలేని పిడుగులాంటి అమ్మాయి ఉందొకచోట.

1989లో నార్వేలో బ్రోగ్‌జామ్ గ్రామానికి చెందిన మిస్ లిసా... తల్లితండ్రులెంత చెప్పినా వినకుండా కారుమేఘాలు దట్టంగా కమ్ముకున్న సమయంలో గుర్రపుస్వారీకి తయారయింది. గుర్రానికి కూడా ఆ వాతావరణం నచ్చిందేమో బయటకు పోవడానికి ఉత్సాహం పుట్టి మంచి స్పీడులో పరుగెడుతోంది. కొంతదూరం పోగానే వాన ప్రారంభమయింది. ఆ వాన కుంభవృష్టిగా మారి జలప్రళయం వచ్చిందన్నట్లు అనిపించసాగింది. లిసాకి దారి సరిగ్గా తెలియడంలేదు. గుర్రం కూడా ఆ వాన ధాటికి ఆగలేక తోచిన దిక్కుకు పరిగెడుతోంది. అంతలో పిడుగులు కూడా పడటం ప్రారంభించాయి. భయపడినట్టుగానే లిసామీద ఓ పిడుగుపడింది. లిసా ఒక్కక్షణం భయంతో కేకపెట్టి కళ్లు మూసుకుంది. మరుక్షణం కళ్లు తెరిస్తే తనకేం కాలేదుగానీ, గుర్రం మాత్రం మాడిమసైపోయివుంది. లిసా ఆశ్చర్యపోయి అలాగే వానలో దారి వెతుక్కుంటూ ఎలాగో ఇల్లు చేరింది.




గుర్రం పిడుగుబారిన పడటం, లిసా సురక్షితంగా ఇల్లు జేరడం అందర్నీ ఆశ్చర్యంలో ముంచింది. లిసా దైవభక్తురాలనీ, ఆమె భక్తే ఆమెని కాపాడిందనీ అంది ఆమె తల్లి. కానీ విషయం తెలిసిన కొంతమంది పరిశోధకులు లిసాని పరీక్షించి చెప్పిందేమిటంటే ఆ సమయంలో ఆమె ధరించిన హెల్మేట్ లైటెనింగ్ కండక్టర్‌లా పనిజేయడంతో లిసాని ఏం చేయలేక లిసా తడి శరీర ప్రభావంతో కిందకి జారి గుర్రాన్ని మాత్రం మాడ్చి మసిచేసిందని చెప్పారు.

# మేధావి శునకం

కుక్కను పెంచితే అది దొంగలొచ్చినప్పుడు కుటుంబ వ్యక్తులను లేపడం, తద్వారా అప్పుడప్పుడు వాళ్ళా ప్రమాదంనుంచి బయటపడటం జరుగుతూ వుంటుంది. ఈమధ్య ఓ కుక్క తన యజమానినేకాక మొత్తం పట్టణాన్నంతా ఓ ప్రమాదంనుంచి రక్షించిన ఉదంతం బయటపడింది.




కెనడాలోని లోక్‌టౌన్‌లో మాక్మిలన్ అనే ఆసామికి మాడ్రిడ్ అనే పెంపుడుకుక్క వుంది. 1989 మే 13వ తేదీ తెల్లవారుఝామున 4 గంటలకు అది హటాత్తుగా అరవడం మొదలు పెట్టింది. చాలామంది వీధుల్లోకి వచ్చి చూస్తే దూరంగా ఉన్న బోట్‌హవుస్ ఒకదానికి నిప్పంటుకున్నట్టు తెలిసింది. వెంటనే వెళ్లి ఫైర్ సర్వీస్‌కు ఫోనుచేసి రప్పించి మంటలార్పించారు. సకాలంలో ఫైర్‌ఇంజన్లు రావడంవల్ల ఊరంతా అగ్నిప్రమాదంనుంచి బయటపడింది. కారణం అక్కడి ఇళ్ళన్నీ కలపతో కట్టినవే. ఒక ఇల్లు అంటుకుంటే ఊరంతా అంటుకోవడానికి ఎంతోసేపు పట్టదు. బోట్‌హవుస్ మిగతా ఇళ్లకి కాస్త దూరంగా వుండటం, సకాలంలో మాడ్రిడ్ అరవడంతో ఊరంతా ప్రమాదంనుంచి బయటపడిందని చాలా మంది అనుకున్నారు. అందరికీ ఆ కుక్కంటే అభిమానం ఏర్పడింది.

అయితే ఇలాంటి ప్రమాదపరిస్థితిని మాడ్రిడ్ ముందుగానే ఎలా పసిగట్టగలిగిందన్న విషయంమీద పరిశోధనలు జరిపారు. ఫలితంగా మాడ్రిడ్‌కి అపూర్వమైన మేధోశక్తి వుందని తేల్చారు.

ప్రతిరోజూ యజమాని మాక్మిలన్ కారు ఇంటికి మూడుమైళ్లు దూరంలో వుందనగానే అరవడం ప్రారంభిస్తుంది మాడ్రిడ్. అంత దూరంనుంచే యజమాని వాసనను పసిగట్టగలుగుతుంది. యజమానితో కలిసిగాని భోజనం చేయదు. ఎప్పుడైనా యజమాని ఊరికి వెళ్ళి ఒకటి రెండు రోజులు రాకపోతే వచ్చేదాకా భోజనం చెయ్యకుండా ఎదురుచూస్తుంటుంది.

మాడ్రిడ్ చనిపోయినప్పుడు దానికొక స్మారక విగ్రహాన్ని ప్రతిష్టింపచేయాలని పట్టుబడుతూ ఊరందరూ కలిసి 20,000 డాలర్ల చందాలను పోగుచేసి ఇచ్చారు మాక్మిలన్‌కి.

# కదిలే సంగీతం

**బ**ళ్లమీద కూరగాయలలో, పళ్లో, ప్లాస్టిక్ సామాన్లో, పానీ పూరీ, సమోసాలాంటి తిను బండారాలో పెట్టుకుని అమ్ముకుంటూ జీవించే వాళ్లు చాలామందే వున్నారు మనదేశంలో. నెత్తిమాడ్చే ఎర్రని ఎండలో కూడా, గొంతు కొరబోయిన కాకి అరుపులా అరుచుకుంటూ, చమటలు కక్కుకుంటూ అమ్ముతూనే వుంటారు పొట్టకూటి కోసం. అలాగే చలికి వణకక,




వానకి వెరవక... శీతోష్ణ సుఖదుఃఖాలకి అతీతులుగా అమ్మకాలు సాగిస్తూ జీవనోపాధి చేసుకుంటున్నాడు ఓ బడుగువ్యక్తి. వ్యాపారం చిన్నదైనా దాన్ని ఆనందంగా, ఉల్లాసంగా చేసుకునే పద్ధతులు కూడా వున్నాయంటున్నాడు సోలాపూర్‌కి చెందిన ఉత్థవ్ అనే ఇతగాడు. తన చిన్నబండిలో ఓ పెద్ద గడియారం, ఓ టేప్‌రికార్డరు, చిన్నసైజు టి.వి. అమర్చుకుని చిదానందంగా బండిని తోసుకుంటూ వ్యాపారం చేస్తుంటాడతను.

దీనికంతటికీ కారణం ఓ ఆటోవాలావల్ల తానెదుర్కొన్న అనుభవమే అంటాడతను. ఓసారి ఆటోఎక్కి ఎక్కడికో వెడుతున్నాడు ఉత్థవ్. ఆటో అతను టేప్‌రికార్డర్‌లో రఫీ పాట పెట్టాడు. ఆ పాటంటే ప్రాణం ఉత్థవ్‌కి. గమ్యం చేరాక కూడా ఆటో దిగకుండా మళ్ళీ ఆ పాట పెట్టమని బతిమాలాడు ఆటోవాలాని. కానీ అప్పుడే మరో బేరం రావడంతో ఉత్థవ్‌ని బలవంతంగా ఆటోలోంచి దింపి ఇంకో పాసింజర్ నెక్కించుకుని వెళ్ళిపోయాడా ఆటోవాలా! అదే అతని వ్యాపారంలో దృశ్య, శ్రవణ యంత్రాల ఆగమనానికి నాంది.

అతడు విని ఆనందించమే కాకుండా వాటిని తన వ్యాపారాభివృద్ధికి కూడా ఉపయోగించుకుంటాడు. ఉదయాన్నే భక్తిరంజనితో అతని బండి బయటకు వస్తుంది. ముస్లిమ్ ప్రాంతాలకు వెళ్ళినప్పుడు గజళ్లు, ఖవ్వాలీలు వినిపిస్తాడు. ఏ భాషా ప్రాంతాల్లో ఆ భాషల పాటలు పెడుతూవుంటాడు. ఓ విషాద సంగీత కాసెట్టును కూడా కొనిపెట్టుకున్నాడు ఉత్థవ్. ఎవరైనా ప్రముఖుడు మరణిస్తే ఆ రోజంతా ఆ కాసెట్ పెట్టి వ్యాపారం చేసుకుంటాడు.

ఇదికాక పండగలకి, జాతీయ పర్వాలకి అనుగుణంగా బండిని అలంకరిస్తూ వుంటాడు. నిత్యసంతోషిలా కనిపించే ఉత్థవ్‌కి ఆరుగురు పిల్లలు. కానీ తన బండిని తన తదనంతరం పిల్లలు వాడుకోవడానికి అతను ఇష్టపడటం లేదు. కారణం దాన్ని అంత జాగ్రత్తగా చూసుకునే శ్రద్ధ, అంకితభావం పిల్లల్లో లేదంటాడతను.

## దానంకోసం బ్రహ్మచర్యం

వితరణ అనేది ఉండాలేగాని దానికి కలిమిలేములతో సంబంధం లేదనిపిస్తుంది కొందరిని చూస్తే. ఎంత సంపద ఉన్నా పైసా దానం చెయ్యని పిసినారులు లోకంలో కోకొల్లలు. ఏమీ లేకపోయినా ఉన్నంతలోనే ఇతరులకు తమకు తోచిన సాయం చేసే మానవతామూర్తులు ఈ రోజుల్లో అరుదనే చెప్పాలి. అలాంటి అరుదైన మనీషి సునీల్ బంధోపాధ్యాయ.




ఈయన పశ్చిమబెంగాల్‌లోని హౌరాకి చెందిన 'మహావీర్ బాలికా విద్యాలయానికి' లక్ష రూపాయలు విరాళం అందించాడు. విశేషం ఏమంటే ఒక స్కూల్లో గుమాస్తాగా పనిచేసిన, మరీ దిగువ మధ్యతరగతి వాడాయన. చిన్నతనంలో తన పాఠ్యపుస్తకంలోని 'డేవిడ్ హారే' జీవితచరిత్రతో ప్రభావితుడై, ఏదోవిధంగా తన వంతుగా సమాజానికి సేవలందించాలని కలలు కనేవాడు.

ఆర్థిక ఇబ్బందుల కారణంగానే తను పెద్దగా చదువుకోలేకపోయాననీ, కనుక డబ్బులేని కారణంగా చదువుకోలేని పిల్లలకు తన కొద్దిపాటి సంపాదనలోనే సాయం చెయ్యాలని అనుకునేవాడు సునీల్‌బంధోపాధ్యాయ.

మొదట కంపోజిటర్‌గా జీవితాన్ని ప్రారంభించిన బంధోపాధ్యాయ తర్వాత ఓ స్కూల్లో గుమాస్తాగా చేరాడు. కంపోజిటర్ ఉద్యోగం వదిలేసినప్పుడు వచ్చిన డబ్బును 12 సంవత్సరాల రికరింగ్ డిపాజిట్ పథకంలో పెట్టాడతను. అంతేకాకుండా ఒకపూట భోజనం, రెండోపూట రొట్టెముక్కతో కడుపు నింపుకుంటూ మరింత పొదుపు చేయడం ప్రారంభించాడు.

అలా అలా ఆదాచేసి చివరకి లక్ష రూపాయల విరాళాన్ని మహావీర్ బాలికా విద్యాలయానికి అందచేశాడు. అతడా విరాళాన్ని ఆ స్కూలుకే అందజేయడానికి కారణం అది అంగవికలురైన బాలికల పాఠశాల. తన జీవితంలోని ఈ ఆశయాచరణ కోసం పెళ్లి కూడా చేసుకోకుండా బ్రహ్మచారిగానే వుండిపోయాడు సునీల్‌బంధోపాధ్యాయ.

# అవిశ్రాంత కళాతృష్ణ

ప్రకృతి అందాలను చూసి పరవశించే కళా హృదయం అందరికీ వుండదు. ఉన్నవారిలోని భావుకత ఏదోవిధంగా బహిర్గతమవుతూనే వుంటుంది. ఇండోర్ ప్రాంతపు శన్‌వంద్‌నగర్‌కి చెందిన విష్ణు చించల్‌కర్ ఎప్పుడు చూసినా మొక్కలతో గునగునలాడుతూనో, పక్షులతో ముచ్చటిస్తూనో కనబడతాడు. అప్పుడప్పుడు

మొక్కలు, ఆకులతోనేకాక కాగితంతో కూడా అతడెన్నో కళావిన్యాసాలు చేస్తూనే వుంటాడు. ఆయన చెప్పేదేమంటే ప్రకృతిని జాగ్రత్తగా పరిశీలిస్తే ఎన్నో అందాలు, అద్భుతాలు మనకి గోచరిస్తాయని. తెల్లటి మేఘాల్లో గుర్రం, ఏనుగులాంటి జంతువులు స్పష్టంగా రూపుకడతాయంటాడతను.

ఈయన మంచి చిత్రకారుడు. కుంచెతో కాన్వాసుపై ఈయన గీసే చిత్రాలు ఎన్నో బహుమతులను అందుకున్నాయి. పోకచె




భార్య అతనికోసం ఇల్లూ పెరడూ వెతుకుతూంటే ఆయన ఒంటరిగా ఏ కాక్టస్ మొక్కతోనో మాట్లాడుతూ కనిపిస్తాడు. మొక్కలతోటి, జంతువులతోటి తాదాత్మ్యత పొందే అతని డ్రాయింగ్ రూమ్‌లో జంతువుల ఆకారంలో నగిషీలు చెక్కిన చెట్టుకొమ్మలు, బెరళ్ళు కనిపిస్తాయి. అప్పటికప్పుడు ఆ జంతువులు సజీవంగా కదిలి మన మీదకొస్తుంటాయా అన్నంతగా జీవకళ ఉట్టిపడుతూ వుంటాయి.

క్కలో ఆయన మలచిన 'గణేశుడు' బొమ్మ అద్భుతం అని ప్రశంసలనందుకుంది. ఎంతో మంది పారిశ్రామిక వేత్తలు, ధనికులు తమ తమ ఇళ్లను కళాత్మకంగా తీర్చిదిద్దుకునే విషయంలో విష్ణు చించిల్‌కర్ సలహా తీసుకుని, అతని చిత్రాల్ని, చెట్లకొమ్మలతో తయారుచేసిన వస్తువులనూ ఎంతరేటయినా కొనడానికి సిద్ధపడతారు.

ప్రస్తుతం 70వ పడిలో పడిన విష్ణు చించల్‌కర్ కళాతృష్ణ మాత్రం విశ్రాంతి తీసుకోనని, మొరాయిస్తోందంటారు అతని అభిమానులు.

# ఆదివాసుల పచ్చబొట్టు



పచ్చబొట్టు నుదుట కల్యాణతిలకమైన తరుణంలో వరుని కోసం ఎదురుచూసే ఆదివాసి కన్య.

మనిషి సహజంగా అలంకారప్రియుడు. వస్త్రాలు, ఆభరణాల ద్వారా సహజ సౌందర్యాన్ని ఇనుమడింపచేసుకోవటానికే తాపత్రయపడుతుంటారందరూ . ఇది ఒక దేశానికో, కాలానికో పరిమితమైన సరదా కాదు. సకల దేశాల్లోనూ యుగాలతరబడీ వస్తున్న అంశమే ఇది. అలంకరణాలపట్ల, ఆభరణాలపట్ల పురుషుల కంటే స్త్రీలే అధిక శ్రద్ధ చూపుతారనేది వాస్తవం. కాసులు దండిగా గలవారికి ఆర్థిక సమస్యలుండవు కనుక రకరకాల దుస్తులు,

అది కుక్క పేరంటే నేన్నమ్మను.
మీకేదో ఎఫైర్ ఉందన్నమాటే!!

బాలరాం.



మరణానంతరం కూడా నాకు తోడు వచ్చేది ఈ 'పచ్చబొట్టే' అంటున్న వర్ణాజాతి వడతి.

ఆభరణాలు ధరిస్తూ తమ సహజసౌందర్యానికి వన్నెలు తొడుగుతారు. నిరుపేదలయినవారికి గిల్టునగలు, పచ్చబొట్లు, పూసలు, పక్షిఈకలే ఆభరణాలై అలరారుతుంటాయి. ఇప్పటికీ ఎందరికో అరచేతులకీ, వేళ్ళకీ గోరింటాకు సౌందర్యాన్నిస్తే కలవారి గోళ్ళకి ఈనాడు నెయిల్‌పాలిష్‌లే హంగులు పెంచుతున్నాయి.

పచ్చబొట్టుని చేతులపై, ముఖంపై పొడిపించుకునే ఆచారం మధ్యప్రదేశ్‌లో ఎక్కువగా ఉంది. పచ్చబొట్టు జీవితాంతం శరీరాన్ని అంటిపెట్టుకునుంటుంది. ఆదివాసుల సంస్కృతిలో పచ్చబొట్టు పొడిపించుకోవటం తొలినుండీ అంతర్భాగమైపోయివుంది.

మధ్యప్రదేశ్‌లోని బస్తర్, మాడియా, ఝాబువా, భీల్‌భిలాలా, హొషంగాబాద్, బైతూల్, బైగా మొదలైన ప్రాంతాల్లో పచ్చబొట్టు శతాబ్దాలుగా జనాదరణ పొందుతూనే ఉంది. ప్రకృతి ఒడిలో పెరిగే ఈ నిష్కపటులు తమ శరీరంపై చుక్కలు, గీతలు, నచ్చిన పేర్లు పొడిపించుకుని ఆనందిస్తారు. అవే వారిపాలిట పచ్చల హారాలై, ముత్యాలసరాలై శోభనిస్తుంటాయి.

పచ్చ పొడిచే స్త్రీలను గోదారినులు అంటా








తాను పాడిచే వచ్చుబొట్టే వారి జీవితాన్ని నిండుగా పచ్చగా కళకళలాడిస్తుందంటున్న 'గోదారిని' స్త్రీ.




రు. పచ్చబొట్టు పొడుస్తూ జానపదగీతాల్ని ఆలపించటం ఈ ఆదివాసీ స్త్రీలకి అలవాటు. అంకడే చెట్టుపాలు, బీరాకుల రసం, లోహపు సూది మొదలైన పచ్చబొట్టు పొడిచే వస్తువుల్ని వీరు పవిత్రమైనవిగా భావిస్తారు. అపవిత్రమైన చేతులతో పనిముట్లను తాకటం పాపంగా భావిస్తారు. వీరి ఇష్టదైవం సికరీదేవుడు. అయన పూజ చేశాకే ప్రతియేడూ తమ జీవనోపాధి కోసం పచ్చపొడిచే పనికి బయల్దేరుతారు. ఊరూరూ తిరుగుతూ పచ్చబొట్లు పొడుస్తుంటారు. సికరీదేవుడు ఆగ్రహిస్తే తమ విద్య పనిచెయ్యదని వీరి నమ్మకం.

మధ్యప్రదేశ్‌లోని ఆదివాసుల కుటుంబాలకు చెందిన బాలికలకు మూడునుండి ఐదేండ్ల మధ్య ప్రాయంలో తప్పనిసరిగా పచ్చపొడిపించటం వాళ్ళ ఆచారం. యుక్తవయసులో అడుగిడిన అమ్మాయికైతే పచ్చ మరెంతో ముఖ్యంగా భావిస్తారు. వివాహసమయంలో పెళ్ళికూతురికి ముందే పచ్చబొట్టు పొడిపిస్తారు. అవి కుదరకపోతే అత్తవారింటికి వెళ్ళాక అయినా పచ్చపొట్టు పొడిపిస్తారు. ఇందుకు అయ్యే ఖర్చులు పెళ్లికూతురి తల్లిదండ్రులే భరించుకోవాలి. బస్తర్ జిల్లాలోని ఆదివాసి యువతులలో పర్జా జాతికి చెందినవారు కొందరు మరణానంతరం తోడువచ్చేది పచ్చబొట్టేనని విశ్వసిస్తారు. తమకు సన్నిహితులైన వారి పేర్లు చేతిపై రాయించుకుని ఆ వ్యక్తి తన చెంతనే వున్న అనుభూతిని పొందుతారు. కాలం గడిచిపోయినా స్మృతులు చెరిగిపోవు. ఆదివాసి యువతులు తమ తలలో దువ్వెనలు, పువ్వులు, ముత్యాలు, గాజులు, ఆకులు, రంగురంగుల బిళ్లలతో అలంకరించుకుంటారు. పేదరికానికి అట్టడుగుస్థాయిలో ఉండే ఈ వెనుకబడిన జాతిజనుల్లో ముఖ్యంగా రాయపూర్‌లో నివసించే 'భుజియా' జాతివారు పచ్చబొట్టంటే ప్రాణం పెడతారు. ఆహారపానీయాలకన్నా పచ్చబొట్టే వారికి అమితమైన ఇష్టం. చంబల్ పరిసరాల్లోని సహారియాజాతి స్త్రీలు పచ్చ పొడిపించుకోవటం జీవితంలో అతిముఖ్యమైన అంశంగా భావిస్తారు. సింధూరం, కుంకుమబొట్లు, మంచి వస్త్రాలు,






కరములనిండా కంకణాలెన్నున్నా పచ్చబొట్టు లేందే పైసా విలువ చెయ్యవు.

నృత్యం, సంగీతం అన్నీ పచ్చబొట్టు తరువాతే నంటారు కుమార్ తెగకి చెందిన స్త్రీలు. ఆది వాసుల్లో కొందరు పురుషులు కూడా ఎంతో ఇష్టంగా పచ్చ పొడిపించుకుంటారు. బైగా, భీల్ తెగల పురుషులు చెవి తమ్మలపై, భుజాలపై, చేతులపై పచ్చ పొడిపించుకుని పేర్లు రాయించుకుంటారు. పచ్చ పొడిపించుకోవటానికి నిర్దిష్టమైన స్థలమంటూ ఏదీలేదు. కొంద



రు చేతులపై మరికొందరు బాహువులపై పచ్చ పొడిపించుకుంటారు. కనుబొమలకు మధ్యలో, గడ్డంపై, చెవితమ్మలపై, నొసలుపై, బుగ్గలపైన కూడా పచ్చ పొడిపించుకుంటారు. కొందరు పాదాలపైనే కాక కాలివేళ్ళ మధ్యలో కూడా పచ్చ పొడిపించుకుంటారు. దీనివల్ల కాళ్ళు ఆరోగ్యంగా ఉంటాయని వారి విశ్వాసం.

ప్రతి సంవత్సరం ఊరూరా తిరుగుతూ గోదారినులు పచ్చ పొడుస్తారు. వీరికి సమాజంలో ఆదరణ ఉంది. పచ్చ పొడిపించుకుని తృణమో, పణమో ముట్టచెపుతుంటారు. పచ్చబొట్టుకు అవసరమైన ద్రవాన్ని ఈ స్త్రీలే తయారుచేసుకుంటారు. పచ్చపొడిచే గోదారినులు చుక్కలు, గీతలేకాక పక్షిరెక్కలు, చేపముళ్లు, లవంగాలు, సొరకాయ ఆకులు, పువ్వులు, తేలు, ఏనుగు, పులి వంటి ఆకృతుల్ని కూడా అద్భుతంగా పచ్చతో దేహంపై పొడుస్తారు. మరికొందరు గోదారినులు రామలక్ష్మణుల్ని పంచపాండవుల్ని కూడా శరీరంపై పచ్చతో నిల్పుతారు. నెమలి ఆకృతిని రకరకాలుగా చేతిపై పచ్చపొడిచే గోదారినులనేకులున్నారు. కొందరు భిల్లయువతులు కళ్ళ దగ్గర బిందువుల పచ్చ పొడిపించుకుంటారు. వీరిని చూస్తే మృగనయనలంటే వీరే కాబోలని అన్పించక మానదు. త్రిభుజాకారాలు, నక్షత్రాలు, సూర్యచంద్రాకృతులు మొదలైన గుర్తుల్ని నాలుగైదు సంవత్సరాల వయసున్న పిల్లల చుబుకంపై చిత్రిస్తారు. చిరల్యా అనే పేరుతో పొడిచే వంకర టింకర గీతల పచ్చబొట్టు కళ్ళకు వ్యాధినిరోధకంగా పనిచేస్తుందంటారు.

పచ్చబొట్టు పొడవటం ఎప్పుడు ప్రారంభమైనదనే విషయానికి రుజువులేమీ దొరకవు. బహుశా శృంగార ప్రకోపమైనప్పుడు అలంకరణపట్ల ఆసక్తి పెరిగి తన చుట్టూగల రకరకాల ఆకుల్ని పిండి వాటి రసంతో రంగురంగుల చుక్కల్ని శరీరంపై ఆదిమజాతి మానవుడు అలంకరించుకొని ఉంటాడు. ఆ చిత్రాలు చెరిగిపోకుండా శరీరంపై శాశ్వతంగా ఉండిపోవాలనే అభిలాషతో పచ్చబొట్టు పొడిచే విధానం






స్వంత పేర్లతోపాటు సన్నిహితుల పేర్లు కూడా...

కనుగొని ఉంటాడు.

పచ్చ పొడిపించుకోవటమనే ఆచారాన్ని పార్వతీదేవి ప్రారంభించిందని ఆదివాసులు విశ్వసిస్తారు. పచ్చబొట్టుతోనే దేవతల్ని సంతుష్టుల్ని చెయ్యగలమని కూడా వారు నమ్ముతారు. ఈ పచ్చద్వారా దేవతలకు విడివిడిగా గుర్తులు పెట్టుకుంటారు. పచ్చ పొడవటం కాళికాదేవి వరప్రసాదమేనని ఒక కథనం.



నుదుటినుంచి పాదాలదాకా పచ్చపొడిపించుకున్న 'భుజియా' జాతి బాలికలు.

పచ్చ పొడిపించుకుంటే అన్నిరోగాలు, శాపాలు దూరమవుతాయని కొందరి విశ్వాసం. పచ్చబొట్టే స్త్రీకి మాతృత్వం, సౌభాగ్యం ప్రసాదిస్తుందని నమ్మేవారు మధ్యప్రదేశ్‌లో అనేకులున్నారు.



వేతులు, కాళ్లపై పచ్చపొడువు కీళ్లరోగాలనుండి రక్షిస్తుంది.

పచ్చబొట్టుని మొదటినుండి స్త్రీలే పొడుస్తున్నా ఇటీవల పురుషులు కూడా ఈ వృత్తిని చేపబడుతున్నారు. పచ్చ పొడిచేందుకు ఉపయోగించే సూదిస్థానంలో బ్యాటరీతో నడిచే మెషీను వచ్చింది. అయినా సహజత్వాన్నే ఇష్టపడేవారు సూదితో పొడిస్తేనే అందమైన పచ్చ వస్తుందని భావించటం కద్దు.

ఇటీవల విదేశాలలో కూడా పచ్చబొట్టును వేలంవెర్రిగా పొడిపించుకుంటున్నారు. శరీరంలోని అన్ని భాగాల్లోనూ రకరకాల డిజైన్లతో పచ్చ పొడిపించుకుని ఆనందించటం యువతరంలో అధికమైపోయింది. కొందరైతే నున్నగా గుండు గీయించుకొని దానిపై చిత్రవిచిత్రాల ఆకృతుల్ని పచ్చ పొడిపించుకుంటున్నారు. వీపుపై, ఛాతీపై, పొట్టపై, కాళ్ళపై, తీగలు, పూలు, (సినీహీరోలు), నాయకుల చిత్రపటాలు, గీయించుకొనటం ఫ్యాషనైపోయింది. విదేశాలు మన సంస్కృతిని గుర్తించి ఆదరించాకే దాని విలువ తెలుసుకోవటం మనకు పరిపాటైపోయింది.

-జ్యోతిరాణి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 318181, 399444 ; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402

# కొందరికి పులుపంటే ప్రేమ ఎక్కువ !!

ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు ఏదే, మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ' 23 రకాల 'ప్రియ' పచ్చళ్ళు
మీ ముందు సిద్ధం

నోరూరించే, ఘుమఘుమలాడే 'ప్రియ' [illegible]

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.













**Pickles**
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసి

ఉషా [illegible] ఎంటర్‌ప్రైజెస్ లి [illegible] డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 48